తెలుగు సంస్కృతి, కళావైభవాన్ని ...సగర్వంగా చాటి చెప్పే అంతర్జాల పత్రిక...

# 64 కళలు.కాం

సకల కళల సమాహారం

సంపాదకుడు
కళసాగర్ యల్లపు




## పుష్కరోత్సవ 2010 2022

ప్రత్యేక సంచిక

బాలోత్సవ్ భవనం,
విజయవాడ
మార్చి 5, 2023

First and Foremost Fine Arts Magazine in Telugu

WWW.64KALALU.COM

తెలుగు సంస్కృతి, కళావైభవాన్ని...
సగర్వంగా చాటి చెప్పే అంతర్జాల పత్రిక...

# 64కళలు.కాం

సకల కళల సమాహారం

## పుష్కరోత్సవ ప్రత్యేక సంచిక

(2010 - 2022)

సంపాదకుడు:

కళాసాగర్ యల్లపు



ప్రచురణ:
64కళలు.కాం
www.64kalalu.com

**64కళలు.కాం** (సకల కళల సమాహారం)

## పుష్కరోత్సవ ప్రత్యేక సంచిక

*సంపాదకులు:*

**కళాసాగర్ యల్లపు**

**WWW.64KALALU.COM**
**12 th ANNIVERSARY SPECIAL**
*Edited by :*
Kalasagar Yellapu
*e-mail: artistkalasagar@gmail.com*

**First Edition :** Jan. 2023

**Price Rs. 100/-**

Title Design : **Kalasagar**

**For Copies:**
Kalasagar Yellapu
Mob: 98852 89995

&

Aneka Book Stall, Vijayawada.

**Printers:**
VijayaSai Printers,
Vijayawada

**లలితకళాప్రియులకు**

**64కళలు.కాం**

(సకల కళల సమాహారం)

**సమర్పిస్తున్న**

**పుష్కరోత్సవ ప్రత్యేక సంచిక**

# CONTENT

# కళల గురించి కన్న'కల' సాకారమైన వేళ...!




**కళాసాగర్ యల్లపు,**

వ్యవస్థాపక ఎడిటర్: 64kalalu.com


2021 సం॥లో ఆంధ్రకళాదర్శిని పుస్తక ప్రచురణకు ముందు కొందరు మిత్రులతో కలసి "ఆంధ్రా ఆర్టిస్ట్స్, స్కల్పటర్స్ అండ్ కార్టూనిస్ట్ అసోసియేషన్'' (AASCA)ను ప్రారంభించాను. 'ఆస్కా' ద్వారా 2002 సం॥లో కార్టూన్‌మేళా నిర్వహణ, 2004 సం॥లో ఆంధ్రకళాదర్శిని-2 ప్రచురణ వంటి అనేక కార్యక్రమాలు చేశాను.

2004 సం॥లో కంప్యూటర్ విజ్ఞానం మాసపత్రికలో పనిచేసే సమయంలో డాట్‌కామ్‌ల హవా ప్రారంభమైంది. అదొక కొత్త ప్రపంచంలా నన్ను ఆకర్షించింది. అప్పటి నుండి వెబ్‌సైట్లు, వెబ్ మేగజైన్లు రెగ్యులర్‌గా చదివేవాడిని.

**తొలి ప్రయత్నం:** 2005 సం॥లో ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో గ్రాఫిక్ డిజైనర్‌గా కొత్త ఉద్యోగంలో చేరాను. అక్కడ సంపాదించిన అనుభవంతో, అవగాహనతో 2007 సం॥లో AASCA2000.com పేరుతో ఒక వెబ్‌సైట్ ప్రారంభించాను. అందులో చిత్రకారుల చిత్రాలు, కార్టూన్లు వారి పరిచయాలు మాత్రమే ఉండేలా డిజైన్ చేశాను. అది అనుకున్నంత ఆదరణ పొందలేదు. కేవలం చిత్రకళ, కార్టూన్ రంగాలకే సంబంధించిన సమాచారం ఇవ్వడం వలన, అప్పటికి నెట్ ఉపయోగించే కళాకారులు తక్కువగా ఉండడం లాంటి కారణాలతో ఆశించిన స్థాయిలో ఫలితాలు రాలేదు. రెండేళ్ళ పాటు నడిపిన తర్వాత దాన్ని క్లోజ్ చేశాను.

మళ్ళీ 2009 సం॥లో సరికొత్త ఆలోచన చేశాను. ఒకటి, రెండు అంశాలపై పత్రిక తెస్తే దానికి పరిమిత సంఖ్యలో పాఠకులు ఉంటారని గ్రహించి, 64కళలకు సంబంధించిన విశేషాలతో పత్రిక తెస్తే ఎలా వుంటుంది? అని మిత్రులతో చర్చించాను. వారందరూ ఆలోచన బావుంది... కాని ఆచరణ కష్టమేమో అన్నారు. అలా సంవత్సరం పాటు మథనపడ్డాను. అప్పటి వరకు అనేక పత్రికలలో వ్యాసాలు రాసిన, పనిచేసిన అనుభవంవుంది. దానితో ఇక 2010 సం॥ ఆగస్ట్ నెలలో 64kalalu.com డొమైన్ రిజిష్టర్ చేశాను. అప్పటికీ పరిచయం వున్న TheUXGroup వారితో మాట్లాడి పత్రిక ఎలా వుండాలో, ఎలాంటి ఫీచర్లు కావాలో రఫ్ డిజైన్ ఇచ్చాను. అలా ప్రారంభమైన డిజైన్ వర్కు మూడు నెలలకు పూర్తయ్యింది. తర్వాత వెబ్ హోస్టింగ్ కూడా చేయడం జరిగింది.

**పత్రిక ఆవిష్కరణ:** నవంబర్ 1, 2010 న ఆవిష్కరణకు సిద్ధం అయ్యాను. నాకు అన్ని విధాల సహకరించే మిత్రులు, సుప్రసిద్ధ కార్టూనిస్ట్ ఏవిఎమ్‌గారి చేతుల మీదుగా ఆవిష్కరింప జేయాలని నిర్ణయించుకున్నాను.

అప్పటికే చాలా ఖర్చు చేయడంతో ఆవిష్కరణ మా ఇంట్లోనే నిరాడంబరంగా చేయాలనుకున్నాను.





*64కళలు.కాం పత్రికను ప్రారంభించిన ఏ.వి.ఎమ్.గారితో కళాసాగర్, వి. రామకృష్ణ.*

నవంబర్ 1 తేదీ ఉ॥ 9 గంటలకు ఆవిష్కరణ సమయం. కొద్దిమంది మిత్రులనే పిలిచాను. ఆ రోజు ఉదయం నుండి భారీ వర్షం పడడంతో.. కాస్త ఆలస్యంగా ఏ.వి.ఎమ్.గారు, కార్టూనిస్ట్ మిత్రుడు వి. రామకృష్ణగారు వచ్చారు, మాతో పాటు నా శ్రీమతి వుంది. ఆ విధంగా 2010 సం॥ నవంబర్ 1న విజయవాడ, మధురానగర్‌లోని మా ఇంటిలో పత్రిక ప్రారంభోత్సవం ఏ.వి.ఎమ్.గారి చేతుల మీదుగా జరిగింది. అలా అంతర్జాలం ద్వారా క్షణాల్లో 64kalalu.com పత్రిక ప్రపంచ వ్యాప్తంగా వున్న కళాకారులకి అందుబాటులోకి వచ్చింది.

**మాసపత్రికగా:** మొదట మాసపత్రికగా 50 పేజీలతో రంగుల్లో డిజైన్ చేసి, పి.డి.ఎఫ్. ఫార్మేట్‌లో ప్రతీనెలా 1 వ తేదీన అప్‌డేట్ చేసేవాడిని. ఎప్పుడైనా ఇంట్లో ఇంటర్‌నెట్ సమస్య తలెత్తితే బయట నెట్ సెంటర్‌కు వెళ్లి పత్రిక అప్‌డేట్ చేసేవాడిని. పత్రికను ప్రారంభిస్తే సరిపోదు కదా. నలుగురికి తెలియజేయడానికి ఇ-మెయిల్స్ ద్వారా లింక్‌లు పంపడం, కరపత్రాలు పంచడం ద్వారా ప్రచారం చేశాను. మొదట్లో పత్రికను నెలకు సగటున 5 వేలమంది చదివేవారు.

**యూనికోడ్ ఫాంట్స్:** 2016 లో అమెరికా నుండి వచ్చిన కూచిభొట్ల ఆనంద్‌గారు మచిలీపట్నంలో విడియాల చక్రవర్తి అనే మిత్రుడి ద్వారా పత్రిక గురించి తెలుసుకొని నాకు ఫోన్ చేశారు. "మీ ప్రయత్నం బావుంది... కాని ఇలా పి.డి.ఎఫ్. ఫార్మేట్‌లో పెట్టడం వలన గుగూల్ సెర్చ్‌ఇంజన్ పత్రికలోని కంటెన్ట్‌ను గుర్తించలేదు. కాబట్టి యూనికోడ్ ఫాంట్స్‌లోకి మార్చండి. ఇంకా ఎక్కువ మంది పాఠకులకు చేరువవుతుంది" అని సలహా ఇచ్చారు. ఆ దిశలో ఆలోచించాను. నిజమే అప్పటికే కొన్ని తెలుగు వెబ్ పత్రికలు యూనికోడ్ ఫాంట్స్‌లో ఉండడం గమనించిన నేను వెబ్ డిజైనర్‌తో మాట్లాడి, 'వర్డ్‌ప్రెస్' టెక్నాలజీలో పత్రికను రీ-డిజైన్ చేయించాను. అంతేకాకుండా సమాచార వ్యవస్థలో వచ్చిన వేగాన్ని అందుకోవడానికి మాసపత్రికను వారపత్రికగా మార్చాను.

**పుష్కరోత్సవం:** 2020 సం॥లో పది వసంతాలు పూర్తిచేసుకొని, కళారంగంలో సుస్థిర స్థానానికి చేరుకున్న శుభసందర్భాన్ని ఘనంగా దశమ వార్షికోత్సవం జరుపుకోవాలని ప్రణాళిక సిద్ధం చేసుకున్నాం. కాని... అశనిపాతంలా **'కోవిడ్-19'** రూపంలో వచ్చి పడింది. ఇక 2022 సం॥ నవంబర్ నాటికి పన్నెండేళ్ళు పూర్తిచేసుకొని ఆ పుష్కరోత్సవాన్ని ఇప్పుడు జరుపుకుంటున్నాం.

**ఎన్నో అనుభవాలు:** ఈ పన్నెండేళ్లలో టెక్నాలజీ పరంగా, రచనా పరంగా, పత్రికా ఎడిటర్‌గా ఎంతో నేర్చుకున్నాను. సాఫ్ట్‌వేర్ కంపెనీలో యూజర్ ఇంటర్‌ఫేస్ డిజైనర్‌గా పనిచేసిన నా అనుభవం ఈ వెబ్ పత్రికను ఇంతకాలం నడపగలిగేందుకు దోహదపడింది.

**ఎంతమంది చదువుతున్నారు:** ప్రపంచ వ్యాప్తంగా వున్న తెలుగువారు సుమారు 25 దేశాల నుండి సగటున నెలకు 20 నుండి 22 వేలమంది చదువుతున్నారు. కాని పత్రిక చదివే వారందరూ కామెంట్ల రూపంలో స్పందించరు. కొంతమందే మెయిల్స్ రూపంలోనూ, కామెంట్ల రూపంలోనూ, ఫోన్ల ద్వారాను వారి స్పందన తెలియజేసినపుడు ఎంతో ఉత్సాహాన్నిస్తుంది.

**'64కళలు.కాం'కు పెన్ను దన్ను:** 64kalalu.com పత్రిక సకలకళల సమాహారం కాబట్టి ప్రారంభంలో నాటకం, సినిమా, సంగీతం, సాహిత్యం లాంటి పలు అంశాలలో ఆర్టికల్స్ రాయించడం, సేకరించడం కష్టంగానే అనిపించింది. అయితే నాలుగేళ్ళ తర్వాత అనేక కళారంగాలకు చెందిన రచయితలు, కళాకారులు స్వచ్ఛందంగా వ్యాసాలు రాసి పంపించి నాలో ధైర్యాన్ని నింపి, ముందుకు నడిపిస్తున్నారు. అందుకు రచయితలందరికీ ఎప్పటికీ రుణపడి ఉంటాను.

**పత్రికకు ఆదాయం వస్తుందా?:** 2015 నుండి ప్రాంతీయ భాషల్లో వెబ్ పత్రికలకు 'గుగూల్ యాడ్‌సెన్స్' ద్వారా ప్రకటనలు ఇవ్వడం ప్రారంభించింది. 64kalalu.com పత్రికకు కూడా ప్రకటనలు వస్తున్నాయి, అయితే...ఈ పత్రికకున్న పరిమిత పాఠకుల కారణంగా యాడ్ రెవెన్యూ చాలా తక్కువగా వస్తుంది. ఎందుకంటే... **ఇది నెట్‌లో చదువుకునే పత్రికేగాని, కొట్లో కొని చదివే పత్రిక కాదు.**

**అనేక కార్యక్రమాలు:** ఈ 12 ఏళ్ళలో 64కళలు.కాం పత్రిక ఎక్స్‌రే సాహిత్య, సాంస్కృతిక సేవా సంస్థ, సుమధుర కళానికేతన్, జాషువా సాంస్కృతిక వేదిక, శ్రీశ్రీ సాహిత్య నిధి, తానా ప్రపంచ సాహిత్య వేదికలతో కలసి కార్టూన్లు, చిత్రలేఖనం పోటీలు, ప్రదర్శనలు నిర్వహించింది. 2021 సం॥లో చిత్రకళా పరిషత్‌తో కలసి రంగుల రారాజు **వడ్డాది పాపయ్య శతజయంతి ప్రత్యేక సంచిక** ప్రచురణ, విశాఖపట్నం, విజయవాడలలో జయంతి సభలు నిర్వహించింది. మరెన్నో కార్యక్రమాలకు మీడియా పార్ట్నర్‌గా వ్యవహరిస్తున్నది. 2021 సంవత్సరంలో **తెలుగు వికీపీడియా** వారు కూడా కళా సంబంధిత వ్యాసాలు రాయమని నన్ను వారి బృందలో చేర్చుకున్నారు. ఇప్పటికే వికీపీడియాలో కొన్ని వ్యాసాలు రాశాను. పుష్కరోత్సవానికి సహకరించిన మిత్రులందరికీ నా కళాభివందనాలు.

# మన సాంస్కృతిక శోభకు దర్పణం

మిత్రులు కళాసాగర్ గారికి అభినందనలతో...

గత 12 సంవత్సరాలుగా మీ సంపాదకత్వములో వస్తున్న 64 కళలు.కామ్ (64kalalu.com) పత్రికకు నేను కూడా ఒక పాఠకుడనే. ఈ పత్రిక తెలుగు రాష్ట్రాలకు, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌కు చెందిన సాంస్కృతిక రంగానికి కృషిచేసిన, చేస్తున్న కళాకారులను పరిచయం చేస్తూ ప్రోత్సాహపరచడం కళాకారులందరూ ఆనందించ దగిన సంగతి. చిత్రలేఖనము, శిల్పము, వ్యంగ్య చిత్రకళ, నాటక కళ, సాహిత్యము, సంగీతము, సినిమా, జానపద కళలలో నిష్ణాతులైన పెద్దల కృషిని నేటి తరాల యువతకు పరిచయం చేయుట, యువ కళాకారుల కృషిని, వారి విజయాలను ఎప్పటికప్పుడు ప్రచురించి ప్రోత్సహించుటలో ఈ పత్రిక చేసిన కృషి యువతకు చేదోడుగా నిలబడింది. యువత తమ కళారీతులలో మరింత కృషి చేయుటకు దోహదపడింది.

నాటక ప్రదర్శనలు, చిత్ర కళాశిబిరాలు, చిత్రకళా ప్రదర్శనలకు చేస్తున్న సమీక్షలు ప్రోత్సాహకరంగా ఉంటున్నాయి. వివిధ రంగాలలో ప్రచురింపబడుచున్న పుస్తకాలను ఎప్పటికప్పుడు పరిచయం చేస్తూ పుస్తక ప్రియులను ఆనందపరుస్తున్నాయి, రచయితలను సంతోషపరుస్తున్నాయి. నేటి ప్రచార సాధనాలలో ప్రాధాన్యత దొరకని పరిస్థితులలో ఈ పత్రిక మీ ఆధ్వర్యంలో ఆ లోటును తీర్చి మన సాంస్కృతిక శోభ నలుదిశలా వ్యాపించేందుకు చేస్తున్న కృషికి ధన్యవాదములు, మరొకసారి హృదయపూర్వక అభినందనలు.

ఒక విజయవంతమైన పుష్కర కాలాన్ని సాంస్కృతిక పునరుద్ధరణకు అంకితం చేసి ఈ విజయాలను ఒక గ్రంథ రూపంలో తెచ్చే మీ ప్రయత్నము సఫలీకృతం కాగలదని, మీ సేవలు సాంస్కృతిక రంగానికి మరెన్నో పుష్కరాలపాటు అందించగలరని ఆశిస్తూ మీకు సహకరించిన మిత్ర బృందానికి ఈ పత్రిక ద్వారా ప్రోత్సాహం అందుకున్న కళామూర్తులకు అభినందనలు.

తేదీ : 02.09.2022



**డా. బి.ఏ. రెడ్డి,** డి.లిట్.

అధ్యక్షులు: యంగ్ ఎన్వాయిస్ ఇంటర్నేషనల్,

హైదరాబాద్

# వినూత్నమైన ఆలోచన



64 కళలు(64kalalu.com) ఆన్లైన్ పత్రిక 12 సంవత్సరాలు పూర్తిచేసుకున్న సందర్భంలో నా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలియచేస్తున్నాను. సకల కళారంగాల్లోని కళాకారులకోసం ఒక ఆన్లైన్ పత్రిక ప్రారంభించాలనుకోవడమే ఒక వినూత్నమైన ఆలోచన. ఆ ఆలోచనకు చక్కటి రూపమివ్వడమే కాక ఆ పత్రికను 12 సంవత్సరాలుగా నిరాటంకంగా నిర్వహించడం, ఎప్పటికప్పుడు తాజా సమాచారాన్ని పొందుపరచడం నిర్వాహకుల నిబద్ధతను తెలియచేస్తోంది. ప్రచురిస్తున్న ఆర్టికల్స్‌లో కూడా సాధికారత, ఆకర్షణీయత సమపాళ్లలో ఉండడం హర్షణీయం. ఈ చక్కటి పత్రికకు సారధ్యం వహిస్తున్న కళాసాగర్ గారికీ, పత్రిక నిర్వహణకు నిరంతరం శ్రమిస్తున్న ఇతర సిబ్బందికీ హృదయపూర్వక

అభినందనలు తెలియచేస్తున్నాను.

**కిరణ్ ప్రభ**

సంపాదకుడు: www.koumudi.net

టాక్ షో ప్రయోక్త, అమెరికా

# పుష్కరోత్సవ వేళ... అభినందన



## డా॥ మండలి బుద్ధ ప్రసాద్

మాజీ ఉపసభాపతి, ఆం.ప్ర. శాసనసభ

తెలుగు జాతికి కళారంగంలో గర్వించదగిన చరిత్ర ఉంది. కానీ కళలకు సంబంధించి ప్రత్యేకించి పత్రికలు లేవు. పుస్తకాలు కూడా తక్కువే. ఇతర విభాగాలతో పోలిస్తే కళలపై వ్రాసేవారూ, వ్రాస్తున్నవారూ తక్కువే.

ప్రతిభావంతులైన మన కళాకారుల ఉత్కృష్టమైన కళాసేవను సమాజం గుర్తించాలన్న తపనతో శ్రీ కళాసాగర్ తన మిత్రులతో కలసి 64 కళలు.కాం సకల కళల సమాహారం వెబ్ పత్రిక 2010 సం॥లో స్థాపించారు. గత 12 సంవత్సరాలుగా కళావికాసానికి వెబ్ పత్రిక చేసిన కృషి ప్రశంసించదగింది. కళలకు సంబంధించి పత్రికలు లేని లోటు తీర్చడమే కాకుండా ప్రపంచపరివ్యాప్తంగా వేలమంది పాఠకులను సంపాదించుకుంది ఈ పత్రిక. ప్రసిద్ధ చిత్రకారుల కళాసేవను చక్కటి విశ్లేషనాత్మక వ్యాసాల ద్వారా తెలపటమే కాకుండా, కళారంగానికి సంబంధించి జరిగే కార్యక్రమాలను చక్కగా సమీక్షించి ప్రోత్సహించుట ఆనందదాయకం.

గత రెండు దశాబ్ధాలుగా చిత్రకళ, కార్టూన్ రంగాలకు పుస్తకాల రూపంలోనూ, ప్రదర్శనల రూపంలోనూ కళాసాగర్ ప్రశంసనీయమైన కృషి, సేవ చేస్తున్నారు. అందుకు కళాసాగర్ ఇటీవల ప్రచురించిన 'వడ్డాది పాపయ్య శతజయంతి' సంచిక, 'కొంటె బొమ్మల బ్రహ్మలు' పుస్తకాలే నిదర్శనం.

64 కళలు.కాం వెబ్ పత్రిక పుష్కరోత్సవ వేళ నా శుభాకాంక్షలు. కళాసాగర్‌గారికి ప్రత్యేక అభినందనలు.

కళలు మన జీవితంలో భాగం కావాలి. కళలను ప్రోత్సహించి కాపాడుకోవాలి. కళలే మన జాతి ఔన్నత్యాన్ని చాటిచెప్పేవి. ఈ సత్యాన్ని గుర్తింపచేస్తున్న శ్రీ కళాసాగర్‌కు, వారికి సహకరిస్తున్న వారందరికి మనసారా వందనాలు.

# నేను ప్రారంభించినందుకు గర్వంగా వుంది



## ఏవియం

సీనియర్ కార్టూనిస్ట్,
విజయవాడ

'64కళలు.కామ్' పత్రిక ప్రారంభించి అప్పుడే 12 సం॥లు అయ్యిందంటే ఆశ్చర్యంగా వుంది. ఇంతటి గొప్ప పత్రిక సంపాదకమండలిలో తొలి నుండి నేను వున్నందుకు, 2010 నవంబర్ 1 వ తేదీన నా చేతుల మీదుగా 64కళలు.కామ్ పత్రికను ప్రారంభించినందుకు గర్వంగాను, సంతోషంగానూ వుంది.

మిత్రుడు కళాసాగర్‌గారు ఎంతో దీక్షతో, తపనతో పత్రికను సర్వాంగ సుందరంగా నడుపుతున్నాడు. తను స్వతహాగా కళాకారుడు అయివుండి వెబ్ పత్రిక ద్వారా ఎందరో కళాకారులను పరిచయం చేయడం, ప్రోత్సహించడం అభినందనీయం.

ఒక టెలీస్కోప్ ఆకాశంలోని నక్షత్రాలను మనకు ఎలా చూపిస్తోందో... అచ్చం అలాగే తన వెబ్ పత్రిక ద్వారా ప్రపంచ కళాకారులందరినీ ఒకే వేదిక మీద మనకు పరిచయం చేస్తున్నాడు కళాసాగర్. మారుతున్న కాలానికనుగుణంగా టెక్నాలజీని అందిపుచ్చుకునే సమర్థత కలిగినవాడు కాబట్టే వెబ్ పత్రిక విజయవంతంగా 12 ఏళ్ళు తీసుకురాగలిగాడు.

ఈ శుభసందర్భంలో మిత్రుడు కళాసాగర్‌కు నా అభినందనలు.

# 'కాలనాళిక' 64కళలు.కామ్

కళాసాగర్ గారు చిత్రకారుడుగా, కార్టూనిస్ట్‌గా, గ్రాఫిక్ డిజైనర్‌గా బహుముఖ ప్రజ్ఞామూర్తిగా జగమెరిగిన కాదు... జగం నివ్వెర పోతున్న చైతన్య రస స్ఫూర్తి.

ఆయన 64 కళలు అని పేరు పెట్టినప్పుడు... ఐ మీన్ చూసినప్పుడు అవును 64 కళలు ఏంటో చూడాలి అనిపించి 'ఆంధ్ర వాచస్పత్యం' నిఘంటువు చూశాను.

64 కళల నిష్ణాతుల్ని పరిచయం చేస్తారా... ఆ రంగాల్లో ప్రముఖులని మన మధ్యకి తీసుకొస్తారా... వామ్మో అనిపించింది..

అలాంటి వాళ్ళందరినీ తీసుకురావాలి అంటే ఇది నిండు నూరేళ్ల పాటు నిలవాల్సిన పత్రిక... అని ఆలోచన ఆశీర్వాదమై మదిలో నినదించి నిర్ణయించుకుంది.

పుష్కర కాలం పాటు తన బాటలో తాను ప్రయాణిస్తూ కాదు కాదు... మనల్ని నడిపిస్తూ... విస్తు పరుస్తూ.. విశ్వరూపం చూపిస్తూ విశ్వాంతరాళంగా విస్తరిస్తున్న ఈ పత్రికలో నేను కూడా పరిచయం కావడం నా అదృష్టంగా భావిస్తున్నాను..

ఇందులోనే నా నృత్య రూపకాల రచనల్ని ప్రస్తావిస్తూ నాకు 'బ్యాలే బాదుషా' బిరుదు ఇవ్వడం కూడా నాకు భలే గ్రేడింగ్‌గా అనిపిస్తూ ఉన్నప్పుడు థ్రిల్లింగ్‌గా ఉంటుంది..

12 సంవత్సరాలుగా నడుస్తున్న ఈ పత్రిక వీక్షకులు. దీనికి మనసులో ఎన్నో ప్రశంసలు అందించి ఉంటారు.

ద లార్జెస్ట్ సర్క్యులేటెడ్ డాష్ డాష్ అనక్కర్లేదు ఈ 64 కళలు.కామ్ (64kalalu.com) ని. ఇది వెబ్ సిరీస్.

వందేళ్లపాటు నడిచే.. వెయ్యి ఏళ్ల పాటు నిలిచే తడి ఆరని తెలుగు మదిని అలరించే పత్రిక...అక్షరాలా మన మనవళ్ళు కూడా చూసి అచ్చెరువొందే పత్రిక... చిరాయురస్తు...!! అన్నట్టు చివరగా చెప్తున్నా పదేపదే చెప్పాలనిపిస్తున్న మాట ఇందులో పరిచయమైన ప్రతి కళాకారుడు కచ్చితంగా వేయి ఏళ్ళు బతుకుతాడు.



-బ్నిం

చిత్రకారుడు, కార్టూనిస్ట్, రచయిత

హైదరాబాద్

ఎన్ని తరాలైనా చరిత్రలో నిక్షిప్తమై ఉంటాడు. అంతకన్నా అదృష్టం ఏ కళాకారుడు కైనా ఉండదు.

"జయంతితే సుకృతినో రస సిద్ధా కవీశ్వరా నాస్తి తేషాం యశః కాయే జరాన్మరణ జం భయం" అని మహాకవుల వాక్యం..ఇక్కడ ప్రత్యక్షమవుతుంది.

మనిషి డబ్బు సంపాదిస్తాడు. కీర్తి కూడా సంపాదిస్తాడు. డబ్బు బంధువులు పంచుకుపోతారు... కీర్తి మాత్రం ఇలదించి పోతాడు..

అలాంటప్పుడు అతను మరణించినా చిరంజీవి అయిపోతాడు.. అలా ఎందరో వ్యక్తుల విఖ్యాతిని ఇంటర్నెట్ లాంటి 'కాలనాళిక'లో నిక్షిప్తీకరిస్తున్న 64 కళలు .కామ్ పత్రికకు మనం... జీవితాంతం కాదు జీవితం అంతమైనా రుణపడి పోతున్నాం.. ఇందులో ప్రచురించిన ప్రతి వ్యక్తి ఆయుర్దాయాన్ని పొందినట్టే కదా..

మరొకసారి కళాసాగర్‌గారికి చప్పట్లు కొడదాం.. ఎందుకో.. ఎందుకో.. ఎందుకో... మనందరికీ తెలుసు...! మనల్ని చారిత్రాత్మకంగా బతికిస్తున్నందుకు..

# నన్ను చిత్రకళా రచయితను చేసిన 64 కళలు.కాం




## వెంటపల్లి సత్యనారాయణ

చిత్రకారుడు, కార్టూనిస్ట్,
చిత్రకళా రచయిత


నేను ఎప్పుడో ఒక సారి ఒక చిత్రకారుడిని పరిచయం చేసే క్రమంలో జీవితం గొప్ప రంగుల సమ్మేళనమే కాదు అనేక సంఘటనల సమాహారం కూడా అని రాశాను. అవును నిజంగా జీవితం అనేది అనేక సంఘటనల సమాహారమే. మనిషి జీవితంలో జరిగే అనేకనేక సంఘటనల్లో తెలిసి జరిగేవి కొన్నయితే తెలియకుండా సంభవించేవి మరికొన్ని. మనిషికి ఆనందాన్ని పంచేవి కొన్నయితే మనిషి జీవితంలో విషాదాన్ని నింపేవి మరికొన్ని. మనిషికి మంచి గుర్తింపును తెచ్చే ఘటనలు కొన్నైతే, మనిషి గుర్తింపుని నేలకు రాసే ఘటనలు మరికొన్ని. ప్రస్తుత విషయానికి గనుక వచ్చినట్లయితే 64 కళలు.కాం (64kalalu.com)తో నా బంధం ఎప్పుడూ ఆనందమును కలిగించే విషయం అనే చెప్తాను. కారణం అది నన్ను రాష్ట్రంలో ఒక ప్రముఖ చిత్రకళా రచయితగా నిలబెట్టింది.

ఖమ్మంజిల్లాలో ఎక్కడో మారుమూల ప్రాంతంలో ఛత్తీష్ గడ్ బోర్డర్‌లోని ఏజెన్సీ ప్రాంతం వెంకటాపురం సబ్ ట్రెజరీకి ఉపఖజానాధికారిగా పనిచేస్తున్న నాకు 2010 ఆగస్టు మాసంలో అనుకుంటాను మిత్రులు కళాసాగర్ గారు ఒకసారి ఫోన్ చేసి "త్వరలో 64 కళలు.కాం (64kalalu.com) అంతర్జాల మాసపత్రికను ప్రారంభిస్తున్నాము. మీరు ప్రజాశక్తిలో చిత్రకారుడు 'కాళ్ళ'ను గురించి రాసిన ఆర్టికల్ అలాగే సూర్య పేపర్లో భగీరథీగారి గురించి రాసిన ఆర్టికల్స్ చదివాను. మీ రచనా శైలి ఎంతో బాగుంది. మా 64 కళలు.కాం మాగజైన్‌కి ప్రతినెలా ఒక చిత్రకారుణ్ని మీరే పరిచయం చేయాలి" అని కోరినప్పుడు నిత్యం ఆర్థికపరమైన లావాదేవీలతో కూడుకున్న ఉద్యోగమే గాక ఎక్కడో మారుమూల అటవీ ప్రాంతంలో పనిచేస్తున్న నాకు ఇది సాధ్యమా అనిపించినా ఏదో ఒక మొండి ధైర్యంతో ఓకే చెప్పడం, ఆ తర్వాత అక్టోబర్ 2010 లో ప్రారంభమైన 64 కళలు.కాం మాగజైన్‌లో ప్రారంభ వ్యాసంగా చిత్రకారుడు కాళ్ళ గురించే రాయడం మొదలుపెట్టి దశాబ్ద కాలం నిరంతరాయంగా నేను రాష్ట్రంలోని ఎందరో లబ్ద ప్రతిష్టులుగా పేరుగాంచిన, దామెర్లరామారావు, మాదేటిరాజాజీ, కృష్ణారెడ్డి, అంట్యాకులపైడిరాజు, కాపురాజయ్య, కొండపల్లి శేషగిరిరావు, తోటవైకుంటం, బి.ఏ.రెడ్డి, ఎల్లాసుబ్బారావు,బాపు, మోహన్, మంచెం సుబ్రహ్మణ్యేస్వరరావు లాంటి చిత్రకారులతో బాటు ఇంకా ఈ కళలో రాష్ట్రవ్యాప్తంగా విశేష కృషి చేస్తున్న ఎందరో చిత్రకారుల్ని స్వయంగా కలిసి ఇప్పటికే 180 చిత్రకారులను పరిచయం చేయడం జరిగింది. ఈ క్రమంలో ఫ్రాన్సు దేశానికి చెందిన కెరల్ బెహతూ, అలాగే జపాన్ దేశానికి చెందిన చిత్రకారిణి మేగోమి సకాకిడా మరియు బెంగుళూరుకి చెందిన మరో చిత్రకారిణి యామిని లాంటి వారిని కూడా స్వయంగా కలిసి ఇంటర్వ్యూ చేసి 64 కళలు.కాం (64kalalu.com)లో ఆర్టికల్స్ రాయడం మరో గొప్ప అనుభూతి. గత రెండేళ్లుగా మాత్రం ఖమ్మం జిల్లా ఖజానా ఉప సంచాలకునిగా నాకున్న పని ఒత్తిడి వలన నా ఈ చిత్రకారుల పరిచయ వ్యాసరచనలో కొంత అంతరాయం ఏర్పడిన మాట వాస్తవం అయినప్పటికీ వీలున్నప్పుడు అడపాదడపా రాస్తూనే వున్నాను.

జీవితంలో మనిషి చేసిన కొన్ని పనులు ఒక్కోసారి ఆ వ్యక్తికి ఊహించని గుర్తింపుకు నోచుకునేలా చేస్తాయి. అలా జరిగిన ఒక గొప్ప సంఘటనే 2017లో కేంద్ర లలితకళా అకాడమి న్యూ ఢిల్లీ వారు దృశ్య కళలపై నిర్వహించిన జాతీయ సెమినార్ కి ఉభయ తెలుగు రాష్ట్రాలనుండి ఆహ్వానింపబడ్డ నలుగురు రచయితలలో నేను ఒకడిని కావడం. నిజంగా ఈ ఘటన నాకు గొప్ప ఆశ్చర్యం కలిగించింది. ఎక్కడో మారుమూల అటవీ ప్రాంతం నందలి వెంకటాపురంలో పనిచేస్తూ నేను రాసే ఆర్టికల్స్‌ని గుర్తించి నన్ను లలితకళా అకాడమి మూడు రోజుల సెమినార్‌కి ఢిల్లీ

రమ్మని ఆహ్వానించేటంతటి గుర్తింపు రావడానికి కారణం నా ఆర్టికల్స్ ఈ 64 కళలు.కాం ద్వారా ప్రపంచవ్యాప్తంగా అప్పటికే అంతర్జాలంలో 27 దేశాలలో వీక్షించడం ఒక కారణం. ఈ విధమైన గుర్తింపువలన అప్పటికి నేను ఏడేళ్లుగా రాష్ట్రమంతా తిరిగి చిత్రకారులను స్వయంగా కలిసి వారి చిత్రాలను వీక్షించి నాదైన అనుభూతి చెంది, వారిని గూర్చి రాసేందుకు నేను పడిన తపన, శ్రమ అంతా కూడా మర్చిపోయి ఒక మధురానుభూతిని కలిగించేలా చేసింది ఈ కేంద్ర లలితకళా అకాడమి వారి ఆహ్వానం. ఈ క్రమంలోనే అంతవరకూ నేను రాసిన చిత్రకారుల పరిచయ వ్యాసాలను చిత్ర దీప్తి, రూపదీప్తి, మరియు కళాదీప్తి అనే పేరుతో మూడు సంపుటాలుగా తీసుకురావడం మరో మంచి అనుభూతి.

అలాగే 2012 జనవరి మాసంలో చిత్రకారులు బాపు గారు చెన్నై నుండి చర్లలో వుండే నా అడ్రస్‌కి తన అందమైన స్వదస్తూరితో లేఖ రాసి పంపడం నాకు మరింత ఆశ్చర్యం కలిగించింది. అందులో వారు రాస్తూ "సత్యనారాయణగారూ మీరు ఎంతో అభిమానంతో నాగురించి 64 కళలు.కాం లో వ్రాసిన వ్యాసం ఎంతో బాగుంది. అనేకానేక కృతజ్ఞతలు. అలాగే ఇతర చిత్రకారులను గురించి రెగ్యులర్‌గా రాస్తు చేస్తున్న మీ కళాకృషికి నా జోహార్లు." అంటూ ఒక అందమైన రేఖా చిత్రంతో బాటు స్వదస్తూరితో కూడిన లేఖను నాడు బాపుగారి నుండి అందుకోవడం మరో గొప్ప అనుభూతి. ఇదంతా నాకు విశ్వకళావేదికగా నిలిచిన 64 కళలు.కాం (64kalalu.com) వల్లనే సంభవించిందని వేరే చెప్పనవసరం లేదు.

చిత్రకారులతో బాటు కార్టూనిస్టుల కోరిక మేరకు కూడా 64 కళలు.కాం లో "మన కార్టూనిస్టులు" పేరుతో కార్టూనిస్టుల పరిచయ వ్యాసాలను కూడా నేనే రాయడం ప్రారంభించి తలిశెట్టి రామారావు, బాపు, బాలి, మోహన్, జయదేవ్ బాబు, శంకర్ మొదలైన వారి గురించి కూడా తొలుత నేను రాసినా ఆ తదుపరి దానిని మిత్రులు కళాసాగర్‌గారు కొనసాగించడం జరిగింది.

లలితకళారూపాలైన సంగీతం, సాహిత్యం చిత్ర, శిల్పనాట్య నాటక కళతో పాటు భిన్న విభిన్న కళాప్రక్రియలకు సంబంధించి నిరంతరం రాష్ట్రంలో జరిగే కళాసాంస్కృతిక కార్యక్రమాలను విశ్వవేదికగా పరిచయం చేస్తున్న 64kalalu.com ని పుష్కర కాలంగా నడిపించడం వెనుక ఎంతటి తపన, కృషి వుందో నాకు తెలుసు. అందుకు కేవలం మేధోపరమైన శక్తినే గాక ఆర్థికంగా, హార్దికంగా కూడా ఎన్నో వ్యయ ప్రయాసలున్నాయి. వాటన్నింటిని తట్టుకుంటూ ఇంతకాలం 64 కళలు.కాం పత్రికను నడిపించడం గొప్ప విషయం. ఆ కృషిలో నా వంతు పాత్రను నేను నిర్వహించినందుకు నాకు కూడా ఎంతో సంతోషంగా వుంది. ఎన్నోసార్లు ఈ వార్షికోత్సవాన్ని ఘనంగా జరుపుకోవాలని కన్న కలలు కనీసం నేటికైనా నిజమౌతున్న మంచి సందర్భంలోనే Toons Mag Norway వారు world cartoonist of the year -2020 అవార్డ్ కోసం నిర్వహించిన ప్రపంచ కార్టూన్ పోటీలలో కరోనా పై వేసిన నా కార్టూన్ అత్యధిక ఓట్లతో గెలుపొంది world cartoonist of the year-2020 అవార్డ్‌ని గెల్చుకున్న సందర్భంగా నేను వేసిన కరోనా కార్టూన్లతో తొలిసారిగా వేస్తున్న నా కార్టూన్ బుక్ కూడా ఈ సందర్భంలో విడుదల కావడం మరో మంచి అనుభూతి.

అరవయ్యో దశకంలో సమాచారవ్యవస్థ ఇంతగా అభివృద్ధి చెందని కాలంలోనే చిత్రశిల్ప కళల వికాసానికి ఆంధ్రాంగ్ల భాషలలో సుప్రసిద్ధ చిత్రకారుడు మాదేటి రాజాజీ రాజమహేంద్రవరం నుండి నడిపిన మాసపత్రిక "తూలిక", అలాగే అదే దశకంలో చలసాని ప్రసాదరావు సంపాదకత్వంలో "కళ" పేరుతో వచ్చిన ఆరు సంపుటాలు తర్వాత చిత్రకళతో పాటు మిగిలిన కళారూపాల గురించి ప్రపంచ వ్యాప్త తెలుగు ప్రజలకోసం పుష్కరకాలం ఒక పత్రికను నడపడం అన్నది నిజంగా ఎంతో గొప్ప విషయం. కళాసేవయే పరమార్ధంగా ఇన్నేళ్ళుగా ప్రపంచాన 27 దేశాల ప్రజలనలరిస్తున్న 64 కళలు.కాం (64kalalu.com) పత్రిక మరింతకాలం ఇలాగే కళాసేవ చేస్తూ ఇంకా ఎందరో కళాకారుల ప్రతిభను ప్రపంచానికి తెలియజేయాలని అందుకు కావాల్సిన సహాయ సహకారాలను భగవంతుడు ఈ పత్రిక ఎడిటర్, మిత్రులు కళాసాగర్‌గారికి అందజేయాలని పుష్కరకాలం నింపుకున్న పత్రికకు, ఎడిటర్ కళాసాగర్‌గారికి ఈ పత్రికను తమ రచనలతో నడిపిస్తున్న రచయితలు ఇతర కళాకారులందరికీ నా హృదయ పూర్వక అభినందనలు.

**కృషి - మేథస్సు - హృదయం సమ్మిళితమై**

**వుద్భవించే ఫలితమే చిత్రకళ.**

**- జాన్ రస్కిన్**

# ‘ఉచిత’ రీతిలో అందరికీ అందుబాటులో...



బి.యం.పి. సింగ్

రచయిత, విజయవాడ

ప్రధానంగా పత్రికల మనుగడను పాఠకాదరణ కాలానుగుణంగా ఆయాపత్రికలు అందించే విషయాలు, పాటించే నిబద్ధతలు ప్రభావితం చేస్తాయనటంలో సందేహం లేదు.

ఈ క్రమంలో కొన్ని పత్రికలు పాఠకుల పత్రికల స్థాయి నుండి “కుల” పత్రికలుగా ఎ‘దిగి’ పాఠ“కుల” ‘పత్రిక’లుగా పేరు గడిస్తున్న తరుణంలో ఈ ధోరణికతీతంగా కేవలం.. కళారాధనే ధ్యేయంగా కుల,మతాలకతీతంగా సంగీత, సాహిత్య, నృత్య, చిత్రలేఖనం, నటన వంటి అనేక కళారూపాలలో రాణించిన రాణిస్తున్న కళాకారుల కళావైభవాన్ని 64కళలు.కామ్ (64kalalu.com) పేరిట పాఠక ప్రపంచానికి అందించే సదాశయంతో ఆవిర్భవించిన ఈ ‘ఇ’ మ్యాగజైన్ పలుదేశాల్లో పుష్కలంగా వేలాదిమంది తెలుగు పాఠకులను ఆర్జించి ఓ పుష్కర కాలంగా విజయవంతంగా నడుస్తున్నందుకు అభినందిస్తున్నాను.

నేడు ప్రింట్ మీడియా కన్నా ఎలక్ట్రానిక్ మీడియాకు వున్న శక్తిని, ఆ మీడియాపై పాఠకులకు ఉన్న ఆసక్తిని గమనించిన ఎడిటర్ యల్లపు కళాసాగర్ ఈ మ్యాగజైన్‌ను “కళలు, కళాకారుల గురించి సమాచారం అందించే తొలి తెలుగు వెబ్ మ్యాగజైన్”గా నడుపుతుండటం వారికి కళల పట్ల గల ఆరాధ్య భావానికి ఓ అక్షర సాక్ష్యం !

నేటి “నెట్” ప్రపంచాన ఈ బిజీ రోజుల్లో పాఠకులకు కొట్లోకెళ్లి పుస్తకాలు కొనుక్కొని చదివే తీరిక లేనందున.. దిన –వార, మాస పత్రికలన్నీ నెట్ ద్వారానే “నెట్” కొస్తున్నాయి కనుక ఈ 64 కళలు మ్యాగజైన్ కేవలం ఓ నెట్ మ్యాగజైన్ గానే ‘ఉచిత’ రీతిలో అందరికీ అందుబాటులో వుండటం కూడా ఈ పత్రిక ఇన్నాళ్ళూ, ఇన్నేళ్లూ వర్ధిల్లటానికి ఓ కారణంగా చెప్పుకోవచ్చు.

ఓ వర్గానికో, ప్రాంతానికో పరిమితం కాకుండా ఉభయ తెలుగు రాష్ట్రాల కళాకారులెవ్వరైనా సరే.. చిన్న – పెద్ద అనే తేడా లేకుండా వారి వారి కళాజీవన చిత్రాలను / చరిత్రలను సేకరించి, (ప్రచురించి) పాఠకులకు అందించటంలో ఈ 64 కళలు మిగతా పత్రికలకు ఓ ఆదర్శంగా నిలవటం దీని యాజమాన్యానికి దక్కిన గౌరవం.

ఈ 64కళలు.కామ్ (www.64kalalu.com) చందాలందుకుని నడిపే / నడిచే పత్రిక కాకున్నా ఇది ఈ చందాన విజయవంతంగా నడపటంలో ఎడిటర్ గారి ప్రతిభను ప్రత్యేకంగా అభినందించి తీరాలి.

అది ఏ పత్రికైనా సరే... ఆ పత్రిక యొక్క ఎడిటర్‌ను బట్టి ఎలివేషన్ దానిలో రైటర్స్‌ను బట్టి రెప్యుటేషన్ దానిలో వున్న “సరుకు”ను బట్టి సర్క్యులేషన్ వుంటాయన్నది పాఠక జగమెరిగిన సత్యం !

ఈ పై గుణాలన్నీ ఈ ‘64కళలు.కామ్’ లో వున్నందునే ఈ మ్యాగజైన్‌ను...పలు సంస్థలు గుర్తించి.. అభినందించటం జరుగుతున్నది.

ఈ మ్యాగజైన్ ప్రారంభించిన తొలి నాళ్ల నుండీ నేనూ ఓ రచయితగా పాలుపంచుకోవడం నాకు ఆనందంగా ఒకింత గర్వంగాను వున్నది.

విజయవాడ నగరంలోని వివిధ రంగాలకు చెందిన కొంతమంది ప్రముఖుల గురించి “విజయవాడ ప్రముఖులు” పేరిట చేసిన నా రచనకు విశేషాదరణ లభించింది. దీనితో పాటే “ధృవతారలు” ఈ మ్యాగజైన్‌లో చోటుచేసుకోవడం వలన ఆ అక్షరాలకు మరింత సార్ధకత సమకూరిందని భావిస్తున్నాను.

మారుతున్న కాలంతో పాటు కలం, కాలు కదుపుతూ తన నామధేయానికి తగిన ధ్యేయంతో 64కళలు.కామ్ కళాసేవలో, కళాకారుల సేవలో కళకళలాడుతూ కలకాలం నిలవాలని ఆకాంక్షిస్తూ శుభాకాంక్షలు.

# బృహస్పతీ వర ప్రసాదితమైన గొప్ప ఆలోచన...



**డా. జయదేవ్ బాబు సజ్జా,** M.Sc., Ph.D.,
కార్టూనిస్ట్ జయదేవ్, చెన్నై

ఒక కిన్నెరుడు (అశ్వ శరీరం, నర ముఖం గలవాడు) ఒక కింపురుషుడిని (అశ్వముఖం, నరశరీరం గలవాడు) ఎదుర్కోవలసి, వాడిని ఓడించే ఉపాయాలకోసం బృహస్పతిని ఆశ్రయించాడు. ఆయన తన లైబ్రరీలోంచి గ్రంథ సంజ్ఞా దర్పణం అనే ఒక ప్రామాణిక గ్రంథం తీసి ఇచ్చి "చదువుకో పో, ఇందులో అనేక మార్గాలున్నాయి" అని పంపించేశాడు. కిన్నెరుడు, ఆ గ్రంథం మొత్తం చదివాడు, అందులో అరవైనాలుగు విద్యల పట్టిక వుంది. వాటిని అర్ధం చేసుకునేందుకు మరికొన్ని గ్రంధాలు బృహస్పతిగారి నుంచి తెచ్చుకుని శుక్రనీతి సారం, చంపూరామాయణం, రఘువంశ వ్యాఖ్య, ఇలా ఒక్కటేమిటి అన్నిటినీ అహోరాత్రులు శ్రమించి చదివాడు. అయితే కింపురుషుడిని ఏ విధంగా ఓడించ వచ్చో, ఆ పద్ధతి గురించి ఏ గ్రంథంలోనూ చెప్పలేదు. కిన్నెరుడు హతాశుడై పోయాడు.

అశ్వముఖం గల కింపురుషుడు, తనని ఎవరైతే నవ్వించ గలుగుతారో వారి చేతిలో ఓడినట్లే అన్నది పందెం. ఈ పందెం గెలవడం ఎలా. గుర్రం నవ్వినా, ఏడ్చినా, ఒకే రకమైన సకిలింపు. అది నవ్వో, ఏడ్పో చెప్పలేము. కిన్నెరుడు తల పీక్కున్నాడు. బృహస్పతిగారు ప్రత్యక్షమై ''నాయనా కింపురుషుడు నవ్వాలంటే ఒకే మార్గం, అతడికి వ్యంగ్య చిత్రం ఒకటి గీసి చూపించు. దాన్ని చూసి, పళ్ళికిలించి తోకాడిస్తే గుర్రం నవ్వినట్లే పో" అని చెప్పి అదృశ్యుడయ్యాడు.

కార్టూన్ చిత్రకళ ఒక అద్భుతమైన కళ. అది..వశ్యము, ఆకర్షణము, మోహనము, లిపికర్మ, వాచక కళల సమన్వయం. అటువంటి ప్రత్యేక కళని స్వంతం చేసుకో గల్గిన వాడే కొంటె బొమ్మల బ్రహ్మ.

కళాసాగర్ మనందరికీ తెలిసిన కొంటె బొమ్మల బ్రహ్మ. ఆయనకి, కార్టూనిస్టుకే సాధ్యమయ్యే బృహస్పతీ వర ప్రసాదిత మైన, గొప్ప ఆలోచన ఒక పుష్కరం క్రితం తట్టింది. దాని ఫలితమే, 64 కళలు.కాం.(64kalalu.com) వెబ్ పత్రిక. యావత్ ప్రపంచంలో ఈ పత్రిక తెలియని తెలుగు పాఠకుడే లేడు. ప్రారంభించిన తొలి సంచిక నుంచీ నేటి సంచిక వరకూ, కళాసాగర్ వైవిధ్యమైన అంశాలను పాఠకులకు పరిచయం చేస్తున్నారు. వివిధ కళాకారులను తెరమీదికి తీసుకు వచ్చి సన్మానిస్తున్నారు. అందమైన మన తెలుగు భాషలో ప్రతీ నెల, రుచికరమైన వ్యాసాలూ, చిత్ర కథలూ గల విందు భోజనం వడ్డిస్తున్నారు. ప్రతీ సంచికా కన్నుల పండువుగా సమర్పించడానికి అనునిత్యమూ కృషి సల్పుతున్న కళాసాగర్‌గారిని అభినందించి తీరాలి.

ముఖ్యంగా తెలుగు కార్టూనిస్టులు కళాసాగర్‌గారికి రుణ పడి వున్నాము. పది సంవత్సరాల పాటు శ్రమించి "కొంటె బొమ్మల బ్రహ్మలు" కార్టునిస్టుల సంకలనం, క్రిందటేడు (2021) వెలువరించి, దేశంలోనే ప్రప్రథమైన సాధన తన స్వంతం చేసుకున్నారు. అందుకు సకల తెలుగు పాఠక మానవాళే గాక, కిన్నెర కింపురుషాదులు సైతం కళాసాగర్ గారిని మెచ్చుకోవాలి. ఈ పన్నెండవ వార్షికోత్సవ శుభ సందర్భంగా 64కళలు.కాం (64kalalu.com) పత్రిక భవిష్యత్తులో మరింత శోభాయమానంగా వెలుగొందుతూ ముందుకు సాగాలని కోరుకుంటూ, చిరంజీవి కళాసాగర్‌గారికి నా ఆశీస్సులు తెలియ జేసుకుంటాను.

చెన్నై. 21-08-2022.

**చిత్రకారుడు తన పనితనాన్ని భాషద్వారా గాక,**
**చక్కని 'కళా'సృష్టి ద్వారా బయటపెడతాడు.**

**- పికాసో**

# జీవితం ఒక పండగ, జీవనం అద్భుతమైన కళ

చతుష్షష్టి కళల సమాహారం మన ఆహార్యంలో ఇమిడి మనల్ని నిత్య సంతుష్టులను చేస్తూ జీవితానికి అర్థాన్ని సమకూర్చి ఇహలోకంలో స్వర్గాన్ని మన మానసంలో నిలుపుతాయి.

భారత దేశం అరవై నాలుగు కళలకు పుట్టినిల్లు. మనిషి పుట్టుకతో ఏదో ఒక లేదా కొన్ని కళలలో అభినివేశం కలిగి ఉంటాడు. తన అభిరుచిని తాను గుర్తించి దానికి పదును పెట్టి తనను తానుగా ఆ కళలో మరింత ప్రావీణ్యతను సంపాదించి తనను తాను ఆనంద పరచుకోవడమే కాక ఇతరుల మానసాలను ఆనంద సాగరంలో ఓలలాడింప చేస్తాడు.

ఒక్క కళలో ప్రవేశానికే మనిషి తాదాత్మ్యం చెందుతుంటే... మీరు, మీ '64కళలు.కాం' సకల కళల సమాహారం ద్వారా పాఠకుల మనసులను ఎంతగా ఆకట్టు కుంటారు అనేది ఎంతగా చెప్పినా తక్కువే.

ఈనాడు అనాదిగా ఉన్న ఎన్నో పత్రికలు మూతపడుతూ వస్తున్నాయి. ప్రజలు సాంకేతికంగా, వైజ్ఞానికంగా ఎదుగుతూ... వెబ్ పత్రికలను ఎంతగానో ప్రోత్సహిస్తున్నారు.

పుష్కర కాలంలో 64 కళలు (64kalalu.com) పత్రికకు ఎందరో అభిమానులు అయ్యారు.

ఈ పత్రిక అన్ని రంగాలలో ఉన్న కళాకారులు, రచయితల, పాఠకుల ఆదరాభిమానాలతో...విశ్వపత్రికగా ఎదగాలని మనసారా కోరుకుంటూ... ఎడిటర్ కళాసాగర్ గారికి నా అభినందనలు తెలియజేస్తున్నాను.

మీ

డా. ప్రసాద్ తోటకూర




**డా. ప్రసాద్ తోటకూర**

తానా పూర్వాధ్యక్షులు,

ప్రస్తుత తానా ప్రపంచ సాహిత్య వేదిక నిర్వాహకులు.

డాలస్, టెక్సాస్, అమెరికా.





**డా. తుర్లపాటి పట్టాభిరాం**

బహుగ్రంథ రచయిత,

అధ్యక్షులు: స్కోర్ మోర్ ఫౌండేషన్


## ఒకే వేదిక

'64కళలు.కాం' అంతర్జాల పత్రికను ప్రారంభ సంచిక నుండి చదువుతున్నాను. సంగీతం, నాటకం, సాహిత్యం, నాట్యం, చిత్రకళ, కార్టూనింగ్... ఇలా ఎన్నో కళారంగ సంబంధిత వ్యాసాలతో రసానందాన్ని ఆవిష్కరిస్తున్నారు. బి.ఎం.పి. సింగ్ గారి 'ధృవతారలు' ఫీచర్ ద్వారా ఎందరో ప్రముఖుల గురించి తెలుసుకుంటున్నాను. టెక్నాలజీని అందుకొని వివిధ కళాకారులను ఒకే వేదిక ద్వారా పరిచయం చేయడం అభినందనీయం. విజ్ఞానం, వినోదం, పాఠకుల భాగస్వామ్యం ఇలా అన్ని విధాలుగా అలరిస్తూ 12 వసంతాలు పూర్తి చేసుకున్న సమయాన మిత్రులు కళాసాగర్ గారికి, మీ బృందానికి శుభాభినందనలు.

# పుష్కర ప్రస్థానం




## మన్నె శ్రీనివాసరావు

రంగస్థల నటప్రయోక్త, సాహితీవేత్త, చరిత్ర పరిశోధకులు
**రేపల్లె - 522265,** బాపట్ల జిల్లా


సాహిత్యం, కళలు చాలా ఉత్కృష్టమైనవి. అవి వ్యక్తులను, తద్వారా వ్యవస్థను జాగృతపరుచుతాయి. అభ్యుదయ పథం వైపు నడిపిస్తాయి. ఐతే దురదృష్టవశాత్తూ వీటికి వర్తమానతరానికి మధ్య అంతరమేర్పడింది. వాటికి ఆదరణ సన్నగిల్లింది. ఈ స్థితికి కారణాలనేకం. సరిదిద్దేందుకు లోతైన చర్చలు జరగాలి. తదనుగుణంగా వ్యవస్థాగతంగా అనేక సంస్కరణలు జరగాలి. వైయక్తిక పరివర్తన దానికి పునాది కావాలి.

ఈ నేపథ్యంలో....'వీటిని ఎవ్వరూ మార్చలేరు' అనే నిరాశావాదముతో పరిస్థితులను నిందించుతూ కూర్చోకుండా, లోకోద్ధరణకు ఊకదంపుడు ఉపన్యాసాలు ఇవ్వకుండా, ఆచరణాత్మకముగా సాంస్కృతికపునరుజ్జీవ దీక్షాకంకణ ధారులైనారు మాన్య మిత్రులు, విఖ్యాత చిత్రకారులు కళాసాగర్.

నేటి తరానికి కళాసాహిత్యాల విలువలను తెలియజెప్పేందుకు....వాటిని వారికి చేరువ చేసేందుకు.... వాటి ప్రాభవాన్ని పునఃప్రతిష్ఠించేందుకు..తన లక్ష్య సాధనోపకరణంగా అధునాతన సాంకేతిక ప్రచారమాధ్యమాన్ని ఎన్నుకున్నారు. ఆ మహోపకరణం పేరే **'64కళలు.కామ్'** (64kalalu.com) వ్యయప్రయాసలకు వెఱవక శ్రీకళాసాగర్ విస్పష్ట ప్రణాళికతో, అకుంఠిత దీక్షతో, త్యాగనిరతితో పుష్కరకాలం నుంచి అవిరామంగా ఈ అంతర్జాల పత్రికను నిర్వహిస్తున్నారు. భిన్న దశలను దాటి, అవసరానుగుణంగా మాస, పక్ష, వారపత్రికాది రూపాలను పొంది, నేడు సతత విజ్ఞానవ్యాపన వాహికగా విశ్వవ్యాప్తంగా విరాజిల్లుతుంది.

సాహిత్య, కళారంగాలలో దిగ్గజాలచే రచింపబడిన విజ్ఞానదాయక చారిత్రకవ్యాసాలతో, ప్రతిభామూర్తుల జీవితవిశేషాలు, పుస్తకసమీక్షలతోపాటు ఎప్పటికప్పుడు దైనందినసమాచారమునూ అందించుతూ ఈ వెబ్‌మ్యాగజైన్ తన ప్రత్యేకతను చాటుకుంటూ వస్తున్నది. అనంతకాలచక్రంలో పన్నెండేడ్లకాలం అల్పమేయైనా, ఓ సంస్థ లేదా ఓ వ్యక్తి ప్రాస్థానాన్ని బేరీజువేసి విశ్లేషించేందుకు ఆ కాలం గణనీయమైందే. ఈ పుష్కరకాల ప్రస్థానం ఫలవంతమైనదనుటలో అత్యుక్తి ఎంతమాత్రమూ లేదు. శ్రీకళాసాగర్‌గారి సంపాదకత్వాన వెలువడే ఈ పత్రికలో భిన్న పాత్రలలో భాగస్వాములైన అందరికీ పేరుపేరునా ఈ శుభతరుణాన శుభాభినందనలు.

మిత్రులు, సోదరతుల్యులు కళాసాగర్‌గారితో నా అనుబంధం సాహిత్యకళారంగాల వరకే పరిమితం కాలేదు. మా నాన్నగారి విగ్రహరూపకల్పనలో సహకారం, నా రచనల ముద్రణవేళ కవర్‌పేజీ డిజైనింగ్‌లో తోడ్పాటు అందించుతూ మా కుటుంబ సభ్యులైనందుకు నాకెంతో ఆత్మానందం కలిగించే అంశం. నేనూ వారి వెబ్‌మ్యాగజైన్‌కు అడపాదడపా వ్యాసాలను అందించుతూ వుంటాను. ఈ అడపాదడపా నిరంతర ప్రక్రియ కావాలని వారి ఆశ. అది నేరవ్చేందుకు నావంతు కృషి ఇకనుంచి సాగిస్తాను.

భగీరథయత్నాన్ని సాగించుతూవున్న శ్రీ కళాసాగర్‌గారు భవిష్యత్‌లో మరిన్ని విజయాలు సాధించి, వారు – వారి

'64కళలు.కామ్' (64kalalu.com) ఉన్నత కీర్తిశిఖరాలు అధిరోహించాలని ఆశించుతూ...ఆశీస్సులు అందించుతూ వున్నాను.

రేపల్లె

13-09-2022

# తెలుగు కళాపత్రికల్లో 'కళాసాహిత్యం' ఒక పరిశీలన




## మాకినీడి సూర్యభాస్కర్

కవి, చిత్రకళా విమర్శకులు, కాకినాడ


ఇతర భాషల్లో వెలువడినంతగా చిత్రకళా సాహిత్యం తెలుగులో రాలేదు. పరిశోధనా గ్రంథాలు నామ మాత్రమే. కళాపరిశీలనలో ఆసక్తిగల రచయితలకూ, విమర్శకులకూ కావలసిన సమచారం కూడా లేనటువంటి కళాసాహిత్య దారిద్ర్యం తెలుగులో ఉంది. దీనికి కారణం, కళలను, కళావిమర్శను ప్రోత్సహించే ప్రత్యేక పత్రికలేమీ లేకపోవడమే.

అయితే కొంతలో కొంత, ఈ దుస్థితిని రూపుమాపుతూ అడపాదడపా, కళాపత్రికలు ఆవిర్భవించాయి. చాలా పత్రికలు పుబ్బలో పుడితే, మఖలో మాడిపోయినవే అధికం. ఈ నేపథ్యంలో ప్రత్యేకంగా కళ గురించి తెలుగులో వెలసి(?)న పత్రికల పరిశీలన చేయడమే ఈ వ్యాస ఉద్దేశం. 20వ శతాబ్దంలో మాత్రమే కళకు సంబంధించిన పత్రికలు ఆవిర్భవించినట్లు తోస్తుంది.

'కళ' పేరుతో మద్రాసుకు చెందిన పాకాల వెంకట రమణారావు రాజమన్నార్ (వ్యవహృత నామం పి.వి. రాజమన్నార్, 1901–1979) 1922లో మాసపత్రిక నొకదాన్ని తెచ్చారు. ఈయన మద్రాసు హైకోర్టు మొదటి భారతీయ ప్రధాన న్యాయమూర్తి. భారతీయ సంగీత నాటక అకాడమీకి మొట్టమొదటి ఛైర్మన్ వీరు. నాటకాలు రాసిన వీరు, సర్ జార్జి స్టాన్లీ ఎండోమెంట్ ఉపన్యాసంగా 'ఈస్థటిక్ ఎక్సరియన్స్' అనే విషయం మీద ప్రసంగించారు. తరువాత అది పుస్తక రూపంలోకి వచ్చింది. కళాప్రియుడు కావడంతో కళాశాల రోజుల్లో ప్రారంభించి, ఆ తర్వాత కూడా ఆయన ఆ పత్రికను సంపాదకత్వ బాధ్యతతో నడిపారు. అయితే, ఎంత కాలం కొనసాగిందో తెలియదు. ముఖ్యంగా తెలుగు సాహిత్య పత్రిక అయినా, వేరే సాహిత్యేతర కళలను కూడ అడపాదపపా ఈ పత్రిక తడమడం గమనించదగ్గ విషయం .

కళకంటూ ప్రత్యేకించిన పత్రికలు అప్పట్లో లేనేలేవు. ఇప్పటికీ మూడో నాలుగో, అంతే కానీ కళ గురించి అంతో ఇంతో సేవ చేసిన కారణంగా ఆయా పత్రికల గురించి కూడ క్లుప్తంగా ముచ్చటిస్తున్నాను.

'కళ' ఉపసర్గగా పేర్లు కలిగిన పత్రికలు అనేకం ఉన్నాయి. కళాజ్యోతి పేరుతో రెండు పత్రికలున్నాయి. హైదరాబాదు నుంచి జి.ఎన్. అశోక్ మాసపత్రికగా తెస్తే, గుంటూరు నుంచి ఎ. ఆదిశేషయ్య కూడ అదే పేరుతో తెచ్చారు. 1835 లో కొడవటిగంటి కృష్ణమూర్తి 'కళానిధి' మాసపత్రికను, 1899లో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి 'కళావతి' పేర మాసపత్రికలు తెచ్చారు. 1973లో ఎం.ఏ. సుభాన్, టి.ఎస్.ఆర్. ప్రసాద్ మరియు ఎ.బి. సాయిప్రసాద్ 'కళాసాగర్' అనే వార్షిక పత్రికను మద్రాసునుంచి ఆరంభించారు. 1980 జనవరి నుంచి 'కళాసౌరభం' అనే మాసపత్రిక హైదరాబాదు నుంచి ప్రారంభమైంది. అలాగే, 'కళ' అంత్య ప్రత్యయంగా వచ్చిన పత్రికలూ ఉన్నాయి. కుందుర్తి నరసింహారావు సంపాదకత్వలో 1934లో పక్షపత్రికగా ఆరంభమైని 'విశ్వకళ', ఎం.వి. భాస్కరరావు సంపాదకత్వంలో విశాఖపట్టణం నుంచి మాసపత్రికగా వెలువడిన 'యువకళలను పేర్కొనవచ్చు. అలాగే ప్రత్యేకించి నటన గురించి 'నటన' (హైదరాబాదు నుంచి ఎం.ఎస్. రామాచార్య సంపాదకత్వంలో), 'నాట్యకళ' (ఆంధ్ర నాట్య సంఘం, 1957లో ఆరంభించింది), విజయనగరం నుంచి వెలువడిన కె.వి. రమణమూర్తి 'శిల్ప సమ్రాట్'లను పేర్కొనవచ్చు. గణపతిశాస్త్రి సాంబశివరావుగారి సంపాదకత్వంలో 1947 నుంచి 'ఆంధ్ర శిల్పి' మద్రాసునుండి వెలువడింది. కాకినాడ నుండి జయంతి రామయ్యపంతులు గారి ఆధ్వర్యంలో ద్వైమాసికగా వెలువడిన 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక' కూడ సాహిత్యంతో పాటు, ఇతర కళలకు కూడ ఇతోధికంగా సేవ చేసింది. ఈ పత్రికల పేర్లను బట్టి, ఇవి కళకోసం ఎంతో కొంత కళాసేవ చేసాయనుకోవచ్చు.

అడవి బాపిరాజుగారి సంపాదకత్వంలో 1942–47ల మధ్య హైదరాబాదు నుంచి నడచిన 'మీజాన్' దినపత్రిక కూడ కళాసేవ

చేసింది. బాపిరాజు స్వయంగా సకల కళాకోవిదులు. నవలను రోజువారీ సీరియల్‌గా ప్రచురించడానికి మీజాన్ పత్రికలో మొదటగా బాపిరాజుగారే నాంది పలికారు.

మద్రాస్ నుంచి చందూర్ 1956 నుంచి 'జగతి' అనే మాస పత్రికను తీసుకురానారంభించారు. ఈయన ప్రముఖ రచయిత్రి "ప్రమదావనం' మాలతీ (చందూర్) గారి భర్త. ఈ పత్రిక రచయితలనుంచి నేరుగా అడిగి కళావ్యాసాలు ప్రచురించినట్లు లేదు. కాని, వేరే పత్రికల్లో వచ్చిన వ్యాసాలను సేకరించి ప్రచురించడం జరిగింది. ఈ రచయిత వ్యాసాలు కళావ్యాసాలు కొన్ని ఆ విధంగా ప్రచురించడం జరిగింది. జనవరి 2014లో వెలువడిన 654వ సంచికతో ఈ పత్రిక ఆగిపోయింది. మచిలీపట్నం నుంచి కొల్లూరి కోటేశ్వరరావు గారి సంపాదకత్వంలో 1953లో ప్రారంభమైన 'తెలుగు విద్యార్థి' మాసపత్రిక విద్యానుంబంధకం అయినా, అప్పుడప్పుడు సందర్భానుసారం కళల గురించి కూడ వ్యాసాలు ప్రచురిస్తూండేది.

కేవలం కళలకే అంకితమైన పత్రికల వివరాలను పర్యావలోకిద్దాం. సకల కళల సమాహారంగా వెలువడిన పత్రికలు రసమయి, కళాదీపిక మూతపడగా, ఇప్పటికీ వెలువడుతున్న పత్రిక మిసిమి. ఈ కోవలోకే వస్తుంది "64కళలు.కామ్' పేరుతో వెలువడుతున్న అంతర్జాల మాసపత్రిక. కేవలం చిత్రకళకు మాత్రమే పరిమితమై వెలువడిన పత్రికలు కూడ ఉన్నాయి. వీటిలో మొదటగా చెప్పుకోవలసినది ప్రసిద్ధ చిత్రకారుడు మాదేటి రాజాజీగారి ఆధ్వర్యంలో వెలువడిన 'తూలిక' కాగా, మరొకటి సుంకర చలపతిరావుగారి ఆధ్వర్యంలో వచ్చిన 'విశ్వ చిత్రకళ'.

సంగీత కళకి అంకితమైన ఏకైక పత్రిక 'గానకళ'. 1962లో కాకినాడనుండి ఆరంభమైన ఈ పత్రిక ఇప్పటికీ నిర్విఘ్నంగా కొనసాగడం విశేషం. మునుగంటి శ్రీరామమూర్తి దీని వ్యవస్థాపక సంపాదకులు. స్త్రీల ఆరోగ్య, ఔషధ సమాచారంతో డా. కె.ఎన్. కేసరి (కోట నరసింహం) వ్యవస్థాపక సంపాదకులుగా 1928 నుంచి మద్రాసు కేంద్రంగా వెలువడిన పత్రిక. కళలకు సంబంధం ఏమిటంటే, ఆనాటి చిత్రకారులైన సి.ఎన్. వెంకటరావు వంటి చిత్రకారుల చిత్రాలను రంగుల్లో ప్రచురించేది ఈ పత్రిక.

తెలుగు పత్రికల్లో ప్రత్యేకించి చెప్పాల్సింది భారతి మాసపత్రిక. అందమైన అమ్మాయంటే బాపు బొమ్మ అయినట్టు, పత్రికంటే భారతియే అన్నంతగా ప్రాచుర్యం చెందింది. తరువాత వచ్చిన మంచి పత్రికలను భారతి తరహాలో, భారతిని తలపించే వంటి పదప్రయోగాలతో వర్ణించడమే ఈ పత్రిక గొప్పతనాన్ని చాటుతుంది. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి సంపాదకత్వంలో మొదటి సంచిక జనవరి 1924లో వెలువడితే, 1991 మార్చి చివరి పత్రిక విడుదలైంది. తొలిసంచికలో కాశీనాథునిధుని– "భారతియందు భాష, వాఙ్మయము, శాస్త్రములు, కళలు మొదలగు విషయములు సాదరభావముతో చర్చించుట కవకాశములు గల్పించబడును... శిల్పమునకు, చిత్రలేఖనమునకు శాసనములకు సంబంధించిన విషయములు చిత్రములతో ప్రచురింపబడును" అన్నారు. అన్నట్లే, ప్రతిసంచికలోను ఆనాటి ప్రముఖ చిత్రకారుని చిత్రం ఉండేది. వద్రంగి, చాటింపు (హెచ్.వి. రాంగోపాల్), మురళి (పి. రంగస్వామి), పల్లెపడుచులు (రాంగోపాల్), పెళ్లిచూపులు (మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలే), కృషీవలురు (అంట్యాకుల పైడిరాజు), మేఘనాథుడు (వేలూరి రామమూర్తి), కాపు పడతి (యన్. వెంకటరావు), గజాసుర దమనుడు (వెంకటరావు), నాగేశ్వరుడు, యౌవనశ్రీ (దేవీప్రసాద్ రాయ్ చౌధురి), ప్రతీక్ష (జనాబ్ అజీరాజామి), పర్ణశాలలు (పిలకా లక్ష్మీ నరసింహమూర్తి), విరహిణి (రాంగోపాల్ భాస్కరరాజు), మలబారు గ్రామ దృశ్యములు (దేవీప్రసాద్ రాయ్ చౌదరి), జాగాయ్ మాథాయ్ (వి.ఆర్. చిత్ర, నందాలాల్ అనుసరణ), నగల నాణెము (వి.ఆర్. చిత్ర), పరిచర్య (తలిశెట్టి రామారావు), గుటి, విప్రోషిత, ఎర్రగుడి గుట్ట మొదలైన చిత్రాల సేకరణ ఈ వ్యాసరచయిత చేశారు.

ప్రత్యేకించి వడ్డాది పాపయ్యగారి ముఖచిత్రంతో వెలువడేది యువ (1934–92). సినీమా కళకే అంకితమైన పత్రికలు, రూపవాణి (ఈ పత్రికలో తమ పేరు/ఫొటో పడితే చాలని ఆనాటి నటులు భావించేవారట). కొరడా, చిత్రకళ, ఢంకా, మెరుపు, విజయచిత్ర, విశ్వమోహిని, సితార, సినీ హెరాల్డ్, సూపర్ హిట్, మెగాస్టార్ వంటి పత్రికలు ప్రత్యేకించి చలనచిత్ర కళకు అంకితమైన పత్రికలు.

ప్రజాసాహితి మాసపత్రిక, సాహిత్య సాంస్కృతికోద్యమ మాసపత్రికగా 32 సంవత్సరాలనుంచి క్రమం తప్పకుండా వస్తున్న పత్రిక. ఈ పత్రిక విశేషాంశం ఏమిటంటే, కనీసం ప్రతి మూడునెలలకొక ప్రత్యేక సంచికను వెలువరించడం. ఈ సంచికలు వివిధ కళారంగాల సుప్రసిద్ధ వ్యక్తులగురించి కావడం మరీ విశేషం. అంతేకాకుండా, మార్చి 1996 సంచిక ప్రత్యేకించి స్పానిష్ అంతర్యుద్ధం–1936

గురించి, పికాసో ప్రసిద్ధ చిత్రం గుయెర్నికా ముఖచిత్రంతో వెలవడింది. అలాగే ఉద్యమస్ఫూర్తి కలిగిన చిత్రకారులపై ప్రత్యేక సంచికలను కూడ విడుదల చేసింది. కామ్రేడ్ చలసాని ప్రసాదరావు సంస్మరణ సంచికగా 244వ సంచిక జూలై 2002 సంచిక వెలువడింది. చిత్త ప్రసాద్ వంటి ప్రజాచిత్రకారుల గురించి కథనాలు ప్రచురించడం చెప్పుకోతగ్గది. ప్రముఖ చిత్రకారుడు మోహన్ ఈ పత్రిక ముఖచిత్రాలు సంతరించేవారు.

**చిత్రకళా మాలిక తూలిక:** దామెర్ల రామారావుగారి ప్రశిష్యుడు, ప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ మాదేటి రాజాజీ స్వీయ సంపాదకత్వంలో వెలువడిన పత్రిక 'తూలిక'. ఆంధ్ర, ఆంగ్లాల్లో ద్విభాషాపత్రికగా వెలువడేది తూలిక. 1964 ఆగస్టునుంచి ఈ పత్రిక రానారంభించింది. దీని ఉపశీర్షిక, 'సచిత్ర చిత్రకళా మాస పత్రిక'. ఇందులో ప్రాంతీయ, జాతీయ చిత్రకళా ప్రదర్శనలే కాదు, అంతర్జాతీయ ప్రదర్శనల వివరాలు, చిత్రకళకు సంబంధించిన వార్తలు, నాటి చిత్రకారులకెంతో ఉపయుక్తంగా ఉండేవి. సమాచార వ్యవస్థ అంతంత మాత్రంగా ఉన్న ఆ రోజుల్లో, రాజాజీ ఈ వివరాలను ఎలా పొందుపరచేవారో ఇప్పటికీ ఆశ్చర్యమే! అప్పట్లో చిత్రకళారంగంలో రచయితలుగా పేరొందిన వేలూరి రాధాకృష్ణ, ఆచంట జానకిరామ్, సంజీవదేవ్, ఆచార్య విస్సా అప్పారావు, మొక్కపాటి కృష్ణమూర్తి, చలసాని ప్రసాదరావు, మోహన్, వి.కె. పండిట్, ఆర్బీ వంటివారు వ్యాసాలు రాసేవారు. . మన చిత్రకళ చరిత్ర, కొత్త చిత్రకారుల పరిచయం (ఈనాడు లబ్ధప్రతిష్ఠులైన చిత్రకారులు వారందరూ), జాతీయ, అంతర్జాతీయ మ్యూజియంల వివరాలు, ఇంగ్లీషులో న్యూస్ అండ్ నోట్స్, తెలుగులో వార్తలు–సమీక్షలు గ్రంథ సమీక్షలు వంటి శీర్షికలుండేవి. ప్రత్యేకంగా వచ్చిన కథనాలు 12 పుటల శ్రీ వరదా వెంకటరత్నం వర్ధంతి అనుబంధం, వరదా వెంకటరత్నం గారికి ఆస్వాల్ట్ కూల్డే రాసిన ఉత్తరం, దామెర్ల రామారావు సంస్మృతి, 1965 జన్మదిన ప్రత్యేక సంచిక మొదలైనవి.

రాజాజీగారి అన్నగారి అబ్బాయి మాదేటి రవిప్రకాష్ సేకరించిన ప్రతుల ఆధారంగా తూలిక రెండేళ్ళ పాటు కొనసాగి ఆగినట్లు తోస్తుంది.

**ఆర్ట్ డ్రైవ్** త్రైమాసిక పత్రిక ప్రముఖ చిత్రకారులు డా॥ బి.ఏ. రెడ్డిగారి సంపాదకత్వంలో 1991 సం॥ నుండి హైదరాబాద్ కేంద్రంగా వెలువడుతుంది. ఈ పత్రిక పిల్లలలో చిత్రకళను పెంపొందించడానికి, దేశంలోనూ, విదేశాలలోనూ నిర్వహిస్తున్న చిత్రకళా పోటీల వివరాలు, చిత్రకళా ప్రదర్శనల వివరాలు తెలుసుకోవడానికి దోహదపడుతుంది. గత 31 సంవత్సరాలుగా వెలువడుతున్న పత్రిక ఇది.

చిత్రకళకు పీఠం వేసిన **'విశ్వచిత్రకళ':** సుంకర చలపతిరావుగారు సంపాదకులుగా, బులుసు వెంకట సుబ్రహ్మణ్యంగారు వెలువరించిన పత్రిక మే 2002 నుంచి ప్రారంభమైంది. దీని ఉపశీర్షిక, 'సచిత్ర శిల్ప కార్టూన్ సమాచార మాస పత్రిక' సూచిస్తున్నట్లుగా పూర్తిగా చిత్ర, శిల్ప కళలకే పరిమితమైనట్లు తెలుస్తుంది.

కళాకారుల 'మానసిక పత్రిక'గా పేరు పొందిన ఈ పత్రిక, కొంత వ్యాసవైవిధ్య స్థాయికి సంతరించుకునే సరికి అర్థంతరంగా 2004లో ఆగిపోయింది.

**కళారసమయం:** ప్రత్యేకించి కళలకే అంకితమైన పత్రికల గురించి చూద్దాం. నండూరి పార్థసారథి సంపాదకులుగా హైదరాబాద్ నండూరి పబ్లికేషన్స్ వారిచే అక్టోబర్ 2000 నుండి ప్రారంభమైన పత్రిక 'రసమయి'. తెలుగు సాంస్కృతిక మాసపత్రికగా ఇది ఆరంభమైంది. సంగీత, సాహిత్య, నృత్య, నాటక, చిత్ర, శిల్ప, వాస్తు కళలు, జానపద హస్తకళల గురించి ఎన్నో ప్రామాణికమైన వ్యాసాలను ప్రచురించింది రసమయి. అలనాటి 'భారతి' పత్రికను గుర్తు తెచ్చే విధంగా నడచింది. ప్రతి సంచిక ప్రత్యేక సంచికే అన్నట్టుండేది. పాలగుమ్మి విశ్వనాథం, న్యాయపతి రాఘవరావు, ఇంద్రగంటి శ్రీకాంత శర్మ, భద్రిరాజు కృష్ణమూర్తి, రజనీకాంతరావు, వేటూరి ఆనందమూర్తి, కోవెల సంపత్కుమారాచార్య వంటి లబ్ధప్రతిష్ఠులైన రచయితలు దీనిలో రాసేవారు. కేవలం చందాదారులపైనే ఆధారపడిన ఈ పత్రిక 2009లో 95వ సంచికతో ఆగిపోయింది.

చిత్ర, శిల్ప, వాస్తు కళలకు సంబంధించి– ఆధునికాంధ్ర చిత్రకారులు దామెర్ల దంపతులు, బుచికృష్ణమ్మ, అడవి బాపిరాజు, వరదా వెంకటరత్నం, శుభరాయ, దేవీప్రసాద్ నారాయణరావు, మొక్కపాటి కృష్ణమూర్తి, పిలకా దంపతులు, కౌతా సోదరులు, చామకూర సోదరులు, భగీరథి, బాపు. జి. నరసింహారావు వంటి చిత్రకారులపై సచిత్ర వ్యాసాలు ప్రచురించింది. మొక్కపాటి కళాజీవితంపై ఐదు సంచికల ధారావాహిక నడిచింది. రవీంద్ర చిత్రకళ, రవివర్మపై ప్రత్యేక సంచిక, అహివాసి 'రేఖాంజలి' ప్రత్యేక సంచిక, ఆంధ్ర శిలాయుగ చిత్రకళ, తెలుగువారి తొలి కళారూపాలు, బౌద్ధంలోనే ఆంధ్ర శిల్పకళా మూలం, అనే

శివనాగిరెడ్డి ప్రత్యేక వ్యాసాలు చెప్పుకోదగినవి. అమరావతిపై ప్రత్యేక సంచిక, శీలా వీర్రాజుగారి సచిత్ర వ్యాసంతో 'లేపాక్షి', ఆంధ్ర వ్యంగ్య చిత్రకారులపై ప్రత్యేక సంచికలు వెలువడ్డాయి.

ఎనిమిదిన్నర సంవత్సరాలు నడిచింది రసమయి. కళల కోసం ఒక ప్రత్యేక పత్రిక రావడం, వందేళ్ళ తెలుగు పత్రికా ప్రపంచ చరిత్రలోనే తొలి ప్రయోగంగా రసమయిని చెప్పుకోవచ్చు.

**సకల కళల దీప్తి–కళాదీపిక:** తెలుగు నాటక రంగాన్ని అర్చించి, త్రికరణశుద్ధిగా అంకితమైన పత్రిక కళాదీపిక. అయితే, వేరే కళలను కూడ వాటి పేరుకు "దీపిక' చేర్చి సాహిత్య దీపిక, చిత్రకళాదీపిక, నృత్యదీపిక... ఇలా లలిత కళలన్నిటినీ ప్రోత్సహించింది కళాదీపిక. 1999 జూలై 1న తొలుత పక్షపత్రికగా ఆవిర్భవించిన కళాదీపిక, అలా 2000 అక్టోబరు వరకు కొనసాగింది. ఆ తరువాత కనుమరుగైపోయింది. తదుపరి 2004 జనవరిలో మాసపత్రికగా పునరావిర్భవించింది. అయితే ఎంతో కాలం కొనసాగలేకపోయింది. ఆర్థికలేమి ఒకే ఒక్క కారణం. ఎడిటర్ వి.ఎస్. రాఘవాచారిగారి ఆర్థికసహాయ అభ్యర్థనలు మూగ విన్నపాలే అయ్యాయి. ఫలితంగా 2014 వరకు మనుగడను సాగించి, నిలిచిపోయింది.

తన పదకొండేళ్ళ ప్రస్థానంలో పక్ష, మాస పత్రికలతో పాటు, వందల పేజీల వార్షిక, ప్రత్యేక బృహత్ సంచికలను కూడ వెలువరించింది. 134 ఏళ్ళ ఆంధ్ర నాటకరంగ చరిత్రలో 250 మంది సమకాలీన రంగస్థల నటీమణుల సంక్షిప్త కళాజీవిత విశేషాలను 'కళాదీపికలు' పేర 2011లో ప్రచురించింది. పది ప్రత్యేక వార్షిక సంచికలను, సాహిత్య కళా సాంస్కృతిక, రంగస్థల సంబంధ పరిశోధనాత్మక వ్యాసాలతో ప్రచురించింది. కొండెక్కే ముందు దీపం కాంతివంతంగా వెలిగినట్లు, ఏర్చి కూర్చిన నూటపది వ్యాసాల 'కళాసాహిత్య శతవ్యాస మాలిక'ను అందించి ఆగిపోయింది కళాదీపిక. 'కళాసాహిత్యాల భూమిక! కళాకారుల పరిచయ వేదిక!'గా సాగింది కళాదీపిక, ఈ వ్యాస రచయితకు 2007 జనవరిలో పరిచయమైన దగ్గర్నుంచీ, 2008 వరకు, చిత్రకళకు సంబంధించి 16 వ్యాసాలు ప్రచురించడం జరిగింది. రాఘవాచారిగారి అకుంఠిత దీక్ష ఇంతింతని చెప్పడానికి వీలులేనిది. పత్రిక రూపంలో ఆగిపోయినా, వాట్సాప్ గ్రూప్ రూపంలో ఇప్పటికీ పత్రికను నెట్టుకొస్తున్నారు.

**పసిడికళల మిసిమి:** అలాగే సకల కళల సమాహారంగా మొదలైన 'మిసిమి' మాసపత్రిక కూడ ప్రత్యేకంగా చెప్పుకోవలసినదే. చిత్రకళకు అధికంగా ప్రాముఖ్యమిచ్చిన మిసిమి, ఇతర కళలపై కూడ వ్యాసాలను ప్రచురించడం జరుగుతోంది. ఆలపాటి రవీంద్రనాథ్‌గారి సంపాదకత్వంలో 1990లో ఆరంభమైన ఈ పత్రిక ప్రస్తుతం వల్లభనేని అశ్వినీకుమార్ సంపాదకత్వంలో విజయవంతంగా నడుస్తోంది. 2014లో 'పాతికేండ్ల పండుగ' జరుపుకొంది. ఈ సందర్భంగా తెలుగు వెలుగు పత్రిక 2014 డిసెంబరు సంచికలో 'మిసిమిలమిలలు' అనే వ్యాసం ప్రచురించింది.

మౌలిక ఆలోచనాస్రవంతిని ఉన్నతీకరించే 'చింతనాత్మక సారస్వతం' ఉపశీర్షికగా ఈ పత్రిక వస్తోంది. ప్రామాణికమైన, అత్యున్నత స్థాయి వ్యాసాలకు పెట్టింది పేరు మిసిమి. నాలుగట్టల మీద నాలుగు ప్రసిద్ధ చిత్రరాజాలను ప్రచురించడం, ఆయా చిత్రాల గురించి లఘుటీకలు ఇవ్వడం (అట్టమీద బొమ్మలు) ఆనవాయితీగా సాగుతోంది. ఇక కళలపై, ప్రత్యేకించి చిత్రకళపై సంజీవదేవ్, జానకిరామ్, చలసాని వంటి లబ్ధప్రతిష్ఠుల వ్యాసాలు ప్రతి సంచికలోనూ కనబడడం విశేషం. ఎందరో చిత్రకారులను సచిత్ర వర్ణనాత్మకంగా పరిచయం చేసింది మిసిమి. భవదీయుడు చిత్రకళపై రాసిన ప్రతివ్యాసాన్ని మిసిమి ప్రచురించింది.

**అరవై నాలుగు కళలకూ...ఆదరువే!**

మొత్తం కళలు 64 అని మనకు తెలుసు. ఈ అన్ని కళలకూ ప్రాధాన్యాన్నిస్తూ వెలువడుతున్న మేటి పత్రిక 64kalalu.com. ఒక రకంగా చెప్పాలంటే, ఇది తొలి అంతర్జాల సకల కళల సమాహార పత్రిక. దీన్ని 2010 నవంబరు మాసంలో వ్యవస్థాపించి, ఇప్పటికీ సంపాదకత్వం నిర్వహిస్తున్నవారు ప్రముఖ చిత్రకారుడు, కార్టూనిస్ట్, రచయిత కళాసాగర్ దీని తొలి సంచికను సుప్రసిద్ధ కార్టూనిస్ట్ ఏ.వి.ఎం.గారు విజయవాడలో ప్రారంభించారు.

మాసపత్రికగా ప్రారంభమైన 64kalalu.com, 2016నుండి వారపత్రికగా వస్తోంది. పత్రికల చరిత్రలో ఇదొక వింత విషయం. ఏ పత్రికైనా, ఆర్థిక కారణంగానో, రచనల అందుబాటు తగ్గిన/లేని కారణంగానో మార్పుకు గురవుతాయి. ఆ మార్పు ఎలాంటిదంటే, వారపత్రిక పక్షపత్రికగా, పక్షపత్రిక మాసపత్రికగా లేదా మాసపత్రిక ద్వైమాసిక లేదా త్రైమాసికగా మారడం సర్వసాధారణం. కానీ ఈ పత్రిక దానికి వ్యతిరేకంగా మాస పత్రిక కాస్తా, వారపత్రికగా మారడం. సంపాదకుడికి ఎంతటి దీక్ష ఉంటే ఇది సాధ్యమౌతుందో ఊహకు అందదు. సాంకేతికపరంగా

అంతర్జాతీయస్థాయికి తీసుకువెళ్ళడంలో విజయం సాధించారు కళాసాగర్.

ఈ పత్రిక చాలా భాగం చిత్రకళాకారుల పరిచయానికి, చిత్రకళా వ్యాసాలకు కేటాయించడం చిత్రకారులకు గర్వకారణం. అధికంగా వ్యాసాలు వరుసగా చిత్రకళ, నాట్యం, శిల్పం, సంగీతం, కార్టూన్, సాహిత్య విభాగాల్లో ప్రచురించడం గమనార్హం. సమకాలీన కళావిమర్శకులు ఈ పత్రికలో శీర్షికలు నిర్వహిస్తున్నారు. సంపాదకులు కళాసాగర్, కార్టూనిస్టులపైన, ఆ కళమీద వందల వ్యాసాలు ప్రచురించారు. ఎస్.ఎన్. వెంటపల్లి (వెంటపల్లి సత్యనారాయణ), నెలకో చిత్రకారుణ్ణి పరిచయం చేస్తూ, వందకు పైగా చిత్రకారులను పరిచయం చేశారు. ఆయా చిత్రకారులుణ్ణి స్వయంగా కలిసి ఇంటర్వ్యూ చేసి, సొంత కెమేరాతో ఫొటోలు తీసుకుని, ఆ తర్వాత వ్యాసం రాయడానికి ఉపక్రమిస్తారు వెంటపల్లి. అందువల్ల వీరి పరిచయాల్లో తాజాదనం తాండవిస్తుంది. ఇక ఎల్.ఆర్. వెంకటరమణ, తనదైన రీతిలో జాతీయ, అంతర్జాతీయ చిత్రకారులనెందరినో పరిచయం చేశారు. భవదీయుడు కూడ కొన్ని సొంత శీర్షికలను నిర్వహించడం జరిగింది. అవి చిత్రకళలో... కొందరు చిత్రకారుల పరిచయాలు జీవన సంజీవని (సంజీవదేవ్ కళ, జీవితంపై వ్యాసపరంపర) కవిచిత్రకారులు (కవీ, చిత్రకారుడూ అయినవారి పరిచయాలు) సంగీతంలో... మన వాగ్గేయకారులు, ప్లేబాక్ సింగర్స్ (సినీమా పాటల గాయకుల పరిచయ వ్యాసాలు) జయదేవుని అష్టపదులు ఇవే కాక, సమ్ థింక్ స్పెషల్ వంటి విశిష్ట శీర్షికల్లో కొన్ని వ్యాసాలు, సమయ సందర్భాలకు ప్రత్యేక వ్యాసాలు ఎన్నో రాయడం జరిగింది.

ఇంత విస్తారంగా కళాసంబంధ వ్యాసాలు రాయడానికి అవకాశం కలిగించిన ఎడిటర్‌గారికి నా అభివందనాలు తెలియజేసుకుంటున్నాను.

64 కళలకూ ప్రాతినిధ్యం వహిస్తూ, కళారంగ సేవలో, ముఖ్యంగా చిత్రకళ సేవలో పన్నెండు సంవత్సరాలు పూర్తి చేసుకున్న 64కళలు. కామ్ అంతర్జాల పత్రికకు శుభాకాంక్షలు.

'64కళలు.కామ్' అంతర్జాల పత్రిక కావడం వల్ల, ప్రింట్ మీడియా పత్రికలకన్నా కొన్ని లాభాలను అదనంగా పొందగలిగింది. ప్రపంచంలో ఏ మూలనున్న పాఠకుడినైనా సులభంగా చేరగలదు. దానితో పాఠకుల సంఖ్య గణనీయంగా పెరిగింది. అలాగే పాఠకుడు తన అభిప్రాయాన్ని, సలహాలను సులువుగా సంపాదకులకు తెలిపే వీలుండడంవల్ల, వారి అభిరుచులకు అనుగుణంగా వెంటనే మార్పులు చేర్పులు చేసేందుకు అవకాశం ఉంది. ఆ విధంగా పత్రిక సర్వజన రంజకంగా, నభూతో అన్నట్లు ముందుకు సాగుతోంది. ఒక పుష్కర కాలం, ఒక పత్రిక, అదీ రంగుల్లో రావడం మాటలు కాదు. మధ్య మధ్యలో అవాంతరాలు ఎదురైనా, వాటిని చాకచక్యంగా వ్యవహరించి సంపాదకులు పరిష్కరించుకోగలిగారు. అయిదేళ్ల క్రితం యునీకోడ్‌లోకి మారి, ముద్రణ రీత్యా అంతర్జాతీయ ప్రమాణాలు సాధించగలిగింది 64kalalu.com ఈ శుభతరుణంలో పత్రిక మరింత ప్రజాదరణ పొంది, మరింతగా పాఠకులను అలరించాలని ఆకాంక్షిస్తున్నాను.




**సింగంపల్లి అశోక్‌కుమార్**
శ్రీశ్రీ సాహిత్యనిధి, విజయవాడ
9246277375


## కళాసాగర పుత్రిక

చైతన్య కళాకారుల ప్రజ్ఞా ప్రాభవం
కళాసాగరం ఆటు పోటుల ఉద్భవం
నం.ఒన్‌కి మరోనేమ్-64కళలు.కామ్
ఉన్నత ప్రమాణాల అంతర్జాలా వైభవం

# పత్రికా రంగాన విజయ కేతనం..64 కళలు.కామ్




**ఎన్.వి.పి.ఎస్ ఎస్.లక్ష్మి.**

వ్యవస్థాపక కార్యదర్శి,

భగీరథి ఆర్ట్ ఫౌండేషన్, రాజమహేంద్రవరం.


కళ ఏదైనా దానిని సృజించిన వారు ఎంత ముఖ్యమో ఆ కళను ఆదరించేవారు, ఆస్వాదించి ఆనందించేవారు అంతే ముఖ్యం. అలాగే ఆ కళాకారుల ప్రతిభా విశేషాలను పలు ప్రాంతాల వరకు ప్రచారం చేసే పత్రికలు... కళలను కళాకారులను కళా సంస్థలను ప్రోత్సహించే కళాభిమానులు... అంతే అవసరం. ప్రస్తుతం ఇంకా గొప్ప స్థాయిలో ఈ కళా విశేషాలను ప్రాంతాలు, నదులు, సముద్రాలు, పర్వతాలు దాటి విశ్వవ్యాప్తం చేస్తున్న పత్రిక.. మన '64కళలు.కామ్' (64kalalu.com).

నేటి ఆధునిక సాంకేతికత విన్యాసంతో గగనవీధుల గుండా విశ్వవ్యాప్తం చేస్తున్న మన అంతర్జాల పత్రిక '64 కళలు.కామ్' పుష్కరకాలం పూర్తి చేసుకున్న శుభ సందర్భం ఎంతో ముదావహం. ఈ విజయం వెనుక ఇన్ని సంవత్సరాల కృషికి ఇంతటి సేవ అందించిన పత్రికా సారథులు కళాసాగర్ గారికి, వారికి సహకరించిన వెంటపల్లి సత్యనారాయణగారి వంటి ఎందరో సహాయకులు అందరికీ హృదయపూర్వక అభినందనలు.

కళలు ఏవైనా ఒకే ప్రాంతానికి పరిమితమైతే ఎదుగుదల లేదు. ఇతర సృజన శీలుర కళా నైపుణ్యాలు కూడా తెలుసుకోవాలి. ఆస్వాదించాలి, ఆదరణీయ అంశాలు అందిపుచ్చుకుంటూనే తన కళాప్రతిభను మెరుగు పరుచుకోవాలి. ఎదగాలి, కళలో మరిన్ని రహస్యాలను అన్వేషించాలి. సాధన చేసే కొద్ది కొత్త దారులు.. మలుపులు తిరిగే కొద్ది కొత్త విధానాలు అలవడతాయి. అటువంటి ఔత్సాహికులకు సాధకుల కళాపరిణామాన్ని.. విజయాలను, వారి కృషితో పాటుగా వివిధ కళాసంస్థల కళాసేవను, కళా సమాచారాన్ని కూడా అందిస్తూ ప్రోత్సహిస్తున్న పత్రిక మన 64 కళలు.కామ్ (64kalalu.com).

2010 నవంబర్లో ప్రారంభమై, మాస పత్రికయై, తరువాతి కాలంలో 2016 నుండి వారపత్రికగా, 2019 నుండి నిరంతర సమాచార స్రవంతిగా 22 దేశాలలో నెలకు 20 వేల మంది పాఠకులు కలిగిన ఈ పత్రిక ఈనాటికి ఎన్నో వేల కళాకారులను, కళా నాటక రంగ, చలన చిత్ర విశేషాలను, మన తెలుగు సంస్కృతిని జగానికి పరిచయం చేసింది. ఇంతటి విజయవంతమైన పత్రిక మన తెలుగు పత్రిక కావడం తొలి అంతర్జాల పత్రిక కావడం మనకు తెలుగు వారందరికీ గర్వకారణం.

ఎన్నో సాధక బాధకాలను ఓర్చుకుని ఆత్మవిశ్వాసంతో, తిరుగులేని సంకల్ప బలంతో, దీక్షతో పత్రికను ఆరంభించి, ఇంత కాలం నడిపి, మరెంత కాలమో నడుపబోయే ఈ పత్రిక ఎంతో ఆదరణ పొందింది. ఈ విజయానికి వెనుక ఎంతో కృషి, ఎంతో శ్రమ, సమయానికి అందించడంలో గల ఒత్తిడి వీటన్నిటిని అధిగమించి సమర్ధవంతంగా నడుస్తున్న ఈ మన కళాపత్రిక యల్లపు కళాసాగరుని హృదయ మందిరాన వెల్లువెత్తిన "కలల" అల. వివిధ దేశాల అసంఖ్యాక హృదయ తీరాలు చేరి ఉవ్వెత్తున విరుచుకుపడుతున్న అపురూప కళా తరంగిత ఆనంద హేల. శారద రాత్రుల ఉదయిస్తున్న పూర్ణ కళామయ చంద్రోదయ వెన్నెల.

ఈ పత్రిక ఇలాగే శతవర్గాల విజయకేతనం ఎగురవేసే పథాన కొన సాగుతూ అందరి మన్ననలను పొందగలదని విశ్వసిస్తూ మరోసారి అభినందనలు, ఆశీస్సులు తెలుపుతున్నాను.

**భావోద్వేగముతో దర్శించిన సృష్టిలోని ఒక కోణం ద్వారా చక్కని కళాఖండం బయట పడుతుంది.**

**- ఎమైల్ జోలా**

## 'సితార' నుంచి '64 కళలు.కాం' వరకు నా పయనం




**ఆచారం షణ్ముఖాచారి**

రచయిత, హైదరాబాద్, (94929 54256)


64 కళలు.కాం (64kalalu.com) ఆన్ లైన్ వెబ్ లాగ్ జర్నల్ ను సన్మిత్రులు కళాసాగర్ యల్లపుగారు పుష్కర కాలంగా విజయవంతంగా  సకల కళల సమాహారంగా తీర్చిదిద్దడం అభినందనీయం. మన పూర్వీకులు కళలను 64 విభాగాలుగా నిర్వచించారు. ఈ చతుష్షష్టి కళలు కాలానుగుణంగా చైతన్యదాయకమై ప్రజోపయోగంగా మార్గనిర్దేశనం చేసుకుంటున్నాయి. 64కళలు.కాం సాహిత్య, సంగీతాది కళలకు ఆలవాలమై భాసిల్లడం ఆనందదాయకం. నేను గత పుష్కర కాలం నుంచి సినిమా జర్నలిజంను చేపట్టి ఈనాడు సంస్థ నడిపే 'సితార' సినిమా పత్రికకు, ఆ సంస్థ నుండే వెలువడే 'తెలుగు వెలుగు', 'చతుర' పత్రికలకు సినిమా సంబంధిత విషయాలమీద వ్యాసాలు రాస్తూ వున్నాను.

రెండు సంవత్సరాల ముందు మరో మిత్రుని ద్వారా కళాసాగర్ గారు పరిచయం కావడం, 64కళలు.కాం వెబ్ పత్రికలో వ్యాసాలు రాయవలసిందిగా కోరడంతో నా సినీ రచనా వ్యాసంగాన్ని ఈ వెబ్‌లాగ్‌లో పంచుకుంటున్నాను. ముఖ్యంగా పాతరోజుల్లో వచ్చిన సినిమా విశేషాలతోబాటు సంగీత సంబంధమైన వ్యాసాలు కూడా ఇందులో అందిస్తున్నాను. గౌరవ సభ్యులు నా వ్యాసాలను చదివి అభినందిస్తున్నారనే విషయాన్ని కళాసాగర్‌గారు తరచూ తెలియజేస్తూనే వుండడం ముదావహం. కళాసాగర్‌గారు వ్యాసాలను సమర్పించే విధానం చదివే వారికి ఉత్సాహం కలిగించే రీతిలో వుంటుంది. అందుకే కాబోలు పన్నెండేళ్లయినా ఈ వెబ్ పత్రిక విజయవంతంగా నిర్వహింపబడుతోంది. ముఖ్యంగా కోవిడ్ మహమ్మారి ప్రబలిన రెండేళ్లలో ఆన్ లైన్ పత్రికలకు విశేషమైన ఆదరణ లభించింది. ఆ సరళి ఇప్పుడు ఇంకా ద్విగుణీకృతమై భాసిల్లడం మంచి పరిణామం. ఈ వెబ్ పత్రికలో వివిధ విషయాలపై, కళలపై వస్తున్న వ్యాసాలు సరళంగా, చైతన్యవంతంగా వుండి మనసుకు ఉల్లాసాన్ని కలుగజేస్తున్న విషయంలో కళాసాగర్‌గారి అవిరళకృషి ఎంతైనా వుంది. అందుకు వారు అభినందనీయులు. ఈ వెబ్ పత్రిక దినదినప్రవర్థమానమై, మరెందరో కళాకారుల పరిచయాలను అందిస్తూ ఇంకా మంచిపేరు తెచ్చుకోవాలని అభిలాషిస్తూ, ఈ బ్లాగ్ రథసారథి కళాసాగర్‌గారిని మనసారా అభినందిస్తూ, ఆశీర్వదిస్తున్నాను.

శుభం భూయాత్!

## అహర్నిశం అన్వేషణ...




**పి. హేమంత్ కుమార్**

భారతీయ భారతి సంగీత-నృత్యపాఠశాల, విజయవాడ


వివక్షలేని విశ్లేషణ...రమణీయ రసపోషణ కలబోసిన బాషణ 64కళలు.కాం. (64kalalu.com)అనేక పుష్పాల మకరందాన్ని సేకరించి ఒకచోట చేర్చినట్లు... ఎందరో కళాకారుల మదిలో దాగిన భావాలను ఏర్చికూర్చి...

ఒక రూపాన్ని దిద్ది పలువురికి పంచాలని తద్వారా కళాకారుల యశస్సు పెంచాలని సార్థక నామధేయ సముపార్జన కై... తీయ తేనీయ లొలుకు తెలుగు భాషలో కళకల సమాహార దృశ్య మాధ్యమ పత్రికను స్థాపించి పుష్కర కాలం పూర్తి చేసుకున్న సందర్భంగా...

అభినందనలు.

# 64కళలు డాట్ కామ్ 'కళాసాగరమే!'



**చొక్కాపు వెంకటరమణ**
కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత
అధ్యక్షులు, బాలసాహిత్య పరిషత్, హైదరాబాద్

'నీరు పల్లమెరుగు – ఈగ బెల్లమెరుగు' అన్నట్లు కళాకారులంతా కళాసాగర్ యల్లపు గురించే మాట్లాడుకుంటారు. అందుకే '64 కళలు డాట్ కామ్' (64kalalu.com) కంటే ముందు కళా'సాగర సంగమం' గురించి ప్రస్తావించకపోతే ప్రజలు నన్ను క్షమించరు.

ఓ సాఫ్ట్ వేర్ కంపెనీలో గ్రాఫిక్ డిజైనర్‌గా ఉద్యోగం ఊపేసి, భీమవరంలో డ్రాయింగ్ టీచర్‌గా టూర్ చేసి, టెక్స్ట్ బుక్కులకు లుక్కులను కట్టి పడేసే వేలాది లైన్ డ్రాయింగ్‌లు వేసి ఆర్ట్ లైన్లో పడ్డారు కళాసాగర్. సీరియస్‌నెస్ మాడును పగలగొట్టేలా మూడు వేలకు పైగా కార్టూన్లు వేసి కార్టూన్ 'ఇష్టుల'కు 'ఇష్ట'పది అయ్యారు.

మతులు పోగొట్టేలా బహుమతులు గెలిచారు. వందలాది కళా వ్యాసాల వ్యవసాయం చేశారు.

కళాసాగర్ సంకల్పించి, సంకలనించి, ప్రింటించిన 'ఆంధ్ర కళాదర్శిని' ఆర్టిస్ట్ డైరీ' 'కొంటె బొమ్మల బ్రహ్మలు', – లు కార్టూనిస్టులకు, కళాకారులకు జాతీయ స్థాయిలో గుర్తింపు తెచ్చే' ఆధార్ కార్డు' లయ్యాయి.

చాలా కాలం కిందట ఓ రోజు కళాసాగర్ ఒంటరిగా

కూర్చుని ఉన్నపుడు – 'హలో కళాసాగర్!' అని వినిపించి అటు చూశారు. తెల్లని ఆకారం. తనలానే ఉంది.

'నీవు నా ఆత్మవా?' కళా సాగర్ ప్రశ్న.

'పాత తెలుగు సినిమాల్లో లాంటి ఆత్మను కాను. నీ ఆత్మీయుణ్ని'. అంది ఆ ఆకారం.

'ఎందుకొచ్చావ్?' మళ్ళీ కళాసాగర్ ప్రశ్న.

'అరవై నాలుగు కళలున్నాయి. నీవు కొన్ని కళల్నే

పట్టించుకుని వాటికి 'ఓటర్ ఐడీ'లు ఇస్తే కళామతల్లికి

కోపం వస్తుంది. మిగతా వాటి గురించీ ఆలోచించు' అంది ఆకారం.

'నేను ఆర్టిస్టుని మాత్రమే. మిగతా వాటిలో వేలు పెడితే

లోకులు ఏమనుకుంటారు?' అడిగారు కళాసాగర్.

'లోకులు కాకులు'. మనం మంచి చేసినా విమర్శిస్తారు.

నీవు వేలు పెట్టి చూడు. వేలాది మంది నీ వెంట ఉంటారు.' అని చెప్పి ఆత్మీయుడు మాయమయ్యాడు.

పులొచ్చి లేడిపిల్లని కుంటమంటే కుంటక ఏం చేస్తాది?

'ఆత్మీయుడి' ప్రబోధం బాగా పనిచేసింది.

'పెండింగ్' అన్నా, 'డిపెండింగ్' అన్నా ఒంటికి పడని

కళాసాగర్ బాగా ఆలోచించి, ప్లాన్ చేసి, విశ్వవ్యాప్త తెలుగు వారి కోసం '64kalalu.com' పత్రిక ప్రారంభించారు.

ఒక్క మౌస్ క్లిక్‌తో తెలుగు చిత్ర, శిల్ప, నృత్య, నాటక, సినీ రంగాల ప్రముఖుల సమాచారంతో అంతర్జాతీయ పత్రికగా వెలుగొంది 25 దేశాల్లోని 20 వేల మందికి పైగా చేరువయింది. పన్నెండేళ్ళు పూర్తి చేసుకుంది.

'సాధించాలంటే శ్రమించాలి. ఫలితం కావాలంటే

నిరీక్షించాలి.' ఒక పుష్కర కాలం పాటు కళాసాగర్ శ్రమ,

నిరీక్షణ ఫలించాయి. అదే ఈ ప్రత్యేక సంచిక రూపం–ప్రతిరూపం!!

'పాతరేసే కొద్దీ పారే నది– దిగలాగే కొద్దీ ఎగిరే జెండా–

ప్రతిభ!' కళాసాగర్‌లోని ఆ కళాప్రతిభకు – నా ప్రణామాలు.

తెలుగు బొమ్మకు 'బాపు'లారిటీ ఎక్కువ!

64 కళలు డాట్ కామ్‌కు పాపులారిటీ ఎక్కువ!!'

# 64కళలు.కామ్ నిస్సందేహంగా గొప్పపత్రిక




**వాడ్రేవు సుందర్రావు**

నంది అవార్డు గ్రహీత,

తణుకు


ప్రియమిత్రులు కళాసాగర్ నిర్వహిస్తున్న '64కళలు.కామ్' వెబ్ పత్రిక నాకు పరిచయమైన తొలి వెబ్ పత్రిక. కళాదీపిక నాటక పత్రిక నిర్వహకులైన వి.ఎస్.రాఘవాచారి గారు ఈ పత్రిక గురించి, కళాసాగర్ గురించి ఎంతో ప్రశంసాపూర్వకంగా మాట్లాడి నాకు ఈ పత్రికను పరిచయం చేసారు. మొదటిచూపులోనే 64kalalu.com నన్నెంతో ఆకట్టుకుంది. చిన్న పల్లెటూరి నుండి వచ్చిన వాడిని కావడంవల్ల, చందమామ పుస్తకంలో రంగుల్లా, 64కళలు రంగుల్లో కనిపించగానే నాకెంతో ఆత్మీయమైంది. ఆ పత్రికను చూడగానే నా మనసు పొంగిపోయింది.

తెల్లకాగితాల మీద నల్లసిరాతోనో, నీలం సీరాతోనో రాసిన నా అక్షరాలు 64కళలులో సప్తవర్ణాలతో ప్రత్యక్షంకాగానే, ఎంతో ఆశశ్చర్యం, కేవలం అంశాలు మాత్రమే కాదు, వాటి ప్రాధాన్యతా క్రమాన్ని అనుసరించి, ఆయన హెడ్డింగులు పెట్టే విధానం, అక్షరాల విరుపులు, పదాల కలయికలు, వాటి స్వభావాన్నిబట్టి ఇచ్చేరంగులు, అన్నిటినీ నేను ఎంతో ఆశ్చర్యంగా, మరెంతో పారవశ్యంతో... ఓ చిన్నపిల్లవాడు రంగుల లోకాన్ని చూస్తున్నట్టే చూసేవాడిని. ఆ మోహమే నన్ను 64కళల పత్రిక కోసం నెలనెలా ఎదురుచూసేలా చేసింది. కొన్నాళ్లయితే పూర్తి పత్రిక రాకముందే నా వ్యాసాన్ని ఎలాగైనా చూసేయాలని కళసాగర్‌కి ఫోన్‌చేసి అడిగేవాడిని. నామీదున్న ప్రేమకొద్దీ ఎప్పుడూ విసుక్కోలేదు సరికదా, ఓపిగ్గా వ్యాసం చేసిపెట్టి ఫోన్ చేసి చెప్పేవారాయన. '64కళలు.కామ్' వెబ్‌లో ఎన్నో వ్యాసాలురాశాను. ఎందరో మహానుభావుల్ని, ముఖ్యంగా తెలుగు కవులు, రచయితలు ఎందరినో పరిచయం చేశాను. జీవించి ఉన్నవారిలో కూడా అనేకమంది నటీనటుల్ని, ప్రతిభావంతుల్ని వర్తమాన సమాజానికి పరిచయం చేశాను. పనిలోపనిగా సాంస్కృతిక, సాహిత్య రంగాలలో నేను సాగిస్తున్న సుదీర్ఘమైన ప్రయాణం గురించి 64కళలు పత్రిక ఎంతో అందంగా ప్రపంచానికి అందించింది. మంచి వ్యాసాలెన్నో నేను రాయడానికి ఎంతో ప్రేరణనిచ్చింది కూడా '64కళలు.కామ్' పత్రిక అనడం నిస్సందేహం. సాంకేతిక కారణాల వల్ల, యూనికోడ్ టైప్‌కోసం, యూనికోడ్ ఫాంట్‌కోసం, వ్యాసాలన్నీ చిరకాలం భద్రపరచడం కోసం, ఈ పత్రిక కూడా కొత్తదారి తొక్కింది. అయితే దానికదే.. దీనికిదే. తెలుగు భాషా సాహిత్య, కళారంగాలకు ఎనలేని సేవ చేస్తున్న వెబ్ మ్యాగజైన్ పత్రిక మరింతగా వృద్ధి చెందాలని కోరుకుంటూ, కళాసాగర్‌కి అభినందనలందిస్తున్నాను. 64కళలు.కామ్ (64kalalu.com) నిస్సందేహంగా గొప్పపత్రిక. ప్రేమతో సదా ఈ పత్రికను ప్రేమించే...

– సుందర్రావు



**వెబ్ బ్రౌజర్ అంటే ?** వెబ్ బ్రౌజర్ అంటే కంప్యూటర్ యుగానికి ముందే ఈ మాట ఇంగ్లీష్ భాషలో వాడుకలో ఉంది. గ్రంథాలయానికి వెళ్లినప్పుడు, పుస్తకాల దుకాణానికి వెళ్లినప్పుడు కానీ మనం సాధారణంగా అట్టమీద బొమ్మ చూసో, పేరు చూసో ఒక పుస్తకాన్ని గుర్తుపట్టి చూస్తాం. తర్వాత తిరిగి మళ్లీ బీరువాలో పొందుపరుస్తాం. చూస్తాం.. మళ్లీ పెట్టేస్తాం.. దీన్నే 'బ్రౌజింగ్' అంటారు. దీన్ని తెలుగులో చూడటం, పరిశీలించడం, వీక్షించడంగా చెప్పచ్చు.

# 64 కళలు వెబ్ మ్యాగజైన్ పుట్టి 'పుష్కరం'




"కళామిత్ర"

**అడవి శంకరరావు**

విశ్రాంత సీనియర్ మేకప్‌మేన్

హైదరాబాద్. ఫోన్. 6301002268.


కళలు అరవైనాలుగే అయినా, అవి నిర్వహించడానికి కష్టాలు, నష్టాలు ఎన్నెన్నో! అందరి కళా ప్రతిభలు గుర్తించి గౌరవించి, ప్రోత్సహించడమే 64kalalu.com ఉద్దేశం. అని భావించవచ్చు. ఒక పత్రిక ప్రింట్‌లో గాని, వెబ్‌సైట్‌లోగాని నడపడం సామాన్యం కాదు. ఎంతో కష్టమైన పని. వాటికి డబ్బు, సహాయ సహకారాలు ఎంతో ముఖ్యం. 64 కళలు.కామ్ అధినేత శ్రీ కళాసాగర్ గారిది అలసట ఎరుగని నిర్విరామ కృషి. పన్నెండేళ్ళుగా ఒంటరిపోరాటం చేశారు ఈ పత్రిక కోసం. అందుకు ఆయన మనసులో వున్న ఆసక్తి, శక్తి, పట్టుదలే కారణం అని నేను అనుకుంటున్నాను. మనలో వున్న ఆరాటానికి చేయూత ఇవ్వడంలో కూడా ఆయనకి వున్న ఆసక్తే ఈ పన్నెండేళ్ళ ప్రాయం ఉన్న 64కళలు.కామ్ మ్యాగజైన్‌లో ఎన్నోవేల వ్యాసాలు ప్రచురించారు. కలం పట్టిన ఎంతో మందిని వెన్నుదట్టి ప్రోత్సహించారు. మొదట్లో కళాసాగర్‌గారే టైప్‌చేసేవారు మనకోసం. తర్వాత నేర్చుకుంటానికి మాబోటివాళ్ళని "నేర్చుకోండి జీవితంలో ఉపయోగపడుతుంది" అని ప్రోత్సహించారు. ఇంట్లో, ఆఫీసులో ఎన్ని పనులున్నా కూడా, విసుక్కోకుండా చిరునవ్వుతో సహకరించేవారు. కార్యసిద్ధికి, మనోదీక్ష అని నిరూపించారు. ఆయన సహజంగా సమాజంలో కళలు అరవైనాలుగే అయినా, ఎన్నో వైవిధ్యభరితమైన కళలగురించి, కళాకారుల గురించి విశదీకరించారు, వివరించారు. కళాసాగర్‌గారు ఎంతో సౌమ్యులు, స్నేహప్రియత్వం కలవారు ఎన్నో సంవత్సరాలు నాతో ఈ పత్రికకి తెలుగు నాటకరంగం గురించి వ్యాసాలు, పరిచయాలు వ్రాయించి, ప్రచురించి సహకరించారు. ఓర్పు, సహనం కళాసాగర్‌గారి సహజ లక్షణాలు. అవి పరిపూర్ణంగా ఉంటేనే ఇలాంటి నిర్వహించగలరు. నిజంగా కళాసాగర్ గారు కళలకు అధిదేవత నటరాజస్వామి వంటివారు. ఆయన శిరస్సుపై చంద్రుడు అలంకరించివుంటాడు. ఆ చంద్రుడిలాగే మన "64 కళలు.కామ్ వెబ్ సైట్ మ్యాగజైన్" ముందు ముందుకూడ ప్రకాశవంతంగా కొనసాగాలని ఆకాంక్షిస్తున్నాను. పుష్కరకాలం 64kalalu.com వెబ్‌సైట్ మ్యాగజైన్‌లో నేనూ ఒక పేజీ అయినందుకు ఆనందిస్తున్నాను.



కళ నిత్యం జీవం కోసం, ఆనందం కోసం ఏర్పడిన వృత్తులలో నైపుణ్యం ప్రసారమైనప్పుడు అది కళగా రూపు దిద్దుకుంటుంది. మానవ జీవనంలో అధిక భాగం కళా స్పర్శ ఉంటుందన్న విషయం గమనించాలి. ఈ కళల వెనుక ఆర్థిక కోణం, మానవ శ్రేయస్సు భౌగోళిక అంశాలు ఇమిడి ఉన్నాయి.

ఒక వ్యక్తి తాను అనుభవించిన ఆనందాన్ని ఇంకొరితో కలిగించడానికి చేసే ప్రయత్నమే కళ.

– టాల్ స్టాయ్

# దేశ సాంస్కృతిక పటంలో ఆంధ్ర కళాకారులకు చోటు




డా॥ కె. మృత్యుంజయరావు
Assistant Professor, Artist
Dept. of Fine Arts, Yogi Vemana University
Kadapa, YSR Dist.


19వ శతాబ్దం తొలినాళ్ళ నుండి ఆంధ్ర చిత్రకారులు తమ ఉనికిని చాటుకుంటూనే ఉన్నారు. హైదరాబాద్ రాష్ట్ర రాజధానిగా ఏర్పడిన నాటినుండి తెలుగు ప్రజలందరికి కళల కేంద్రంగా 2014 వరకు అక్కడ కొనసాగుతూ వచ్చింది. రాష్ట్ర విభజన అనతరం చాలా మంది ఆంధ్ర ప్రాంత కళాకారులు తమ అస్తిత్వం కోసం తెలంగాణాలో ఉండక తప్పని పరిస్థితి. ఆంధ్రాలో కళే లేదు, సమకాలీన కళాకారులు లేరు అని వట్టి పుకార్లు, విమర్శలు వచ్చినా, సాటి తెలుగు వారు తెలంగాణాలో ఉండటం, వాళ్ళ అస్తిత్వం కోసం ఇక్కడ నోరు మెదపలేని పరిస్థితి. ఆనాటి నుండి ఎంతో మంది చిత్రకారులు, కళాభిమానులు, ఆర్ట్ అసోసియేషన్‌లు, సొసైటీలు ఆయా జిల్లాల, ప్రాంతాల వారీగా ఆంధ్ర కళా ప్రాశస్త్యం కోసం, అవగాహన ఏర్పరచడం కోసం, డీలా పడిన ఆంధ్రప్రాంత చిత్రకారులను సమన్వయ పరిచేందుకు నడుంబిగించారు. రాష్ట్రంలో నలుమూలలు పర్యటించడం, సమావేశాలు నిర్వహించడం జరిగింది. దాదాపు ఇలా జరిగిన అన్ని సమావేశాలకు హాజరై తన ఆలోచనలను పంచుకొన్న కొద్ది మందిలో నా మిత్రుడు వై. కళాసాగర్ ఒకరు. సుమారు 24 సంవత్సరాల (నాకు తెలిసి) నుండి ఎలాంటి ప్రాంతీయ భేదాలు లేకుండా చిత్రకారులకి, చిత్రకళా రంగానికి, సాటి చిత్రకారుడుగా, రచయితగా ఎన్నోసేవలు అందిస్తూ, ఆర్టిస్ట్ పరిచయ గ్రంథాలు ప్రచురించడం జరిగింది.

ఈ క్రమంలోనే 64kalalu.com ద్వారా తన సేవలు మరింత విస్తరించారు కళాసాగర్. 64 కళలు.కాం వెబ్ పత్రిక 12 వసంతాలు పూర్తి చేసుకుంటున్న ఈ సమయంలో మరియు ఈ మధ్యకాలంలో మన ఆంధ్ర ప్రాంత చిత్రకారులు గొప్ప దనం దేశ సాంస్కృతిక పటంలో చోటు చేసుకోవడం మన అందరికి గర్వకారణం. ఈ ఉత్సాహంతో మరోసారి మన మేటి సమకాలీన చిత్రకారులను పరిచయం చేస్తూ కళాసాగర్‌గారి నేతృత్వంలో రంగు రంగుల చిత్రాలతో, చిత్రకారుల పరిచయాలతో ఆకర్షణీయంగా అనితర సాధ్యంగా "ఆంధ్ర కళాదర్శిని" ప్రచురించడానికి శ్రీకారం చుట్టిన కళాసాగర్‌గారికి నా అభినందనలు.

---




సుంకర చలపతిరావు
చిత్రకళా రచయిత,
కార్యదర్శి: చిత్రకళా పరిషత్, విశాఖపట్నం


# శుభాభినందనలు

'64కళలు.కాం' అంతర్జాల పత్రిక పన్నెండేళ్ళు విజయవంతంగా పూర్తిచేసుకున్న సందర్భంగా ప్రత్యేక సంచికను ప్రచురించడం సంతోషదాయకం. తెలుగులో కళాసాహిత్య వ్యాప్తికి '64కళలు.కాం' పత్రిక కృషిచేస్తూ ఎందరో కళాకారులకు ప్రోత్సాహాన్నిస్తుంది. ఈ పత్రికలో నేనూ ఒక భాగమైనందుకు సంతోషిస్తూ... కళాసాగర్‌గారికి, పత్రిక విజయంలో భాగమైన ప్రతీ ఒక్కరికీ నా శుభాభినందనలు.

# "కళా ప్రేమికుల కళాప్రపంచం-"64 కళలు.కామ్"



**ఎల్.ఆర్. వెంకటరమణ,**
చిత్రకళావిమర్శకులు, అనంతపురం.

గత 12 సంవత్సరాలుగా ప్రతి నెలా క్రమం తప్పకుండా అంతర్జాల వేదికపై '64 కళలు.కామ్' అన్న వెబ్ మేగజైన్ రావడమన్నది ప్రతి తెలుగు కళాకారునికి ఒక గర్వకారణం. అందులోనూ ప్రత్యేకంగా కళలకు సంబంధించిన విషయాలతో ఒక మేగజైన్ తీసుకురావడం ఒక సాహసం. పుష్కర కాలంగా ఈ సాహసాన్ని చేస్తున్న అనితర సాధ్యుడు కళాసాగర్ గారు.

చదువరులు తగ్గిపోతున్న నేటి కాలంలో, ఒక ప్రత్యేక సంచిక రూపంలో, సర్వాంగా సుందరంగా తీర్చిదిద్ది తెలుగువారికి అందిస్తున్న కళాసాగరుడు నిజంగా కళా సోమయాజి, రాబోయే తరాలకు కళల గురించి చెప్పడానికి, మనకంటూ ఒక కళాచరిత్ర ఉందని ఈ పత్రిక చూస్తున్న ప్రతివారికి అవగాహన అయ్యే ఉంటుంది.

ఇదివరకు కళలకు సంబంధించిన పత్రికలు వేళ్ళమీద లెక్కపెట్టగలిగినన్నే వచ్చినా, అవి కూడా ఒకటి, రెండు సంవత్సరాల పాటు వచ్చి అగిపోయినవే. అలాంటి సందర్భంలో 64kalalu.com వెబ్ మేగజైన్ 12 సంవత్సరాలుగా నిర్విరామంగా రావడం సాహసం కాక మరేమి? అవుతుందంటారు.

ఈ పత్రికలో కళాసాగర్‌గారి కోరిక మేరకు "కళా ప్రపంచం" అనే శీర్షికను నేను రాసే అవకాశం నాకు కలిగింది. 2012 సం॥లో. ఇందులో చిత్రకళ, శిల్పకళ, సాహిత్యం నృత్యం, సినిమా ఇలా అనేక అంశాలను తీసుకుంటూ పరిచయ వ్యాసాలు రాయగలిగాను. ఏ రంగానికి చెందిన వ్యక్తుల గురించి ఇందులో రాసినా అంత:సూత్రంగా "కళ" పట్ల వారికున్న గౌరవం, కళను వారు చూస్తున్న దృష్టి కోణాన్ని ఈ వ్యాసాలలో రాయగలిగాను. వీటిలో కొన్ని ఆయా సందర్భాలకు సంబంధించినవి కాగా, కొన్ని ప్రత్యేకంగా వ్యక్తుల పరిచయాలతో కూర్చిన వ్యాసాలు. ఈ సందర్భంగా కళాసాగర్‌గారికి కృతజ్ఞతలు.

చిత్రకళకు సంబంధించిన సాహిత్యం రావాల్సినంతగా రాలేదనిపిస్తుంది. అదే సమయంలో రాయాల్సినంత రాయలేదని కూడా చెప్పవచ్చు. తెలుగులో చిత్రకళా సంబంధ అంశాలు రాస్తున్నవారు పట్టుమని పది మంది లేరనేది కఠోర సత్యమైతే, వీరిలోనూ కొందరే పుస్తక రూపంలోనూ వారి వ్యాసాలు తెస్తున్నారన్నది వాస్తవం కదా! రాబోయే తరాలకు చిత్రకళాంశాల గురించి, కళా చరిత్ర గురించి, కళా విమర్శను అందచేయాల్సిన బాధ్యత మనపై ఉంది. ఇదే క్రమంలో కళాచరిత్రను కూడా రాసుకోవాల్సిన అవసరం ఉంది. ఇదివరకూ ఈ ప్రయత్నాలు కొంతవరకూ జరిగాయని చెప్పవచ్చు. కొంతలో కొంత ఈ లోటును 64kalalu.com తీరుస్తుండటం ఎడారిలో ఒయాసిస్సు వంటిది.

ఇంతటి మహత్తర కార్యక్రమాన్ని కళాసాగర్‌గారు ఒక్కరుగా ఈ సంచికను 12 సంవత్సరాల పాటు తేవడం అభినందించ దగ్గ విషయం. ఈ క్రమంలో వారు కూడా వ్యాసాలు ఎన్నో రాశారు. అలాగే చిత్రకారుల డైరెక్టరీని తెచ్చారు. పలు కార్యక్రమాలు విజయవాడ కేంద్రంగా నిర్వహించారు. అనేక అంతర్జాల వేదికలు వాట్సప్, ఫేస్‌బుక్, యూట్యూబ్‌ల గురించిన సమగ్ర సమాచారాన్ని తెలుగు వారికి అందించారు.

కళాసాగర్ పేరులోనే కాదు కళలకు చేయూత నివ్వడంలోనూ సహృదయ సాగరుడని నిరూపించుకున్నాడు. మున్ముందు మరిన్ని సంచికలు రావాలని మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాను. ఈ సందర్భంగా కళాసాగర్‌గారికి హృదయపూర్వక అభినందనలు కళాప్రేమికులకు కళానీరాజనాలు.

**సౌందర్యము, సత్యము వీని**
**రసవత్సమ్మేళనమే కళ.**

**– టాగూర్**

# కళాకాంతులు విరజిమ్ముతున్న 64కళలు.కాం



**ఈమని శివనాగిరెడ్డి**

C.E.O.
Pleach India Foundation, Hyderabad

2010 సం.లో చిత్రకారుడు, చిత్రకళావిమర్శకుడు కళాసాగర్గారు ప్రారంభించిన 64kalalu.com పత్రిక తెలుగు నాట చిత్రకళారీతులు, వివిధ రంగాల కళాకారుల పరిచయాలు, చరిత్ర–సంస్కృతి... ఇంకా అనేక కళల సమాహారంగా ఈ పుష్కర కాలంలో దగ్గరయ్యింది.

కళలను, కళాకారులను అభిమానించే కళాసాగర్ తెలుగువారి వెలుగుల్ని విరజిమ్మే ఒక నిత్యనూతన పత్రికను తనే సంపాదకుడుగా ఎంతోమంది నిష్ణాతులైన రచయితల రచనలను ప్రచురిస్తూ... ఆనాటి తరం కళాకారుల నుంచి నేటితరం యువ కళాకరులనూ పాఠకులకు పరిచయం చేస్తూ... పత్రికను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దుతున్నారు.

రెండు దశాబ్దాల క్రితమే 'ఆంధ్ర కళాదర్శిని' సమకాలీన తెలుగు చిత్ర, శిల్పకారుల పరిచయ గ్రంథాన్ని ప్రచురించి తెలుగు చిత్రకళా వికాసానికి అంతులేని సేవ చేస్తున్న కళాసాగర్గారు మరెన్నో కళాసంబంధిత పుస్తకాలు వెలువరించాలని ఆకాంక్షిస్తున్నాను.

ప్రతి తెలుగు కళాకారుడి ప్రతిభను ఎల్లలు దాటించాలని కంకణం కట్టుకున్న కళాసాగర్ యల్లపు కృషి ప్రశంసనీయమైనది. పత్రిక 12 యేళ్ళ ప్రస్తానం విజయవంతంగా సాగుతున్నందుకు నేనూ ఒక పాఠకుడిగా ఆనందిస్తున్నాను. ఈ పత్రిక ప్రపంచ తెలుగు ప్రజల మనోనేత్రిక కావాలని అభిలషిస్తున్నాను.

# ఇలాంటి పత్రిక అవసరం ఉంది...



**అనుమకొండ సునీల్ కుమార్**

అధ్యక్షుడు: జాషువా సాంస్కృతిక వేదిక.

కళల గురించి, మన సంస్కృతి గురించి రాష్ట్రంలో జరుగుతున్న విషయాలను తెలుసుకోవాలంటే చాలా కష్టంగా ఉండేది. దాదాపు అన్ని పత్రికలు కళల గురించిన సమాచారాన్ని జిల్లా ఎడిషన్లకి మాత్రమే పరిమితం చేసిన ఈ రోజుల్లో ఇంటర్నెట్ ద్వారా కూడా అన్ని విషయాలు తెలుసి కోవాలంటే చాలా కష్టంగా ఉండేది. కళల గురించిన సమాచారాన్ని ఎప్పటికప్పుడు తెలుసుకోవడానికి ఒక పత్రిక వుంటే ఎంత బాగుండు అనుకునేవాడిని. అటువంటి సమయంలో మన సంస్కృతి గురించి, మన కళావైభవాన్ని గురించి, సమకాలిన కళాకారులగురించి, వారు చేస్తున్న కృషి, ప్రదర్శనల గురించి ఎప్పటికప్పుడు తెలియజేసే నిరంతర సమాచార స్రవంతిగా 64kalalu.com రూపొందడం చాలా హర్షనీయం. కళాసాగర్ గారు ఈ వెబ్ పత్రికను ఎప్పటికప్పుడు కాలానుగుణంగా ఆధునీకరిస్తూ సజీవంగా పాఠకులకు అందజేయడంలో సఫలీకృతమయ్యారు. ఇది సామాన్య విషయం కాదు. అందుకోసం ఆయన వెచ్చించే సమయం, ఆర్థికంగా ఎదురయ్యే ఒడిదుడుకులను జయించడం ఆయన కృషికి నిదర్శనం. ఎన్నో వ్యయ ప్రాయాసలతో సమాచారాన్ని సేకరించి, అనేక అమూల్యమయిన వ్యాసాలను, సమాచారాన్ని మన కళ్ళముందుంచుతున్న 64kalalu.com 12వ వార్షికోత్సవం జరుపుకోవడం చాలా సంతోషం. భవిష్యత్‌లో ఈ వెబ్ పత్రిక మరిన్ని వేలమంది పాఠకుల హృదయాలను చేరుకుంటుందని ఆశిస్తూ జాషువా సాంస్కృతిక వేదిక తరుపున అభినందనలు తెలియజేస్తున్నాను.

# వెబ్ పత్రికలు గణనీయమైన పాత్ర పోషిస్తున్నాయి



**చలపాక ప్రకాష్,**
ప్రధాన కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం

శుభాకాంక్షలు సాహితీమిత్రులు కళాసాగర్ గారికి నమస్కారాలు!

64kalalu.com పుష్కరకాలం విజయవంతంగా పూర్తి చేసుకున్న శుభతరుణంలో ఇవే మా శుభాకాంక్షలు. ఇలా దిగ్విజయంగా ఒక వెబ్ పత్రిక నడపడం అన్నది మాటలు కాదు. ఎంతో వ్యయప్రయాసాల కోర్చి నిర్వరామంగా నడుపుతున్న మీ కృషికి ముందుగా అభినందనలు.

వెబ్ పత్రిక అంటే చాలామందికి మొదట్లో కొంత విముఖత ఉండేది. కాని 2020 సంవత్సరంలో ప్రపంచాన్ని లాక్ డౌన్‌లో కట్టిపడేసిన 'కరోనా' పుణ్యమాని చాలా ప్రముఖమైన పెద్ద ముద్రణాపత్రికలు సైతం మూతపడినాయి. అటువంటి విపత్కర పరిస్థితులలో కూడా వెబ్ పత్రికలు గణనీయమైన ప్రధాన పాత్ర పోషించాయి. కాలం తెచ్చిన మార్పుల కారణంగా నిదానంగా ముద్రణ పత్రికలనుండి వెబ్/ అంతర్జాల పత్రికలను పాఠకులు ఆశ్రయించడం అలవాటు చేసుకునే పరిస్థితి ఉత్పన్నమైంది.. అదీ కాక ముద్రణా దినపత్రికలలో సాహిత్య, సాంస్కృతిక, కళా సంబంధమైన వార్తలు ఒక జిల్లాకో, ఒక ఊరికో, మరికొన్ని పెద్ద నగరాల్లో ఒకో జోన్, ఒకో పేటకి మాత్రమే పరిమితమైపోవడం వల్ల ఒక వార్త అందరికీ అందుబాటుకాలేక పూర్తిస్థాయిలో ప్రచారం కాలేకపోతున్నాయి. అలాగే ఒక దినపత్రికలో వచ్చే వార్తకంటే ముందుగా, సభ జరిగిన క్షణాలలోనే వెబ్/ అంతర్జాల పత్రికలలో ఆ వార్త ప్రపంచవ్యాప్తం చేసే సత్తా కలిగివుండటంతో ఇప్పుడు అంతర్జాల పత్రికల వైపు మొగ్గుచూపి, దాని హవా పెరిగి ప్రధానపాత్ర పోషించే దశలోకి వచ్చాయి. అటువంటి తరుణంలో 64kalalu.com చాలామంది రచయితల, కవుల, కళాకారుల రచనలని, పరిచయాల్ని, వార్తా విశేషాలని, పుస్తక సమీక్షలని ప్రచురిస్తూ తనవంతు పాత్ర గణనీయంగా పోషించింది. అలాగే ఇకముందు కూడా మరింతమందికి ఊతమై నిలిచి మరింత చేరువ కాగలదని ఆశిస్తున్నాము. మా ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం, రమ్యభారతి సంస్థల వార్తలను ప్రపంచంలోని తెలుగు పాఠకుల చెంతకు చేర్చి, ప్రచారం కల్పించినందుకు ఈ సందర్భంగా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనాలు తెల్పుకుంటున్నాము.

# "64 కళలు.కామ్" ఓ పుష్కర కాలం



**ఎ. రజాహుస్సేన్**
రచయిత, జర్నలిస్ట్
హైదరాబాద్/ నందివెలుగు

కళాసాగర్ సంపాదకత్వంలో నిర్వహిస్తున్న "64kalalu.com" వెబ్ పత్రిక నిజంగానే సకల కళల సమాహారం..నేను ఈ పత్రికను రెగ్యులర్‌గా చూస్తున్నాను. అద్భుతమైన వ్యాసాలు, ఎంతో సమాచారం ఇస్తున్నారు.

కళలకు సంబంధించి విశేషించి చిత్రలేఖనం, నాటకం, సంగీతం, నాట్యం, సాహిత్యం వ్యాసాలు విశేషంగా ఆకర్షించాయి. పుష్కర కాలం పూర్తిచేసుకున్న సందర్భంగా ఒక ప్రత్యేక సంచికనుతేవడం అభినందనీయం. కళాసాగర్ గారి ఈ ప్రయాణం ఇలానే..విజయవంతంగా కొనసాగాలని కోరుతున్నాను.

కళాసాగర్, ఇతర నిర్వాహక మిత్రులకు, కళాకారులు, సాహితీ వేత్తలు, కవులకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు..

# ముందుచూపున్న 'కళాపిపాసి' కళాసాగర్



**బాలి**

చిత్రకారుడు, కార్టూనిస్ట్.

విశాఖపట్టణం

మిత్రుడు కళాసాగర్ నుండి మెసేజ్. తాను నడుపుతున్న 64కళలు.కాం పత్రిక 12వ సంవత్సరంలో అడుగుపెట్టినట్లు, ఆ సందర్భంగా తనకు ఇన్నాళ్ళుగా సహకరించిన మిత్రుల అభిప్రాయాలతో ప్రత్యేక సంచిక ప్రచురించబోతున్నట్లు నన్ను కూడా నాలుగు మాటలు రాయమన్నాడు. అయితే ఈ చివరి వాక్యాలే నన్ను గతంలోకి తీసుకెళ్ళాయి. ఇన్ని సంవత్సరాలు.. అంటే పన్నెండేళ్ళు గడచిపోయాయా..!! అనిపించింది. సాగర్‌తో నా పరిచయం విజయవాడలో ఎప్పుడు కలిగిందో గుర్తులేదు. కానీ 664kalalu.com పత్రికను నెల నెలా చదివేవాడను. చాలా మంది ఔత్సాహిక చిత్రకారులతో పరిచయాలు – వారి వారి చిత్రాలూ, ఒక్కోకప్పుడు కీర్తిశేషులైన పాతతరం చిత్రకారుల గురించి వ్యాసాలు, క్రింద ఇవి చూసి, చదివిన పాఠకుల అభిప్రాయాలు కనపడేవి. పత్రిక నడపడంలో లాభ–నష్టాల గురించి నాకు తెలియదుగాని, అతనిలో వీటి సేకరణ కోసం పడ్డ శ్రమ, ఉత్సాహం నన్ను ఆశ్చర్యపరిచేది. మా మధ్య ఇంకా పరిచయాలు పెరిగిన తరువాత నేను గీసిన బొమ్మలకూ, కార్టూన్లకూ అందులో ప్రవేశంకల్పించాడు. ఇవి చాలదన్నట్లు చిత్రకారుడిగా, నా ఎదుగుదలతో ఔత్సాహిక చిత్రకారులకు మార్గనిర్దేశం కాగలదని, నా ఆత్మకథను రాయమన్నాడు.

సరేనని ఆత్మకథలు రాసిన పాతతరం, సీనియర్ రచయితల పుస్తకాలు తిరగేశాను. అందులో నాకు నచ్చిన వారు కీ.శే.పురాణం సుబ్రమణ్య శాస్త్రి గారి రచన "అనుభవాలు–జ్ఞాపకాలు". సోత్కర్షలేని గొప్ప 'ఆత్మకథ' అది గొప్పగా ఉంటుంది. దాన్ని దృష్టిలో పెట్టుకొని రాయడం మొదలుపెట్టాను. అది 64kalalu.com పత్రికలో 'చిత్రకథ' పేరుతో నా బొమ్మలతో 10 నెలల పాటు సాగినా ముందుకు జరగలేదు. ఇక ఆపేద్దామన్నాను. నిజానికి 16 భాగాలు పైగా రాయాల్సివుండి ఆపేశాను. అయితే ఇంతవరకూ చదివిన పాఠకుల నుండి దాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ ఆపవద్దని, లేకపోతే పుస్తక రూపంలోనన్నా తీసుకురమ్మని ఉత్తరాలురాశారు. అలా నాకు పదేపదే ఉత్తరాలు రాసిన వారిలో తాడిగడప శ్యామలరావు గారొకరు. ఆయనెవరో వ్యక్తిగతంగా నాకు తెలియదు. నేను అమెరికా వెళ్ళవలసివచ్చింది మా అమ్మాయి దగ్గరికి అక్కడ అనుకున్న అన్ని భాగాలు పూర్తిచేశాను. అయితే ఇక్కడ మరో విషయం చెప్పాలి. దీనికి ఏమిపేరు పెట్టాలి? అని ఆలోచిస్తున్న రోజున వచ్చిన వాడే 'శేఖర్' ఆంధ్రజ్యోతిలో పొలిటికల్ కార్టూనిస్ట్. నేను బొమ్మలు వేస్తుంటే ఆబ్రష్ బాగాగీస్తోంది...! ఈ బ్రష్ బాగుంది అంటూ నా దగ్గరున్న బ్రష్‌లు పట్టుకెళ్ళేవాడు శేఖర్. "బాలి–చిత్ర'మైన ఆత్మకథ అని పేరు పెట్టమన్నాడు. అదే చేశాను. ఆ తరువాత వేదగిరి రాంబాబు గారు దీనిని పుస్తకరూపంలో ప్రచురించారు. ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయమేమిటంటే ఈ '64కళలు.కాం'లో నా ఆత్మ కథారచనకు బీజం పడడం చక్కని విషయమే కదా! కళాసాగర్‌తో ఆ పరిచయం ఇప్పటికీ కొనసాగుతుంది.. అంతే కాదు ఈమధ్య నా 'బాలి కథలు' పుస్తకం ఆవిష్కరణకు విజయవాడ వెళ్లాను. ఆ సభలో కళాసాగర్ ప్రచురించిన 'కొంటె బొమ్మల బ్రహ్మలు' పుస్తకం బహుకరించాడు. వైజాగ్ వచ్చిన తర్వాత పుస్తకం మొత్తం చదివాను. తెలుగు కార్టూనిస్టుల పరిచయాలను అందమైన పుస్తకంగా తీసుకురావడం చాలా సంతోషాన్నిచ్చింది. అంతేకాదు ఇందులో నాకు పరిచయం లేని ఎందరో కార్టూనిస్టుల గురించి తెలుసుకోగలిగాను. ఈ పరిచయాలన్నీ 64 కళలు పత్రికలో గతపదేళ్ళుగా వచ్చినవే కావడం విశేషం. అలాగే ఇటీవల వడ్డాది పాపయ్యగారి శతజయింతి సంచిక ప్రచురించడం... ఇలా కళాసాగర్ ఏది చేసినా కళాకారుల కోసమే. ఈ కృషికి పన్నేండేళ్ళు పూర్తికావడం సంతోషకరం... అభినందనీయం.... ఆయన ఉత్సాహానికి, కళాపిపాసకు నా అభినందనలు... ఆశీస్సులు.

# కళాకారులందరికి ఆప్తుడు ఈ కళాసాగరుడు

తెలుగు వారి కళాకౌశల్యాన్ని విశ్వవ్యాప్తంగా అందించే లక్ష్యంతో తన సంపాదకత్వంలో 2010, నవంబర్ 1న "64 కళలు డాట్ కాం–సకల కళల సమాహారం" అంతర్జాల తెలుగు మాసపత్రికను కళాసాగర్‌గారు ప్రారంభించారు. తెలుగువారికి కళావారథిగా, తెలుగులో ఆన్లైన్‌లో కళల గురించి వెలువడే ఏకైక తెలుగు పత్రిక కావడం విశేషమయితే, మన తెలుగు కళాకారులు చేసుకున్న అదృష్టంకూడా. అంతేకాదు పుష్కరం పూర్తి చేసుకున్న పత్రిక కూడా ఇదే. పత్రిక విజయంలో వారితోపాటు, వారి బృందం సమిష్టి కృషి వుంది.



**డా. దార్ల నాగేశ్వరరావు,**

రిటైర్డ్ చీఫ్ డిజైనర్, గవర్నమెంట్ సెంట్రల్ ప్రెస్,

రెప్లికా ఆర్టిస్ట్, 662 వరల్డ్ రికార్డ్స్ హోల్డర్,

"దార్ల బుక్ ఆఫ్ రికార్డ్స్" ఫౌండర్, హైదరాబాద్

అందుకు ఉదాహరణగా నాకు సంబంధించిన రెప్లికా ఆర్టిస్టుగా ఎన్నో కథనాలు, నేను స్వయంగా వందమంది కళాకాలరులను కలిసి, వారి గురించి రాసిన **'స్వయం సందర్శనం'** ఆర్టికల్స్ చెప్పుకోవచ్చు.

64kalalu.com పత్రిక తెలుగులో కళారంగానికి చేస్తున్న సేవలు గుర్తించి, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం మరియు జిజ్ఞాస సంస్థ సంయుక్తంగా నిర్వహించిన 2018–అంతర్జాతీయ సోషల్ మీడియాలో "సోషల్ మీడియా స్టార్ అవార్డ్" ను పత్రిక ఎడిటర్ కళాసాగర్ గారు అందుకున్నారు. ఈమధ్యనే విజయవాడలో గూగుల్ ఇండియా వారు తెలుగు కాంటెంట్ రైటర్స్ మరియు వెబ్ డెవలప్పర్స్ కోసం వెబ్ మాస్టర్ కాన్ఫరెన్స్‌లో 64kalalu.com తరుపున కళాసాగర్ గారు పాల్గొన్నారు.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మరియు జిజ్ఞాస సంస్థ వారిచే 2018 సం॥లో "సోషల్ మీడియా స్టార్ అవార్డ్" అందుకుంటున్న కళాసాగర్

యల్లపు కళాసాగర్ గారు విజయవాడ వాస్తవ్యులు. వీరి గురించి ఉభయ రాష్ట్రాలలోనూ తెలియని వారుండరు. ఏ ఇద్దరు కళాకారులు కలిసి మాట్లాడుకున్న కళాసాగర్ గారి ప్రస్తావన తప్పక రావలిసిందే. అంతగా అందరి మనసులను ఆకట్టుకున్న "అలుపెరగని కళాసాగరుడు" మన కళాసాగర్ గారు. గత కొన్ని సంవత్సరాలుగా ఎందరో కళాకారులను తన రచనల, 'ఆంధ్రకళాదర్శిని' లాంటి పుస్తకాల ద్వారా పరిచయం చేస్తూ ప్రోత్సహిస్తున్నారు.

సాగర్ అంటే సముద్రం. సముద్రమంత పరిజ్ఞానం కలిగిన ఓ శక్తి 'కళ'సాగర్ గారు. అందకే కళల గురించి, కళాకారుల గురించి ఎలాంటి సమాచారాన్ని తెలుసుకోవాలన్నా అందరూ కళాసాగర్‌గారికే ఫోన్లు చేస్తూ వుంటారు. అందుకేనేమో ఆయన కళాకారులందరికి ఆప్తుడయ్యారు.

"ఒక కళాకారుడిగా మనం సాటి కళాకారులను గుర్తించాలి. గౌరవించాలి. అప్పుడే కళాకారుల మధ్య సత్సంబంధాలు మెరుగుపడతాయి. తద్వారా కళారంగం వికసిస్తుంది" అంటారు కళాసాగర్ గారు.

# Fragrance of Fine Arts

"**I am** very delighted to write my appreciation for 64Kalalu.com. Under the visionful Creative Editorship of KalaSaagar Garu, 64 Kalalu is doing phenomenal service to Indian Art Forms, Cultrure & Heritage by forecasting the Happenings & Past Glory of various ArtForms. The greatest challenge Indian society across the globe Facing is to properly hand over the Profound, Grand Legacy of vivid, diverse, vast Genre of Classical, Folk Arts, Many Forms of Culture , Rich & varied Indian Heritage to the 21st Century Youth.

With the increased Globalisation, association & utility of Technologies in day to day Life & Life Style, the role & prominence of the above mentioned Traditional Artforms & Cultural Heritage is finding less place in the lives of 21st Century Youth. "As Marcus Garvey said" A people without the knowledge of their past history, origin & culture is like a tree without roots." India, To be a Flourishing Peepal Tree of Knowledge & Wisdom, guiding the entire Humanity, There is a great necessity to make our 21st century Youth to deeply, understand, read, Live & Habituate with Arts, Culture & Heritage. 64Kalalu.com is pioneer & pivotal oragnisation which is preserving the Grand Past, Promoting the Artistic, Creative Present, Sustaining the varied rich Knowledge Art Base for the Future. Digitalising the Content, Styles, Forms, Contributions of various arts like Dance, Music, Painting, Craft, Sculpture, Dramatics, Literature, Folklores is the outstanding contribution being made by Kala Saagar garu and all the Team of 64Kalalu, for generations to relish and cherish.

Another value proposition 64Kalalu.com is making is, It the embodiment of Think Global and Act Local notion. With Global outreach, spirit & vision as Base, 64kalalu.com is promoting contributions of most valuable works of Local Artists, Artisans, Activists so that they would receive greater encouragement & support, a great Platform to enhance their novelistic work. From the past 12 years, 64kalalu.com has brought in to Lime Light the grand legacies, Histories, art works & contributions of Many unsung Art Heroes and Legends hailing from various local regions of Telugu States. Through various special shows & initiatives




Y. Bhargav

Jignasa Interface Private Limited

Founder & Director


64kalalu.com is also making us fondly remember & celebrate Indian Art Greats like VaPa, Adavi BapiRaju etc. Through Highly simple, easily readable, lucid presentation of the Art Content with attractive & Creative Drop Downs, I am sure 64Kalalu.com is a read feast to the present generation Youth. Through Columns like Kotha Pusthakalu, Svayam Sandarsanam it is introducing Upcoming, Unsung Artists & Art Enthusiasts to the world & World to the Artists. I have no doubt, In coming years to come 64Kalalu.com shall become the Search Engine & Digital Library or Data base for various Indian ArtForms, Artists, Art works & Cultural Heritage. The consistency in the Spirit & Transparency in the Content are the Two great Ornaments to the Great Art Treasure, 64Kalau.com is building. As we all Know , Pushkaram [12 years] has a great significance in Indian Ethos, I strongly wish & pray to the Almighty Lord Venkateswara Swamy & Mother Padmavathi to bless & prosper 64Kalalu.com till the date Pushkarams are celebrated on the earth.

"With all He'Art'y Good wishes & Looking Forward to associate our **JIGNASA** Interface with 64 Kalalu.com in this unending Odyssey of serving Indian Arts, Culture & Heritage ...

బాల్యం–భరతనాట్యం : అక్షరాభ్యాసానికై చేతులతో పలక, బలపం పట్టకముందే నృత్య కళాభ్యాసం వైపు కాళ్లు కదిలినందు వలననే భరతనాట్యంలో రెండు దశాబ్దాల సాధన సంపత్తిని సొంతం చేసుకున్న 'భరతనాట్య భాగ్యశాలిని' లేఖ్యాభరణి ఏ ఇతివృత్తమైనా అలవోకగా నర్తించి, ప్రదర్శించి ప్రేక్షక ప్రశంస లందుకుంటుంది.



ప్రధాని శ్రీ నరేంద్రమోడితో

దీప్తి : ప్రేక్షకులను రోమాంచితం చేసే శాస్త్రీయ నృత్య ప్రదర్శనలో పళ్లెరముల మేళవింపు లేఖ్యాభరణి ప్రదర్శనకు అదనపు అందంగా నిలుస్తుంది. డిగ్రీతో పాటు భరతనాట్యంలో డిప్లొమా పూర్తిచేసిన లేఖ్యాభరణి దూరదర్శన్లో బి–గ్రేడ్ ఆర్టిస్టుగా గుర్తింపు పొందింది.

ఆసక్తి : భారతీయ లలితకళా వైభవానికి ప్రతీకలై నిలిచే భారతీయ నృత్యరీతుల లోతులలోకెళ్లి పరిశోధించి, తాను సాధించిన ఫలాలతో సనాతన, అధునాతన పద్ధతులను మేళవించి మన నృత్య కళా వైభవాన్ని కొంగొత్తగా ప్రపంచానికి అందించటమే తన లక్ష్యంగా నిర్ణయించుకున్న ఈ జిజ్ఞాసువు తానెంత ఎదిగినా తన ఇంకా ఈ రంగంలో శిశువుగానే ఉన్నానని నిరాడంబరంగా చెప్పటం తనకు తల్లిదండ్రుల నుండి అబ్బిన సుసంస్కారానికి అద్దం పడుతుంది. డా. వేదాంతం రామలింగశాస్త్రిగారి ఆధ్వర్యంలో ఎం.ఏ. కూచిపూడి కోర్సుకు శిక్షణ పొందుతున్న ఈమెకు నృత్యంలో పి.హెచ్. చేయాలన్నది ఆకాంక్ష.

ఉత్పత్తి : నృత్యదర్శకులు హేమంత్ కుమార్, పద్మశ్రీ దంపతులకు 1995 విజయవాడలో జననం.

సూక్తి : "ఫైన్ ఆర్ట్స్ రంగంలో రిటైర్మెంట్ లేని పర్సన్ ఓన్లీ ఆర్టిస్ట్"గా భావించే లేఖ్యాభరణి యువత మంచి జీతం" కోసం ఎంచి, ఎంచి చదివే చదువులతోపాటే వారికి నచ్చిన ఏదో ఓ లలితకళనీ సాధన చేసినట్లయితే... "జీవితం"లో అడుగడుగునా ఎదురయ్యే అనేక సమస్యల్ని అతిగా ఆందోళనకు, ఒత్తిడికి గురికాకుండా వాటిని ధైర్యంగా ఎదిరించే మానసిక, శారీరిక బలం చేకూరుతుందని, ఇంతే కాకుండా దీనివల్ల మనకు దొరికే అమూల్యమైన సమయ సద్వినియోగం జరుగుతుందని వివిధ రుగ్మతలు, రాగద్వేషాలు, దుర్వ్యసనాలు మన దరి చేరవని, సామాజిక, వైయక్తిక బాధ్యత, సభ్యత, సఖ్యత, సంస్కారం వంటి మేలిగుణాలు అలవడటం వలన మన చుట్టూవున్న సమాజంలో పెరిగే గౌరవ ప్రతిష్ఠలతోపాటు నిష్ఠగా కళారాధన, సాధనల ద్వారా కూడా అందరూ అచిరకాలంలోనే అంతర్జాతీయ ఖ్యాతినందుకునే ఆస్కారం కూడా వుంటుందంటూ మనతోపాటు మరో నలుగుర్నీ అలరించగల అరుదైన శక్తి లలితకళల ప్రత్యేకతగా పేర్కొంటూ ఇదే తాను తన యువజగతికిచ్చే ఓ సూచనగా తెలియచేసింది.

సాధనా సంపత్తి :

- 2016-ఉగాది సందర్భంగా ఢిల్లీలో రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ, ప్రధాని నరేంద్రమోడి సమక్షంలో నృత్య ప్రదర్శనలు.
- 2014-జులై [illegible] అమెరికాలో బృందనృత్య ప్రదర్శన.
- 2014-మెగాస్టార్ చిరంజీవి సమక్షంలో నృత్య ప్రదర్శన.
- 2011- నాగపూర్ దక్షిణప్రాంత సాంస్కృతిక కేంద్రంలో నృత్య ప్రదర్శన.
- 2010- ఏలూరు అధునాతన నృత్యభారతి సంస్థవారిచే 'నృత్యకౌముది', గుంటూరు సాయిమంజీరా కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీ వారిచే 'యువకళారత్న' పురస్కారాలు అందుకుంది.

నివాసాంధ్రులను, ప్రవాసాంధ్రులను, స్వదేశీయుల్ని, విదేశీయుల్ని విస్మయపరుస్తున్న ఆంధ్ర అమ్మాయి లేఖ్యాభరణి తన నృత్య విలాసంతో అమరావతి అమరఖ్యాతికి కారకం కావాలని 64కళలు.కామ్ ఆకాంక్షిస్తూ....

శుభాకాంక్షలు తెలియచేస్తున్నది.

# విశ్వవేదికపై తెలుగుకళా కేతనం "64 కళలు.కామ్"



## టేకి మృత్యుంజయరావు

రాజమండ్రి చిత్రకళా నికేతన్

మిత్రుడు కళాసాగర్‌తో నా అనుబంధానికి... 30 సంవత్సరాలు. రాజమహేంద్రిలో నాకు డ్రాయింగ్ టీచర్స్ ట్రైనింగ్‌మేట్... అలా మా మొదటి పరిచయం. తానెప్పుడూ భిన్నంగా ఆలోచించే నూతనాభిలాషి. అజాత శత్రువు.

మా గురువర్యులు శ్రీ మాదేటి రాజాజీగారి ఆదేశాల మేరకు దామెర్ల రామారావు ఆర్ట్ గ్యాలరీ పరిరక్షణ సమితిగా ఏర్పడి కొన్నాళ్ళు... కార్యదర్శిగా దామెర్ల రామారావు ఆర్ట్ స్కూల్ పూర్వవిద్యార్థుల, ఊరిపెద్దల అండదండలతో రాజమండ్రి చిత్రకళా నికేతన్ స్థాపించుకుని చిత్రకళ కార్యక్రమాలను రాజమండ్రిలో నిర్వహించుకుంటూ ప్రముఖ కళాకారులకు శ్రీ కూల్డ్రే, శ్రీ దామెర్ల రామారావు, శ్రీ వరదా వెంకటరత్నం, శ్రీ భగీరథి, శ్రీ మాదేటి రాజాజీగార్ల స్మారక అవార్డులు ఇచ్చుకుంటూ... శతజయంతి ఉత్సవాలను నిర్వహించుకుంటూ...పాతికేళ్ళ ప్రస్థానం పూర్తి చేసుకున్నాము. ఆ వార్తలన్నింటినీ మిత్రుడు కళాసాగర్ 64kalalu.com ద్వారా విశేష ప్రచారం ఇచ్చి మాకు చేదోడు వాదోడుగా ఉండటమే కాక, మా సంస్థ అభివృద్ధికి తన వంతు సహకారం, సూచనలు, సలహాలు అందిస్తూ వచ్చారు.

కళాసాగర్‌గారు పబ్లికేషన్‌లో ఆర్టిస్టుగా చిరుఉద్యోగంతో జీవనాన్ని ప్రారంభించి అంచెలంచెలుగా ఎదుగుతూ కుటుంబ భారాన్ని మోస్తూ తన పిల్లలను ఉన్నత విద్యాధికులను చేసి, గొప్ప ప్రయోజకులుగా తీర్చిదిద్దారు. ఇంతటి బిజీలోను తనకున్న కొద్దిపాటి సమయాన్ని మన తెలుగు కళాకారులు బాహ్యప్రపంచంలో రాణించాలన్న తపనతో ఎలక్ట్రానిక్ పత్రికను స్థాపించారు. తనమూలాలను ఎప్పుడూ మరచిపోలేదు. చిత్రకారునిగా, రచయితగా పత్రికా సంపాదకునిగా తెలుగు రాష్ట్రాలలో వివిధ సంస్థలు నిర్వహించే కార్యక్రమాలను 64kalalu.com ద్వారా ఎప్పటికప్పుడు ప్రచురిస్తూ, వెలుగులోకి తెస్తుంటారు.

అలనాటి సిద్ధహస్తులైన కళాకారుల జీవిత విశేషాలలో దాగిన విశేషాలను వారి కళాఖండాలతో జోడించి... కళా విమర్శకుల వ్యాసాలను నిరంతరాయంగా 12 ఏళ్ళపాటు ప్రచురిస్తూ వచ్చారు. ఇంతింతై వటుడింతై అన్న చందంగా ఆ సమాచారమంతా నేటికి గొప్ప కళావారసత్వ భాండాగారంగా రూపుదిద్దుకున్నది.

64 కళల కళాకారుల గురించి రాస్తూ పత్రికకు తమ కలం సాయాన్ని అందించిన ప్రముఖులైన కళావిమర్శకులు సుంకర చలపతిరావు, మాకినీడి సూర్య భాస్కరరావు, ఆత్మకూరు రామకృష్ణ, వెంటపల్లి సత్యనారాయణ, శ్రీ ఎల్.ఆర్. వెంకటరమణ, బి.ఎమ్.పి. సింగ్‌గార్ల వంటి ఉద్దండుల వ్యాసాలను చదువుతూ వస్తున్నాము. మంచి ఆర్టికల్స్ ద్వారా నేటి కళాకారులకు పూర్వపు కళాకారుల జీవన, కళ మార్గదర్శకాలను తెలియచెప్పిన పత్రికగా ఈ పత్రిక చరిత్రలో (గూగుల్లో) నిలిచిపోతుంది.

వీరి సంపాదకత్వంలో 20 వేలకు పైగా పాఠకులను సుస్థిరంగా సంపాదించుకున్న ఆన్లైన్ ఏకైక తెలుగు కళాపత్రికగా నిలిచిందని తెలిసి అనందిస్తున్నాను. వివిధ రంగాలకు చెందిన ఎందరో కళాకారులకు అజ్ఞాత చెరను తొలగించి నేటి నవ్యకళా ప్రపంచానికి పరిచయం చేస్తున్న అద్భుత ప్రయోగం ఈ పత్రిక.

ఒక్కోసారి నాకనిపిస్తుంది కొన్ని కొన్ని ప్రత్యేకమైన పనులకు అరుదైన వ్యక్తులను భగవంతుడు పుట్టిస్తాడని. కళాసాగర్ కృషిని చూసాక ఈ విషయం రూఢీ అయింది. ప్రత్యేకమైన పనికోసం భగవంతుడు కళాసాగర్‌ని ఎన్నుకున్నాడని. భవిష్యత్తు దినాలలోనూ కళాసాగర్ కృషి నిరంతరాయంగా కొనసాగాలని, వీరి చేపట్టిన ఈ కళాయజ్ఞం నిరంతరంగా కొనసాగడానికి ఆ భగవంతుడు ఆయురారోగ్య, ఐశ్వర్యాలను ప్రసాదించాలని నిండు మనసుతో కోరుకుంటున్నాను. మా రాజమండ్రి చిత్రకళా నికేతన్ మరియు యావత్ ప్రపంచ తెలుగు కళాకారుల తరపున శుభాకాంక్షలు తెలియజేసు - కుంటున్నాను.

# కొంటెబొమ్మల బ్రహ్మలు కొలువైన గ్రంథం

**వ్యం**గ్య చిత్రకళకు ఆత్మ సామాజిక స్పృహ. సమకాలీన సమస్యలపై అవగాహన అధికంగా ఉన్న కళ వ్యంగ్య చిత్రకళ. కేవలం ప్రజల కోసమే నడిచే కళ వ్యంగ్య చిత్రకళ. నవ్వని రోగం పెరిగిపోయిన రోజులవి. బుక్ కల్చర్ పోయి లుక్ కల్చర్ పెచ్చరిల్లిన ఈ సమయంలో ప్రచురించబడిన పుస్తకం వెనుక తరుగుతున్న విలువలకై... చెందుతున్న ఆవేదన తాలూకు కసి ఈ గ్రంథం వెనుక నాకు బాగా కనిపిస్తున్నది. ఈ కళారంగంలో గుర్తింపు తెచ్చుకున్న దాదాపు 300 మంది చిత్రకారుల స్థాయి నుండి నేటికి వందకు పడిపోవడం ఎంతటి విచారకరం.



## ఆత్మకూరు రామకృష్ణ

చిత్రకారులు, కవి, రచయిత

కొంటెబొమ్మల బ్రహ్మల గ్రంథ సంపాదకునిగా, రచయితగా కళాసాగర్ యల్లపు 166 తెలుగు కార్టూనిస్టుల సెల్ఫీలను ఒకగుదిగా గుచ్చి గ్రంథాన్ని పుస్తకాభిలాషులకు అందించారు. తొలి తెలుగు కార్టూనిస్ట్ తలిశెట్టి రామారావు మొదలు 1995లో పుట్టి కార్టూన్లు గీస్తున్న నేటి నవ యువ చిత్రకారుడు ఇళయరాజా చరిత్ర వరకూ ఈ పుస్తకంలో పొందుపరచడం విశేషం. కళాసాగర్‌గారు రచయిత, చిత్రకారుడు మరియు ముద్రణాలంకరణ రూపకర్త (Lay-out Designer) కూడా అయినందున ఈ 448 పేజీల బృహత్తర గ్రంథాన్ని స్వీయ పర్యవేక్షణలో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ద గలిగారు.



ఈ గ్రంథానికి "తెలుగు కార్టూనిస్టుల సెల్ఫీలు" అన్న ట్యాగ్ లైన్ పెట్టడంలోనే సృజనాత్మకత నిండి ఉంది. ఎవరి ఫోటో వారు తీసుకున్నట్లుగా... తమ స్వగతాలను వ్యాసాలుగా ఎవరికి వారు రాసుకుని... హాస్యబ్రహ్మలు తమ స్వగతాన్ని తమదైన శైలిలో వినిపించారు. వారి కొంటె గీతల వైవిధ్యాన్ని ఒకటి రెండుకార్టూన్లతో మనకు పరిచయమిచ్చారు. అందుబాటులో లేని చిత్రకారుల జీవిత, కళావిశేషాలను రచయిత & సంపాదకుడు అయిన కళాసాగర్ గారు చరిత్రను తవ్వి మనకందించారు.

కేరికేచర్ స్పెషలిస్టులయిన వర్చస్వి, ఏ. ప్రభాకర్, రాజశేఖర్, ఎం. రాజుగార్లు తమ శక్తి సమర్పణం ఈ పుస్తకంలో ప్రశంసనీయం. వీరు ప్రతి చిత్రకారుని ఫోటోతో పాటు కేరికేచర్లను చిత్రించి ముద్రించారు. ఈ ప్రక్రియ పుస్తకానికి ఎంతో వన్నె తెచ్చింది. కార్టూన్ చిత్రణలో అంతర్భాగమైన కేరికేచర్ చిత్రణను ఇలా పాఠకులకు పరిచయం చేసినట్లయింది. కేరికేచర్లను సాధన చేయాలనుకున్న ఔత్సాహికులకు పరిశీలనా గ్రంథంగా కూడా నిలుస్తుంది ఈ గ్రంథం.

ఒకటి కాదు రెండు కాదు ఏకంగా 166 క్యారికేచర్లను ఏకకాలంలో దర్శించే భాగ్యం ఈ పుస్తకం ద్వారా పాఠకునికి దక్కింది. కొంటె

బొమ్మలు గీతలో నిష్ణాతులైన కార్టూనిస్టులకు వారి కొంటె ముఖచిత్రాలను తమంత తాముగా చూసుకుని మురిసిపోయే కానుకగాను ఈ పుస్తకం నిలుస్తుంది.

యండమూరిగారి ముందుమాట ఈ పుస్తకానికి మణి మకుటమై నిలిచింది. వీరి అక్షర పటిమ తెలియని పాఠకుడు తెలుగునాట లేడు. ఈ పుస్తకానికి యండమూరి మాట "ముందుమాట"గా దక్కటం కార్టూనిస్టు లోకానికి దొరికిన సముచిత గౌరవం, పాఠకుల అదృష్టం. యండమూరి ముందుమాటకు శీర్షిక 'దడిగా దువా నివ్వన' అన్నది తిప్పి చదివితే... నవ్వునివాడు గాడిదే మరి... అన్న పరమరహస్యం బట్టబయలవుతుంది. ఈ పుస్తక రూపకల్పనలో కళాసాగర్‌గారి శ్రమ ఎంత అనేది తొలుత గుర్తించినవారు యండమూరి గారు. కార్టూన్ 'స్ట్రెస్ బస్టర్' అన్నారు. పిల్లవాణ్ణి సెల్‌ఫోన్ నుండి మానిపించే రహస్యాన్ని తన ముందుమాటలో వివరించారు యండమూరి. ప్రచురణకర్త ముందుమాటను అడిగారు కదా అని ఏదో ఒకటి వ్రాయలేదు. పాఠకుడు యండమూరి మార్క్ పీఠికను ఖచ్చితంగా చదువుతాడు.

రెండవ మాటను అందించిన వారు డాక్టర్ జయదేవ్. వీరు నేటికీ కళాసాధకుడిగా శ్రమిస్తు, సృజన సేద్యం చేస్తున్న వ్యంగ్య చిత్రకారులు. వీరి మాట ఈ వ్యంగ్య చిత్రకళకు పోటీగా కంప్యూటర్లు నిలవలేవన్న నమ్మకాన్నిస్తుంది. అలాగే భవిష్యత్ తరానికి భరోసాను ఇస్తుంది.

ముందుమాటలు రాసిన యండమూరి మరియు జయదేవ్ గార్లు "తెలుగు భాషలో కార్టూనిస్టులు అగ్రగణ్యం" అంటారు. ఈ మాట తెలుగువారిలోని వెట'కారం' పాలు కాస్త ఎక్కువనే మాటకు బలం చేకూరుస్తుంది. హాస్యచతురత, సరసమయభాష తెలుగు భాష ఆయువుపట్టని విదితమే.

ఈ పుస్తకం కొరకు 20 సంవత్సరాలుగా కళాసాగర్ గారు తలమునకలై చివరకు సాధించిన 166 మణులను గుచ్చిన మణిమాలతో తెలుగు కార్టున్ ప్రపంచాన్ని సత్కరించారు. 94 సంవత్సరాల కార్టూనిస్టుల చరిత్రకు ఆధారంగా ఈ పుస్తకం నిలుస్తుంది. ఆ తరువాత పుట్టుకొచ్చే కార్టూనిస్టులకు స్ఫూర్తిని నింపుతుంది.

కొన్ని రంగాల సృజనకారులకే ఆదరణ పరిమితమైన కాలంలో... తమతమ వ్యాపారాలను పెంచుకునేందుకు ప్రేక్షకుల నాడిని అందిపుచ్చుకుని ఆడిస్తున్న మీడియంల గారడీ నడుస్తున్న కాలమిది. తెలుగు అక్షర జ్ఞానాన్ని కోల్పోయిన యువత పెరిగిపోతున్న తరుణమిది. పలుసమస్యలు పెనుముప్పుగా చాప కింద నీళ్లులా పాకుతూ భవిష్యత్తుకు సవాళ్లను విసురుతున్నాయి. రాశి-వాసి కోల్పోయిన కళారంగంలో పూర్వపు కళాకారులు సృజించిన కళాఖండాలు మాస్టర్ పీసులుగా మిగిలిపోవడం మినహా మరొక విషయాన్ని మనం ఆశించలేము. చరిత్రను మరిపించే వైభవము కనుచూపుమేర కానరాని పరిస్థితిలో ఈ పుస్తకాన్ని వెలుగులోకి తెచ్చిన కళాసాగర్ భావి తరానికి గొప్ప చైతన్యాన్ని ఇచ్చారు.

హాస్యచిత్ర ప్రపంచానికి 2005 నాటికి 75 సంవత్సరాలు నిండగా... కార్టూనిస్టులు జరుపుకున్న డైమండ్ జూబ్లీ పండుగ సందర్భంగా... వందమంది వ్యంగ్య చిత్రకారుల చరిత్రతో అచ్చయిన పుస్తకం ఇవ్వని అసంతృప్తి నుండి పుట్టుకొచ్చిన సమగ్ర గ్రంథం కరోనా కష్టకాలంలో సాకారమైందని కళాసాగర్ గారు తన మాటలో అంటారు.

ఒక్కొక్క కార్టూనిస్టు సంతకంలోని విశేషాలను తెలిపే వ్యాసం "తెలుగు కార్టూనిస్టుల సంతకాలు" కాగా, "కార్టూన్ల పై వచ్చిన పుస్తకాలు" అన్న వ్యాసంలో... తెలుగులో చిత్రకళపై వచ్చిన పుస్తకాల సంఖ్యతో పోలిస్తే కార్టూన్లపై వచ్చిన పుస్తకాల సంఖ్యే అధికం. ఈ మాట కించిత్ ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. దాదాపు 105 పుస్తకాల పేర్లతో పాటు వీటి రచయిత, ముద్రించిన సంవత్సరాన్ని సంపాదకుడు ఇక్కడ ఇవ్వడం కళాసాగర్‌గారికి ఈ కళపై ఉన్న సాధికారత, అమితమైన నిబద్ధతకు నిదర్శనంగా నిలుస్తుంది. పాఠకులకు హాస్య ప్రపంచపు సంపూర్ణ సమాచారం ఈ రెండు వ్యాసాల ద్వారా సమకూరుతుంది.

జవసత్వాలు ఉడిగిన కళారంగానికి ఈ పుస్తకం టానిక్కులా పనిచేస్తుంది. ఫైన్ ఆర్ట్స్ కళాశాలలో ఇల్లస్ట్రేషన్స్ తో పాటు కనీసం ఒక సెమిస్టర్లో ఒక పాఠ్యాంశంగానైనా చేర్చి ఈ కళను భావితరాలు మరింత మెరుగ్గా వినియోగించుకునేలా వెలుగు దారి చూపాలని విద్యావేత్తలను కోరుతున్నాను.

(For copies: 9885289995)

**కవిత్వం రాసేవాడు హృదయంలోంచి 'లావా'లా భావాలు ఎగదన్నుకు వస్తున్న సమయంలో మాటలకోసం తడుముకోడు. అలాగే చిత్రకారుడు కూడా రేఖలకోసం వెదుకుకోడు.**



**యస్.ఎన్. వెంటపల్లి :** ఖమ్మం కు చెందిన వెంటపల్లి సత్యనారాయణ గారు చిత్రకారుడు, చిత్రకళారచయిత. 64కళలు.కాం పత్రిక ప్రారంభం నుండి చిత్రకళా సంబంధిత వ్యాసాలు, చిత్రకారుల పరిచయ వ్యాసాలు రాస్తున్నారు. ప్రస్తుతం ఖమ్మం జిల్లా ఖజానా ఉప సంచాలకునిగా పనిచేస్తున్నారు. చిత్ర రచన, వ్యాసరచన, కార్టూన్లు గీయటం వీరి వ్యాపకం.



**వాడ్రేవు సుందరరావు :** ప॥గో॥ జిల్లా తణుకు కు చెందిన వాడ్రేవు సుందర రావు గారు రచయిత, నటులు. నంది, గరుడ అవార్డ్ గ్రహీత. ముఖ్యంగా నాటకరంగానికి చెందిన ఎందరో నటీనటుల పరిచయాలను 64కళలు.కాం పత్రిక ప్రారంభం నుండి వ్యాస రూపంలో అందిస్తున్నారు. విశ్రాంత అధ్యాపకులయిన వీరు శిఖండి ఏకపాత్రాభినయం లండన్‌లో ప్రదర్శించారు.



**సుంకర చలపతిరావు:** ప్రముఖ చిత్రకళారచయిత సుంకర చలపతిరావుగారు బహుగ్రంథకర్త. వడ్డాది పాపయ్య, రాజారవివర్మ, దామెర్ల రామారావుల జీవిత చరిత్రల పుస్తకాలు వెలువరించారు. వివిధ పత్రికల్లో చిత్రకళాసంబంధిత వ్యాసాలు అనేకం రాశారు. 64కళలు.కాం పత్రికకు 2010 నుండి చిత్రకళావ్యాసాలు రెగ్యులర్ రాస్తున్నారు. వీరు విశాఖపట్నం షిప్‌యార్డ్ విశ్రాంత ఉద్యోగి.



**మాకినీడి సూర్యభాస్కర్** కవి, చిత్రకళారచయిత, చిత్రకారుడు అయిన మాకినీడి గారు బహు గ్రంథకర్త. కాకినాడకు చెందిన వీరు 64కళలు.కాం పత్రికకు 2010 నుండి చిత్రకళావ్యాసాలు, తెలుగు సినీగాయకుల వ్యాసాలు రాశారు. అధ్యాపనం వీరి వృత్తి. రామారావు నుంచి రామారావు దాకా, కళాతోరణం, రమ్య చిత్రశాల తెలుగునేల వంటి పుస్తకాలు వెలువరించారు.



**మన్నె శ్రీనివాసరావు :** రేపల్లెకు చెందిన మన్నె శ్రీనివాసరావు గారు ప్రముఖ రంగస్థల నటులు, చరిత్ర పరిశోధకుడు, విమర్శకుడు, రచయిత, దర్శకుడు, నాటక సమాజ నిర్వాహకుడు. 64కళలు.కాం పత్రికకు 2013 నుండి నాటకరంగానికి సంబంధించిన వ్యాసాలు రాస్తున్నారు. వీరు ' రేపల్లె చరిత్ర', 'భావపురి రంగస్థలి' వంటి పరిశోధక గ్రంథాలను వెలువరించారు. బాపట్ల జీవిత బీమా సంస్థలో ఉద్యోగం.



**ఆచారం షన్ముఖాచారి:** పుష్కర కాలం క్రితం సినిమా జర్నలిజం చేపట్టి ఈనాడు వారి 'సితార' సినిమా వార పత్రికకు, ఆ సంస్థ నుండి వెలువడే 'తెలుగు వెలుగు' పత్రికకు సినిమా వ్యాసాలు రాసిన షన్ముఖాచారిగారు గత 5 సంవత్సరాలుగా 64కళలు.కాం పత్రికకు పాతతరం నటీనటుల పరిచయాలు రాస్తున్నారు. వీరి వ్యాసాలకు పాఠకుల స్పందన మెండుగావుంది. వీరు హైదరాబాద్ నివాసి.



**ఎల్.ఆర్. వెంకట రమణ:** చిత్రకళా రచయిత, చిత్రకారుడు అయిన ఎల్.ఆర్.వెంకట రమణ వృత్తి అధ్యాపనం. అనంతపురం నివాసి అయిన వీరు 64కళలు.కాం పత్రిక ప్రారంభం నుండి అన్ని విధాలుగా సహకరిస్తున్నారు. 'కళాప్రపంచం' పేరుతో ఎందరో దేశ-విదేశీయ కళాకారులను, సాహితీవేత్తలను పరిచయం చేశారు.



**డా॥ జయదేవ్ బాబు:** సీనియర్ కార్టూనిస్ట్, యానిమేటర్ అయిన జయదేవ్‌బాబు గారు తెలుగు పాఠకులకు సుపరిచితులైన కార్టూనిస్ట్. నాలుగు దశాబ్దాల అనుభవం గల వీరు తన కార్టూన్ అనుభవాలను 64కళలు.కాం పత్రికకు అనేక వ్యాసాల ద్వారా అందించారు. జువాలజీ ప్రొఫెసర్‌గా పదవీవిరమణ చేసిన వీరు చెన్నై నివాసి.



**బి.ఎమ్.పి. సింగ్:** 'కాప్షన్ కింగ్'గా పేరొందిన సింగ్‌గారి పూర్తి పేరు బి.మునిప్రతాప్ సింగ్. సింగ్‌గారి మాతృభాష హిందీ అయినా, తెలుగు అంటే ఆయనకు ప్రాణం. 'ధృవతారలు', 'బెజవాడ ప్రముఖులు' లాంటి ఫీచర్లు సుదీర్ఘకాలం రాశారు. 64కళలు.కాం లోని అనేక శీర్షికలు సింగ్‌గారి కలం నుండి జాలువారినవే. విజయవాడకు చెందిన వీరు దక్షిణ మధ్య రైల్వే విశ్రాంత ఉద్యోగి.



**డా॥ బాలామణి మల్లాది:** ప్రముఖ చిత్రకళా విమర్శకురాలయిన బాలామణి మల్లాది గారు అనేక పత్రికల్లో చిత్ర, శిల్పకళలపై వందలాది వ్యాసాలు రాశారు. ఆర్ట్ హిస్టరీ అంశంలో మాస్టర్ డిగ్రీ చేసిన బాలామణిగారు అనేక సెమినార్లు, వర్కుషాప్‌లు నిర్వహించారు. వీరి నివాసం బరోడా.



**వి.మల్లికార్జున ఆచారి** : వి. మల్లికార్జున ఆచారి చిత్రకారులు, నటులు. గుంటూరులో డ్రాయింగ్ మాస్టర్ గా ఉద్యోగం. కళల మీద మక్కువతో లఘు చిత్రాలలో నటించటం, స్కూలు పిల్లల కొరకు చిన్నచిన్న నాటికలు రాసి, వారితో వేయించటం వీరి హాబీ. యూట్యూబ్లో కొంతమంది రచయితలను ఇంటర్వ్యూ చేశారు. సాంస్కృతిక కార్యక్రమాలు, పుస్తకావిష్కరణలు వంటి సమాచారాన్ని 64 కళలు డాట్ కామ్ ద్వారా కళాభిమానులకు తెలియజేస్తూ... ఒక కళావారధిగా సహకరిస్తున్నారు.



**ఏ.వి.ఎమ్.** : సీనియర్ కార్టూనిస్ట్, కథారచయిత అయిన ఏ.వి.ఎమ్.గారు తెలుగు పత్రికారంగానికి సుపరిచితులు. పదిహేను వేలకు పైగా కార్టూన్లు గీసిన వీరికి జ్యోతిష్యశాస్త్రంలో కూడా ప్రవేశం వుంది. 64కళలు.కాం పత్రికలో కొన్నేళ్ళ పాటు సింగిల్ పేజీ కథలు రాసారు, కార్టూన్లు గీసారు. వీరి కార్టూన్లతో నాలుగు కార్టూన్ పుస్తకాలు ప్రచురించారు. వీరి నివాసం విజయవాడ.



**ఆత్మకూరి రామకృష్ణ:** చిత్రకారుడు, కవి, చిత్రకళారచయిత అయిన ఆత్మకూరి రామకృష్ణ గారు ఫైన్ ఆర్ట్స్‌లో మాస్టర్ డిగ్రీ చేశారు. వృత్తి విజయవాడ కేంద్రీయవిద్యాలయం-2లో చిత్రకళ ఉపాధ్యాయులుగా. ఫింగర్ పెయింటింగ్ ద్వారా 100 చిత్రాలు వేసి ప్రపంచ రికార్డ్ నెలకొల్పారు. వీరు 64కళలు.కాం కు వ్యాసాలు, పుస్తక సమీక్షలు రెగ్యులర్‌గా రాస్తున్నారు.



**అడవి శంకరరావు:** నటుడిగా, నాటక నిర్వహకుడిగా వ్యాఖ్యాతగా, రంగాలంకరణీకుడిగా, పరిషత్ నాటకాల పరిశీలకుడిగా, రచయితగా, పాత్రికేయుడిగా బహుముఖరంగాల్లో రాణిస్తున్న అడివి శంకరరావుగారి వృత్తి మేకప్‌మేన్. మేకప్‌మేన్‌గా దాదాపు 100కు పైగా బహుమతులు అందుకున్నారు. 64కళలు.కాం పత్రికకు ప్రారంభం నుండి వ్యాసాలు రాస్తున్నారు. ప్రస్తుత నివాసం హైదరాబాద్.



**దార్ల నాగేశ్వరరావు:** రిప్లికా ఆర్ట్‌కు అంకురార్పన చేసి తద్వారా ఎన్నో రికార్డులను , అవార్డులను దక్కించుకున్న దార్ల నాగేశ్వరరావు గారు హైదరాబాద్ నివాసి. ఎందరో కళాకారులను స్వయంగా కలిసి 'స్వయం సందర్శనం' శీర్షికగావారి అనుభవాలను వ్యాసాలు రాసారు. హైదరాబాద్ గవర్నమెంట్ ప్రింటింగ్ సెంట్రల్ ప్రెస్‌లో ఛీఫ్ ఆర్టిస్ట్‌గా పనిచేసి విశ్రాంత జీవితం గడుపుతున్నారు.



**ఎన్.వి.పి.యస్.లక్ష్మీ:** చిత్రకారిణి, చిత్రకళా రచయిత అయిన ఎన్.వి.పి.యస్. లక్ష్మీ గారు భగీరధి ఆర్ట్ ఫౌండేషన్ వ్యవస్థాపక కార్యదర్శి. ప్రకృతి చిత్రకారులు భగీరధి గారికి స్వయానా మనుమరాలు. 64కళలు.కాంకు ప్రారంభం నుండి వ్యాసాలు రాస్తున్న వీరు ఉపాధ్యాయ వృత్తిలో వున్నారు. నివాసం రాజమహేంద్రవరం.



**పింగళి భాగ్యలక్ష్మి :** గుంటూరుకు చెందిన భాగ్యలక్ష్మి గారు ప్రముఖ కవుల గురించి, ప్రముఖ రాజకీయ వేత్తల గురించి, వంటల గురించి, సామజిక అంశాల గురించి అనేక పత్రికల్లో ఎన్నో వ్యాసాలు రాశారు. విజయవాడ రేడియో స్టేషన్‌లో వనితావాణి, సాహితీ కార్యక్రమాలలోను పాలొన్నారు. వందకు పైగా కవితలు రాశారు. 64కళలు.కామ్ కు గత నాలుగేళ్ళుగా వ్యాసాలు, పుస్తక సమీక్షలు రాస్తున్నారు.

**వీరే కాకుండా...** చిత్రకారులు బాలి, డా॥ కె. మృత్యుంజయరావు, డా॥బి.ఏ.రెడ్డి, డా॥ గిన్నె సాగర్, డా॥ గోనె లింగరాజు, కొరసాల సీతారామస్వామి, జర్నలిస్ట్ శ్రీనావాసరెడ్డి, జి. పద్మకళ, కందిమళ్ళ సాంబశివరావు, విద్యప్రయాగ, తాడేపల్లి కనకమహాలక్ష్మి, రచయితలు మందరపు హైమావతి, గబ్బిట దుర్గాప్రసాద్, వి. రామకృష్ణ, రాఘవాచారి, డా॥ భువన్, అమ్మిన శ్రీనివాసరాజు, బీర శ్రీనివాస్, హరి, రసూల్, జమదగ్ని, బి.వి.యస్, ప్రసాద్, చలపాక ప్రకాష్, అరసవిల్లి కృష్ణ, బి. ఆంజనేయరాజు, తూములూరి రాజేంద్ర ప్రసాద్... లాంటి అనేక మంది మిత్రులు అవకాశం వున్నప్పుడు, సందర్భానుసారం 64కళలు.కామ్‌కు వ్యాసాలు రాసినవారిలో, రాస్తున్నవారిలో వున్నారు. వారందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

# రంగస్థల కళా ప్రవీణ - డా. పి.వి.ఎన్. కృష్ణ



**పద్యం తెలుగు వారి సొత్తు. పౌరాణిక పద్య నాటకం తెలుగువారి వైభవం. అలాంటి పౌరాణిక పద్య నాటకాన్ని కొత్త ఒరవళ్ళతో, నూతన ఆలోచనా పోకడలతో ప్రేక్షక జనరంజకంగా ఆడుతూ...... నటుడిగా, రచయితగా, ప్రయోక్తగా, నాటకసమాజ నిర్వహకుడిగా, భావికళాకారుల శిక్షకుడిగా, బహుముఖీనమైన పాత్రలు పోషిస్తూ, మరో పక్క ప్రభుత్వ ఉ ద్యోగిగా బాధ్యతలు నిర్యహిస్తూ, దినదినాభివృద్ధితో రాణిస్తున్న డా. పి.వి.ఎన్. కృష్ణగారి పరిచయం 64కళలు.కాం పాఠకులకోసం....**

తూర్పుగోదావరి జిల్లా 'విలసవల్లి' గ్రామంలో 1962 నవంబర్ 11 వ తేదీన పొన్నపల్లి విశ్వనాథం, నారాయణమ్మ దంపతుల ఇంట జన్మించారు పి.వి.ఎన్. కృష్ణ. వీరి పూర్తి పేరు పొన్నపల్లి విశ్వనారాయణ కృష్ణ. బి.ఏ. తర్వాత తెలుగు సాహిత్యంలో ఎం.ఏ. పట్టా పొందారు.

1983 లో ఆంధ్రప్రదేశ్ పోలీసుశాఖలో కానిస్టేబుల్ గా ఉద్యోగ బాధ్యతలు చేపట్టారు. తండ్రి విశ్వనాథం గారు బాల్యదశలోనే ముచ్చటపడి 'భక్తప్రహ్లాద' ఏకపాత్ర నేర్పించగా ప్రదర్శించి చిన్న కప్పును కూడా సాధించారు. ఆయనే తొలి గురువు.

భీమనపల్లిలో చదువుతుండగా డ్రాయింగ్ ఉపాధ్యాయుడు కూచిబొట్ల సత్యనారాయణగారు 'అశ్వద్ధామ' పాత్రను ప్రశంసనీయంగా నేర్పగా తూర్పుగోదావరి జిల్లా స్థాయిలో ప్రథమ స్థానం పొందారు. వారినే నాటకరంగంలో గురువుగా భావిస్తారు కృష్ణ.

**నాటక ప్రస్థానం :**

విజయవాడ పోలీస్ శాఖలో పనిచేస్తూనే శ్రీసాయిబాబా నాట్యమండలిలో చేరి హార్మోనిస్ట్ కె. రామకృష్ణ శాస్త్రి, పి.వి. రమణ మూర్తి గార్ల వాద్య సహకారంతో సుబ్రమణ్య యాదవ్ వారి ఆధ్వర్యంలో దుర్యోధనుడు, కర్ణుడు, విశ్వామిత్రుడు పాత్రలు నేర్చుకుని పద్య నాటక రంగంలో ముందడుగు వేశారు. 1996లో తన మనోయవనిక మీద కదలాడిన ఉషాపరిణయం పద్యనాటకానికి రచయితగా అక్షరీకరణ చేసి, ఆ అక్షరసమూహాన్ని ప్రోది చేసి భావయుక్తంగా, ఉషా పరిణయం నాటకం ప్రదర్శించగా అది అంతగా విజయవంతం కాలేదు. అయినా పట్టు వదలకుండా మరల ప్రయత్నించి రచయితే దర్శకుడయ్యారు. నటరాజు ముందు నిల్చుని శు భశంఖారావం చేశారు. బాణాసుర పాత్ర ధరించి ఆ నాటకానికి త్రిపాత్రాభినయం చేశారు. అప్పుడు ఉషాపరిణయం నాటకం 2005లో అప్పాజోస్యుల, విష్ణుభట్ల కందాళం ఫౌండేషన్ వారు నిర్వహించిన పద్య నాటక పోటీలలో ప్రథమ స్థానం పొంది ఉత్తమ ప్రదర్శన సాధించడం ద్వారా పద్యనాటక విజయ పరంపర ప్రారంభమైంది.

2002 సంవత్సరంలో శ్రీకృష్ణరాయబారం పద్యనాటకాన్ని స్వీయదర్శకత్వంలో నంది నాటకోత్సవాల్లో జనరంజకంగా ప్రదర్శించారు. రచయితగా, దర్శకుడిగా, ప్రధాన నటుడిగా, సమాజ నిర్వహకుడిగా కొనసాగుతునే క్రింది పేర్కొన్న అనేక నాటకాలను విజయవంతంగా ప్రదర్శిస్తున్నారు.

ప్రథమ స్వతంత్ర మహాసంగ్రామం-1857 (భారత స్వతంత్ర చారిత్రాత్మక పద్యనాటకం)

ఖడ్గతిక్కన (చారిత్రాత్మక పద్యనాటకం)

ఉషాపరిణయం (పౌరాణిక పద్య నాటకం)

శ్రీమాధవవర్మ (చరిత్రాత్మక పద్య నాటకం)

పృథ్వీరాజ్ రాసో (చారిత్రాత్మక పద్యనాటకం)

తరిగొండ వెంగమాంబ (భక్తి రసాత్మక పద్యనాటకం)

విధివ్రాత (పౌరాణిక పద్య నాటకం)

ఆంధ్ర మహావిష్ణు (పద్య నాటకం)

అసలీ జిహాద్ (దేశ భక్తి యుత నాటకం)

ఇది కొత్త కథ (యువ సాంఘిక నాటిక)

కృష్ణవేణీ మాత (నదీ ప్రవాహ విశిష్టత–విలువలు).

ఈ నాటకాలలో ప్రధానపాత్రలైన కర్ణ, దుర్యోధన, ఖడ్గతిక్కన, జనరల్ హ్యూగ్రోస్, మాధవవర్మ, చాంద్ వరదాయి, విశ్వామిత్ర, బానాసుర, ప్లాస్టికాసురా, మహామంత్రి తిమ్మరుసు మొదలైన విలక్షణమైన పాత్రలను పోషించి, ప్రేక్షకులచేత మెప్పుపొంది, కీర్తిని, గౌరవాన్ని పొందారు.



**సామాజిక సేవ:** శ్రీ సాయిబాబా నాట్యమండలిలో అనేక నాటక ప్రదర్శనలు విజయవంతంగా ప్రదర్శిస్తూనే, తిరువూరు లక్ష్మీనరసింహారావు వారి కుమారుడు రామన్ ఆశయాలకు, ఆదర్శాలకు ఆకర్షితులయ్యారు. పేద విద్యార్థులకు 'ఉచితంగా' స్టడీ అవర్స్ నిర్వహించడానికి డాక్టర్ రామన్ గారి సోదరుడు డాక్టర్ టీవీఎస్ గిరింద్రనాథ్ ఆర్థిక చేయూతతో విజయవాడ సింగ్‌నగర్‌లో కృష్ణ గారు తన నివాసభవనం పైభాగంలో రోజూ సాయంత్రం వేళ తన శ్రీమతి వెంకట లక్ష్మి శేషసాయి సహకారంతో సుమారు 150 మంది విద్యార్థులకు ఐదుగురు ఉపాధ్యాయులతో పేద విద్యార్థులకు విద్యా బోధన కార్యక్రమం నిర్వహిస్తున్నారు.

కృష్ణగారు ఆంధ్రప్రదేశ్ పోలీసుఉద్యోగిగా శ్రీకాకుళంలో 2017 సంవత్సరంలో అప్పటి ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడుగారి చేతులమీదుగా పోలీస్ శాఖలో విద్యుక్త ధర్మంగా, బాధ్యతలతో పనిచేసేందుకు లభించే అరుదైన పోలీస్ అవార్డు ఇండియన్ పోలీస్ మెడల్ (IPM) స్వీకరించారు.

**నట పరంపర:** "పద్యం తెలుగువారి సొత్తు". పౌరాణిక పద్య నాటకం కాలక్రమేణా 'తెలుగు రాష్ట్రాల్లో కనుమరుగయ్యే ప్రమాదం ఉందని, అడుగంటిపోతూ, అంతరించి పోకుండా ఉండాలంటే ఏం చేయాలి?, ఎలా? అన్న ఆలోచన మొలకెత్తింది కృష్ణగారి మస్తిష్కంలో. అంతే ఉవ్వెత్తున లేచాయి.. తన మనో సాగరంలో అలోచనా తరంగాలు. తనని నటుడిగా, దర్శకుడుగా ఈ స్థాయికి తీసుకొచ్చిన కళారంగానికి ఊపిరులు ఊది, జవ సత్వాలు నింపకపోతే మరి తన తరువాత ఎవరు నాటకరంగం వికాసానికి నడుం కట్టి మళ్లీ ప్రభలు వెలిగిస్తారు. కీర్తి ప్రతిష్టలు తెస్తారు? ముందుగా... సాగు చేసి, విత్తనం నాటి దానికి నీరు పోస్తే అదే మహావృక్షం అవుతుంది. కళావృక్షం అవుతుంది. శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది. పద్య నాటక రంగంలో అందరికీ ఆదర్శం అవుతుంది. అదే ఆలోచన...... ఆచరణలో ఎలా పెట్టడం?.. ప్రయత్నం ప్రారంభమైంది.

అనేక కళాశాలల్లో విద్యార్థుల్ని పరిశీలించి, జల్లెడపట్టి, పాత్రోచితంగా చక్కగా సరిపోయే వారిని ఎంపిక చేసుకుని, వారిని సాయంత్రం వేళ హార్మోనియం ముందు సాధన చేయిస్తూ... వారికి పద్యాలు అర్థం అయ్యేటట్లు నేర్పించారు.

శృతిలో, రాగయుక్తంగా, భావయుక్తంగా పాడ గలిగేటట్లు శిక్షణ ఇచ్చి,

**అవార్డులు – రివార్డులు :** కృషి ఉంటే మనుషులు ఋషులు అవుతారు అన్న నానుడికి ఉదాహరణగా 12 నంది అవార్డులు, 8 ఎన్టీఆర్ అవార్డులు, 6 గరుడ అవార్డులతోపాటు కందుకూరి వీరేశలింగం నాటకరంగం పురస్కారం, కర్నాటి లక్ష్మీనరసయ్య జీవిత సాఫల్య పురస్కారం, శనగల కబీర్‌దాస్ పురస్కారం, ఎస్.వి. రంగారావు స్మారక పురస్కారం, కె.ఎల్. యూనివర్సిటీవారి సి.ఎస్. ఆర్. అవార్డు, ఇంకా పోలీస్ డిపార్ట్మెంట్ నుంచి 50కి పైగా క్యాష్ అవార్డ్స్, ఉత్తమ సేవా పతకం అసంఖ్యాకమైన సన్మానాలు, సత్కారాలతో పాటు ఎన్నో బహుమతులు అందుకున్నా, కీర్తి కిరీటాలు వచ్చినా 'విద్య యొసగును వినయంబు' అన్న చందాన తన మాటల్లోనూ, చేతల్లోనూ అహంభావం, అహంకారం వీసమెత్తు కూడా ప్రదర్శించని నిగర్వి, సంస్కారమే ఆభరణంగా ఉండే వినయశీలుడు కృష్ణ గారు.



*విజయవాడలో ఫిబ్రవరి 27న, సమతా సేవా సమితి ఆధ్వర్యంలో పి.వి.ఎన్. కృష్ణ గారిని గండపెండేర ధారణంతో సత్కరిస్తున్న దృశ్యం*

చక్కని ముఖకవళికలు ప్రదర్శిస్తూ, సంభాషణలు అందరికీ అర్థం అయ్యేటట్లు, మైకు ముందే పాడకుండా, చక్కని హావభావాలతో ప్రేక్షకులు మెచ్చుకునేలా ప్రదర్శించారు తొలి సారిగా. ఆ పద్యనాటకమే తిరుపతి వెంకటకవులు రచించిన 'శ్రీకృష్ణ రాయబారం'. ఈ నాటకం రంగస్థలంపై '26' అద్భుత ప్రదర్శనలిచ్చి ఎన్నో బహుమతుల్ని, పెద్దల ఆశీస్సులను, పత్రికల ప్రశంసలను అందుకున్నారు. ఆ యువ కళాకారులు.

రామకృష్ణ పరమహంసకు వివేకానందుడు లభించినట్లు కృష్ణగారికి క్రమశిక్షణ, ఆశక్తి కల్గిన యువతీయువకు లభించడం అదృష్టం. వారిరువురి కృషి ఫలించి తెలుగు పద్యనాటకం రంగస్థలంపై పదికాలాల పాటు నిలవాలని ఆ విధంగా కృష్ణగారి కల సాకారం కావాలని ఆశిద్దాం.

గతంలో పోలీసు డిపార్ట్మెంట్‌లో ఆసక్తి వున్న తన సహ ఉద్యోగులకు పద్యనాటకంలో శిక్షణ ఇచ్చారు కృష్ణగారు. వారందరూ కూడా ప్రస్తుతం రంగస్థలం పై మంచి నటులుగా రాణిస్తున్నారు.

నటీనటుల నట విన్యాసం, సంగీత రస ప్రవాహం, రూపాలంకరణ, రంగాలంకరణ మొదలయిన శాఖల సమ్మేళనమే నాటకం. నాటకం ప్రేక్షకులు మెచ్చుకునేలా విజయవంతం కావాలంటే దర్శకుడే అన్ని కోణాల్లో నాటకాన్ని పరిశీలించి, జాగ్రత్తలు తీసుకోవాలి. అప్పుడే "నాటక ప్రయోక్త" అవుతాడు. అలాంటి అన్ని జాగ్రత్తలు తీసుకుంటారు కాబట్టే డా. పి.వి.ఎన్. కృష్ణగారు 'మంచి' నాటకప్రయోక్తగా గుర్తింపుపొందారు.

పౌరాణిక పద్యనాటకం, సాంఘిక నాటకం రచయితే కాకుండా, పోలీసు ఉద్యోగిగా కాకుండా, ఒక సాధారణ భారతీయ పౌరుడిగా బాధ్యత వహిస్తూ సామాజిక ప్రయోజనాన్ని ఆశిస్తూ ప్రస్తుత మహమ్మారి, సర్వ వినాశని ''కరోనా'' విశృంఖల విలయతాండవ పరిస్థితిపైన, అందుకుగాను ప్రజాసమూహం తీసుకోవలసిన జాగ్రత్తలు గురించి, అప్రమత్తత గురించి అద్భుతంగా పద్యాలు రచించి, తన గానం ద్వారా ప్రజలకు వినిపించారు.

అనేక దశాబ్దాలుగా కొనసాగిన కృష్ణగారి కళాసేవకి గుర్తింపుగా 'అకాడెమీ ఆఫ్ యూనివర్సల్ గ్లోబల్ పీస్' వారు డాక్టరేట్ ఇన్ ఇండీజినెస్ (స్థానిక కళలు) 'డాక్టరేట్' ప్రదానం చేసారు.

**కుటుంబం:** శ్రీమతి వెంకట లక్ష్మి శేషసాయి కృష్ణగారి దంపతులకు ముగ్గురు కుమారులు విశ్వకాంత్, ప్రసన్నకుమార్, సాయిశంకర్. వీరిలో మూడవ కుమారుడు సాయిశంకర్ తండ్రి కళావారసత్వాన్ని స్వీకరించి శ్రీకృష్ణరాయభారం నాటకంలో దుర్యోధన పాత్ర పోషించి తండ్రికి తగ్గ తనయుడిగా రాణిస్తున్నాడు.

కొత్త ఒరవడితో, నూతన ఆలోచనా పోకడలతో పౌరాణిక పద్యనాటకాన్ని ప్రేక్షక జనరంజకంగా ఇలానే భవిష్యతరాలకు అందిస్తూ...... తన ఉద్యోగంలో కూడా ఉన్నత పదవులు అధిరోహించాలని ఆకాంక్షిద్దాం.

# ఆత్మావిష్కరణకు రూపమే-అశోక్ చిత్రాలు



**అశోక్ చిత్రాలలో వర్ణాలు, ఆ చిత్రాలలోని అంశాల అమరిక చూడగానే ఒక లయను స్ఫురింపచేస్తాయి. ప్రేక్షకుని ఒక విలక్షణమైన అనుభూతికి లోనుచేస్తాయి. ఈ చిత్రాలలో స్త్రీ పురుషులు ఇద్దరూ కనిపిస్తారు. వివిధ భంగిమల్లో ఆలోచనల్లో నిమగ్నమయి ఉంటారు. వారి ఆలోచనలు ఏమిటి? చిత్రకారుడు వ్యక్తం చేయదలచిన వారి అంతరంగం ఏమిటి? అని నిశితంగా పరిశీలించినపుడు మాత్రమే ప్రేక్షకునికి అవగతమవుతుంది. ఈ చిత్రాలలో అత్యధికం ప్రేమ, శృంగారం, విరహం, కోర్కెలతో పరుగులు తీయడం లాంటివే ఎక్కువగా కనిపిస్తాయి. చిత్రాలలో వస్తు ప్రాధాన్యతతో పాటు చిత్రీకరణలో అనుసరించిన టెక్నిక్, వర్ణ సమ్మేళనం చూపరులను ఆకట్టుకుంటుంది.**

అశోక్ చిత్రాలలో చేపలు, శంఖువులు, ఆల్చిప్పలు, కలువలు, తామరలు లాంటి వాటితోపాటు జలాశ్వాలు, మత్స్యకన్యలు లాంటి వూహాజనిత అంశాలు ఎన్నో ఉంటాయి. అలాగే నెమళ్లు, చిలకలు లాంటి పక్షులు, గ్రామీణ దృశ్యాలు కూడ దర్శనమిస్తాయి. ఇంతకు ముందు చెప్పినట్లు వర్ణాలను వినియోగించుకున్న రీతిలోనే వీటిని కూడ దాదాపు ప్రతి చిత్రంలోను వినియోగించుకున్నాడు. వీటిలో అత్యధికం ప్రతిచిత్రంలోను కనిపిస్తాయి. కాని వాటిని రకరకాల పరిమాణాల్లో, ఒక్కో చిత్రంలో ఒక్కోరకంగా అమర్చడం ద్వారా వైవిధ్యాన్ని తీసుకురాగలిగారు అశోక్. ఆయన అనుసరించిన కళ్ళ విధానం చిత్ర విభాగాలను విడివిడిగా స్పష్టం చేయడవే కాకుండా, ఆయన చిత్రాలకు ఆధునిక స్వరూపాన్ని సంతరింప చేసింది.



చిన్నప్పటి నుండి డ్రాయింగ్ మరియు పెయింటింగ్ పట్ల ఆశక్తి వున్న కృష్ణ, పోర్ట్రెయిట్ చిత్రాలు వేసే మామయ్యను చూసి ఆకర్షించబడి, పెద్ద య్యాక ఆ అభి రుచినే వృత్తిగా

చేసుకున్నాడు. అందుకే ఫైన్ ఆర్ట్స్‌లో డిగ్రీ తీసుకుని, గ్రాడ్యుయేషన్ తర్వాత 'ఈనాడు తెలుగు దినపత్రిక'లో పద్యాలు, కథలకు బొమ్మలు గీసే చిత్రకారుడిగా తర్వాత 'ఉదయం పత్రిక'లో ఇలస్ట్రేటర్‌గా కొంత పనిచేశాడు. అప్పుడే తనకు స్వంతంగా ఏదైనా చేయాలన్న కాంక్ష వుండేది, అందుకే 90వ దశకం చివరిలో హైదరాబాద్‌లో స్వంతంగా గ్రాఫిక్ డిజైనింగ్ మరియు పెయింటింగ్ స్టూడియోని ప్రారంభించాడు.

'అద్వైత–అంతర్గత ఆత్మ': "నేను ఎల్లప్పుడూ ఆధ్యాత్మిక విక్రయం యొక్క ఆత్మ మరియు కోర్ని చేరుకోవడానికి ప్రయత్నించాను నా పెయింట్స్ ద్వారా. నేను ఎల్లప్పుడూ నా చిత్రాలలో కొన్ని థీమ్‌లను అనుసరిస్తూ ఉంటాను. ఆత్మను తాకడంలో నాకు సహాయపడేవి ఎగ్జిబిషన్లు. నా గత ఎగ్జిబిషన్‌కు 'అద్వైతం' అని పేరు పెట్టడానికి ప్రధాన కారణం నా ప్రతి చిత్రములోనూ కనపడుతుంది, వాటిలో ముఖ్యమైన పక్షి నిర్మాణం ఉంది, ఇది ఆత్మను వర్ణిస్తుంది, ఇది జెండర్‌తో సంబంధం లేకుండా మొత్తం శరీరానికి ఏకీకృత వివరణ ఇస్తుంది. నా మునుపటి చిత్రాలలో మ్యూజింగ్‌లు, విండోస్ అంతర్యామి వంటివి ఉన్నాయి, ఇవి ప్రముఖ కళాకారుల నుండి ప్రశంసలు అందుకున్నాయి" అంటాడు అశోక్.

"నా భవిష్యత్ మార్గాన్ని నేను ఎప్పుడూ ప్లాన్ చేసుకోలేదు. నేను జీవితం – ఆత్మ యొక్క అర్థం కోసం వెతుకుతున్నాను, నేను నా చిత్రాలలో సమాధానం మరియు శోధనను చిత్రించాలనుకుంటున్నాను. ఇది నన్ను ఎక్కడికి తీసుకెళ్తుందో నాకే తెలియదు, కానీ అది నన్ను సరైన ముగింపుకు తీసుకువెళుతుందని నేను ఖచ్చితంగా నమ్ముతున్నాను, అప్పటి వరకు నేను పెయింటింగ్ చేస్తూనే ఉంటాను, జీవితాన్ని చిత్రీకరిస్తూనే ఉంటాను" అంటారు.

గుంటూరు జిల్లా, మంగళగిరిలో 1964లో జన్మించిన వి. కృష్ణ అశోక్ 2004 నుండి హైదరాబాదుతో పాటు, ఇతర దక్షిణ భారత నగరాలలో 40కి పైగా సోలో ప్రదర్శనలు నిర్వహించారు. 1991 నుండి రాష్ట్రంతో పాటు, దేశ, విదేశాలలో అనేక గ్రూపు షోలలో తన చిత్రాలను ప్రదర్శించారు. హాంకాంగ్, అమెరికా, ఫ్రాన్స్, కెనడాలతో పాటు దేశంలోని అనేక సంస్థలు వ్యక్తుల వద్ద ఆయన చిత్రాల కలెక్షన్ ఉంది.

–కళాసాగర్

# 'తానా' వారి బహుమతితో నూతనోత్సాహం...!

**యస్.వి.రమణ** పేరుతో కార్టూన్లు గీస్తున్న వీరి పూర్తి పేరు సుంకర వెంకట రమణారావు. కొంతకాలం అరుణ్ పేరుతో కార్టూన్లు గీశారు. పుట్టింది **26 నవంబర్ 1960**, విజయవాడలో. ఆరో తరగతి నుంచే సైన్స్ పుస్తకాల్లోని బొమ్మలు గీయడం ప్రారంభించిన వీరికి పదో తరగతిలోకి వచ్చే సరికి బొమ్మలు గీయడంలో ఓ అవగాహన కలిగింది. సొంత శైలితో బొమ్మలు గీయడానికి ఈ వ్యంగ్య (కార్టూన్) చిత్రకళని ఎందుకున్నారు.

కార్టూన్లు గీయాలన్న ఆలోచన బాగుంది కానీ... ఎలా వేయాలి? ఎలా పంపాలి? ఈ విషయాలేం తెలిసేది కాదు. కార్టూనిస్టు మిత్రులు శేఖర్, సుకేష్, వేణుగార్ల పరిచయంతో కార్టూన్లు గీయడం, పంపడం, పోటీల్లో పాల్గొనడం లాంటి విషయాలు తెలుసుకోగలిగారు. అప్పట్లో వీరందరూ జయదేవ్‌గారి శిష్యరికం (పోస్ట్‌లో) చేశారు. అప్పటికే జయదేవ్‌గారు చాలా పేరున్న కార్టూనిస్టు. కార్టూన్లలో మెళకువల కోసం ఉత్తరాలు వ్రాసేవారు, గురువుగారు చాలా ఓపిగ్గా వీరి ఉత్తరాలకి జవాబు రాసేవారు. ఆయన చాలా సలహాలు, సూచనలు ఇచ్చేవారు. ఓ సారి జయదేవ్‌గారు మద్రాసు నుంచి విజయవాడ వచ్చినపుడు వీరికి కొన్ని బ్రష్లు, క్రోక్విల్ నిబ్బులు బహుమతిగా ఇచ్చారు.

**కార్టూన్ ప్రస్థానం:** 1976లో వీరి మొదటి కార్టూన్



**'అనామిక'** అనే మాసపత్రికలో అచ్చయింది. మొదట్లో 'అరుణ్' కలం పేరుతో కార్టూను గీశారు. అప్పట్లో తెలుగులో చిన్న పెద్ద కలిపి సుమారు ఓ ఏభై పత్రికలు వుండేవి. దాదాపు అన్ని పత్రికల్లోనూ విరివిగా కార్టూన్లు ప్రచురించేవారు. అలాగే వీరి కార్టూన్లు కూడా విరామం లేకుండా అన్ని పత్రికల్లోనూ వచ్చేవి. అప్పట్లో పత్రికల మధ్య, రచయితల మధ్య అలాగే కార్టూనిస్టుల మధ్య చాలా మంచి ఆరోగ్యకరమైన పోటీ వాతావరణం వుండేది. అందుకే మంచి పరిణతి చెందిన రచనలు, కార్టూన్లు పత్రికలో వచ్చేవి. అలా తెలుగు పత్రికల్లో విస్తారంగా కార్టూన్లు గీస్తూ వుండగా. ఓ మిత్రుడు (శ్రీ కృష్ణపుల్లయ్య, **క్రిపు ఆర్ట్స్**, విజయవాడ) ఓ సలహా ఇచ్చాడు "తెలుగులో బోల్డు కార్టూన్లు వేశారు. మంచి పేరు వచ్చింది. మరి ఇతర భాషల వారికి, ఇతర రాష్ట్రాల వారికి మీ కార్టూన్లని పరిచయం చేయవచ్చుకదా" అని ఇదో కొత్త ఆలోచన– అప్పట్లో



తెలుగుతో పాటు కన్నడ, తమిళ పత్రికలు కూడా కార్టూన్లు బాగా ప్రచురించేవి. ఈ మిత్రుడి సహకారంతో కన్నడంలో కార్టూన్లు గీశారు రమణ. కన్నడ పాఠకుల నుంచి, సంపాదకుల నుంచి మంచి స్పందన వచ్చింది. దాదాపుగా అన్ని కన్నడ పత్రికల్లోనూ వీరి కార్టూన్లు వచ్చాయి. ఇదే ఉత్సాహంతో తమిళంలో కూడా కార్టూన్లు గీశారు. ఆ తర్వాత హిందీ, ఇంగ్లీషు, మళయాళం పత్రికల్లో కూడా చాల కార్టూన్లు గీశారు రమణ. అప్పట్లో అమెరికా నుంచి వెలువడే ఓ ప్రముఖ తెలుగు పత్రిక "తెలుగు అమెరికా"లో కూడా వీరి కార్టూన్లు కొన్ని అచ్చయ్యాయి.

**వికాసం:** కార్టూనిస్ట్ మిత్రులందరం కలిసి బోల్డు కార్టూన్లు గీసేస్తున్నాం. కాని ఎప్పుడూ మనమేనా–ఔత్సాహికులు ఏరి? ఈ ప్రశ్నతో–ప్రముఖ పబ్లిసిటీ డిజైనర్ మరియు కార్టూనిస్టు **గీతా సుబ్బారావు**గారి ఆధ్వర్యంలో విజయవాడలో "కార్టూనింగ్ ఇనిస్టిట్యూట్" నెలకొల్పారు. ఆ విధంగా కొంతమంది కొత్త కార్టూనిస్టులని ప్రోత్సహించగలిగారు. అప్పట్లో ఇదో సంచలనం. అటు పత్రికా రంగంలోనూ విజయవాడ నగరంలోనూ. కార్టూనిస్టు మిత్రులందరూ కలిసి '**విజయవాడ కార్టూనిస్టుల సంఘం**' (వికాసం) ప్రారంభించారు. దీనికి నవోదయ పబ్లిషర్స్ రావెమ్మోహనరావుగారు, ఎమ్వీఎల్‌గారు అండగా నిలిచారు. 'వికాసం' తరుపున ప్రతి సంవత్సరం కార్టూన్ల పోటీలు నిర్వహించి, సావనీర్ ప్రింట్‌చేసి, సభ నిర్వహించి, సీనియర్స్‌ని సత్కరించి, ఔత్సాహికులకు బహుమతులు ఇచ్చి–సభని ఓ పండగలా జరిపారు.

**అవార్డులు, రివార్డులు:** ఎన్నో అవార్డులు, బహుమతులు, సన్మానాలు అందుకున్న వీరు విజయవాడ ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్ వారు ప్రతి ఏటా నిర్వహించే కార్టూన్ పోటీల్లో వరుసగా మూడు సంవత్సరాలుప్రథమ బహుమతి గెలుచుకున్నారు. ఇంకా విజయవాడ రోటరీ క్లబ్, విశాఖ రోటరీ క్లబ్, అలాగే హైదరాబాద్ వెంకట్ అవార్డు, ఆంధ్రప్రదేశ్ కుటుంబ నియంత్రణాసాధికార సంస్థ అవార్డు, ఇంకా ఇతర రాష్ట్రప్రభుత్వ శాఖలవారి కార్టూన్ల పోటీల్లో అనేక బహుమతులు. 'రాష్ట్రస్థాయిలో ప్రప్రథమంగా ఆంధ్రప్రదేశ్ క్రోక్విల్ అకాడమీ 1980 నిర్వహించిన కార్టూన్ల పోటీలో **ఉత్తమ కార్టూన్ అవార్డు, 2023 సం॥లో తానా కార్టూన్ పోటీల్లో అత్యుత్తమ కార్టూన్** బహుమతిగా 5000 రూ. నగదు అందుకోవడం జీవితంలో మరిచిపోలేనిదని, అది నూతనోత్సాహాన్నిచ్చిందని' రమణ అంటారు.

**వ్యక్తిగతం:** చదువు పూర్తయిన తర్వాత, ఉద్యోగం, పెళ్ళి వెంట వెంటనే జరిగాయి. ముందుగా పెళ్ళి (కారణంగా) బదిలీ. కొత్త సంసారం కార్టూన్లు గీయడానికి తీరికేలేదు. కాస్తంత సర్దుకొని మొదలు పెడితే ఈలోగా మళ్ళీ (ఉద్యోగ) బదిలీ. ఇలా బదిలీ మీద బదిలీ కారణంగా కార్టూన్లకి సుదీర్ఘ విరామం ఏర్పడింది. ఉద్యోగ సోపానంలో, సంసారంలో ఈదుకుంటూ వచ్చి హైదరాబాద్‌లో స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్నారు. వీరు **కేంద్రప్రభుత్వ భీమా సంస్థ**లోనూ, వీరి భార్య వనజ రాష్ట్రప్రభుత్వంలోనూ ఉద్యోగాలు చేశారు. వీరి ఇద్దరు పిల్లలు. అబ్బాయి తారా శశాంక్, అమ్మాయి సాయి ప్రియాంక అమెరికాలో స్థిర పడ్డారు.



# కైలాస విశ్వనాథుని చెంతకు కళాతపస్వి

**సినిమా పరిశ్రమను ఒక కళామాధ్యమంగా గౌరవించి, కార్యదీక్ష, నిబద్ధతతో, కార్యాచరణకు నాంది పలికే సందేశాత్మక చిత్రాలకు ప్రాణం పోసి, ప్రేక్షకులకు ఆరోగ్యవంతమైన వినోదాన్ని పంచిన కళా తపస్వి కాశీనాథుని విశ్వనాథ్ 02, ఫిబ్రవరి, 2023 రాత్రి అనాయాస మరణం చెందారు.** చిత్త శుద్ధితో యాభైకి పైగా సినిమాలకు దర్శకత్వం వహించి కేంద్ర ప్రభుత్వం చేత పద్మశ్రీ, దాదా సాహెబ్ ఫాల్కే పురస్కారాలను అందుకున్న విశ్వనాథుడు తెలుగు చిత్రసీమకు బి.ఎన్.రెడ్డి, కె.వి.రెడ్డి, ఆదుర్తి వంటి మహనీయుల సరసన హేమాహేమీగా నిలిచిన ఘనత దర్శకుడు విశ్వనాథ్ ది. ముఖ్యంగా 70, 80 వ దశకాలలో జాతీయ స్థాయిలో గుర్తింపు తెచ్చే చిత్రాలకు ప్రాణం పోసిన ఈ ధన్యజీవి సంగీతానికి, నాట్యానికి, నటనకు సమాన ప్రాతినిధ్యం కల్పిస్తూ చిత్రాలను నిర్మించడం విశేషం. 'శంకరాభరణం' వంటి కళాఖండం ద్వారా లలిత శాస్త్రీయ సంగీతానికి పెద్దపీట వేసి కొత్త వరవడికి నాంది పలికారు. 'పాశ్చాత్య సంగీతపు పెనుతుఫానుకు రెపరెపలాడుతున్న శాస్త్రీయ సంగీతానికి అరచేతులు అడ్డుపెట్టిన చిత్రంగా 'శంకరాభరణం' ద్వారా తెలుగువారి సంస్కృతిని గుర్తుచేశారు. సంస్కృత పదబంధంలో నిండిన చక్కని పాటలు ఆబాల గోపాలాన్నే కాకుండా రిక్షావాళ్లు కూడా పాడుకునేలా చేశాయి... నాలుగు జాతీయ పురస్కారాలు తెచ్చి పెట్టాయి. అలాగే 'సాగర సంగమం' చిత్రం ద్వారా నాట్యానికి పెద్ద పీట వేస్తూ మరో ఆణిముత్యాన్ని మనకు అందించారు. 'స్వాతిముత్యం' చిత్రం ద్వారా స్వచ్ఛమైన అమాయకత్వం ఎలావుంటుందో, కష్టపడి బ్రతకడంలో ఎంతటి తృప్తి వుంటుందో కమలహాసన్ పాత్రలో ప్రదర్శింపజేశారు. ఉండమ్మా బొట్టు పెడతా, చెల్లెలి కాపురం, కాలం మారింది, ఓ సీత కథ, జీవన జ్యోతి, సిరిసిరి మువ్వ, సీతామాలక్ష్మి, సప్తపది, సిరివెన్నెల, శ్రుతిలయలు, స్వయంకృషి, స్వర్ణకమలం, సూత్రధారులు, ఆపద్బాంధవుడు, స్వాతికిరణం, శుభసంకల్పం విశ్వనాథ్ అందించిన ఆణిముత్యాలు. 1981 ఫ్రాన్స్ ఫెస్టివల్‌లో సత్కారం పొడడం విశ్వనాథ్ మకుటంలో కలికి తురాయి. ఆడియోగ్రాఫర్‌గా చిత్రరంగ ప్రవేశం చేసి 'ఆత్మగౌరవం' చిత్రంతో దర్శకుడుగా మారిన విశ్వనాథ్ జాతీయ స్థాయిలో 5 బహుమతులు అందుకున్నారు. 10 ఫిల్మ్ ఫేర్ బహుమతులు, 7 నంది బహుమతులు అందుకున్న విశ్వనాథ్ తన చిత్రాలకు తానే స్క్రిప్ట్ రాసుకునేవారు. విశ్వనాథ్ చిత్రాలలో పాటల చిత్రీకరణకు ఓ ప్రత్యేకత వుంది. వారి మరణానికి



అంజలి ఘటిస్తూ కొన్ని పాటల విశేషాలు తెలుసుకుందాం.

**విశ్వనాథ్ నేపథ్యం:** ఫిబ్రవరి 19, 1930 న విశ్వనాథ్ గుంటూరు జిల్లా రేపల్లె లో జన్మించారు. గుంటూరు హిందూ కళాశాలలో ఇంటర్మీడియట్, ఆంధ్రా క్రైస్తవ కళాశాలలో బియ్యస్సి పూర్తిచేసి మద్రాసు పయనమయ్యారు. విశ్వనాథ్ తండ్రి సుబ్రహ్మణ్యం వాహినీ స్టూడియోలో సహకార శాఖలో పనిచేసేవారు. అలా వాహినీ స్టూడియోలో విద్యార్థిగా ధ్వనిముద్రణ విభాగంలో ఏ. కృష్ణన్ వద్ద రికార్డిస్టుగా చేరారు. వాహినీ స్టూడియోలో అప్పట్లో ప్రతి టెక్నీషియను కెమెరా ప్రొజెక్షన్, లేబరేటరీ వంటి అన్ని విభాగాలలో పనిచేయాలి అనే నిబంధన వుండేది. అలా ఆడియో విభాగంలో విశ్వనాథ్ యెన్నో చిత్రాలకు సౌండ్ రికార్డిస్టుగా పనిచేశారు. తర్వాత రామనాథ్‌కు సహాయకుడిగా కూడా పనిచేశారు. అన్నపూర్ణా వారి "తోడికోడళ్ళు" సినిమాకు సౌండ్ రికార్డిస్టగా పనిచేస్తున్నప్పుడు విశ్వనాథ్‌కు దర్శకుడు ఆదుర్తి సుబ్బారావుతో పరిచయం యేర్పడింది. ఆ పరిచయంతో అన్నపూర్ణా వారి "ఇద్దరు మిత్రులు", "వెలుగునీడలు", "చదువుకున్న అమ్మాయిలు", "డాక్టర్ చక్రవర్తి" వంటి చిత్రాలకు సహాయదర్శకుడిగా పనిచేస్తునప్పుడు నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు, హీరో అక్కినేనిల దృష్టిని ఆకర్షించడం జరిగింది. విశ్వనాథ్ పనితనం గమనించిన అక్కినేని నాగేశ్వరరావు అన్నపూర్ణా సంస్థలోకి ఆహ్వానించి, దర్శకత్వశాఖలో రెండేళ్ళు

పనిచేశాక సొంతంగా దర్శకత్వం నిర్వహించే అవకాశాన్ని ఇస్తానని వాగ్దానం చేశారు. అలా అన్నపూర్ణా సంస్థలో "వెలుగునీడలు" చిత్రం నుంచి యెక్కువ సినిమాలకు సహకార దర్శకునిగా విశ్వనాథ్ పనిచేశారు. అన్నమాట ప్రకారం "డాక్టర్ చక్రవర్తి" సినిమా తర్వాత అన్నపూర్ణా సంస్థ "ఆత్మగౌరవం" సినిమాకు దర్శకత్వ పగ్గాలు విశ్వనాథ్‌కు అప్పగించింది.

**ఆత్మగౌరవంతో ఆత్మవిశ్వాసం:** ఈ సినిమాకు సాలూరు రాజేశ్వరరావు అందించిన సంగీతం అమరం. "ఆత్మగౌరవం" సినిమాలో మొత్తం పది పాటలున్నాయి. ఇందులో పాటలన్నీ మరలా మరలా వినాలనిపించి అమృతగుళికలే. రేలంగి తన పొలాల గొడవ పరిష్కారంకోసం పల్లెటూరికి వచ్చి, గుమ్మడి ఇంటిలో విందు ఆరగించినప్పుడు చిన్ననాటి వాసు, సావిత్రి ఆలపించే సినారె గీతం "మారాజు లొచ్చారు మహరాజు లొచ్చారు మాయింటికొచ్చారు...మా మంచి వారంట మనసున్న వారంట మా కెంతోనచ్చారు" అనే అద్భుతమైన పాట చిత్రీకరణ యెంత గొప్పగా వుంటుందో చూసి తీరాల్సిందే. సినిమా కథకు ఈ పాటే మలుపు. అంతర్ కళాశాల వక్తృత్వ పోటీల్లో అక్కినేని ఆలపించే ఆరుద్ర గీతం "ప్రేమించి పెళ్లి చేసుకో...నీ మనసంతా హాయినింపుకో" లో ప్రేమవివాహానికి పెద్దపీట వేశారు దర్శకుడు. ముఖ్యంగా చెప్పుకోవలసిన పాట రామప్పగుడి, పాకాల సరస్సు వద్ద చిత్రీకరించిన దాశరథి గీతం "ఒక పూల బాణం తగిలింది మదిలో, తొలిప్రేమ దీపం వెలిగిందిలే". శంకరాభరణ రాగస్వరాలతో అల్లిన ఈ పాటకు హిందీ సినిమా "తాజ్ మహల్"లో పహాడి రాగంలో రోషన్ స్వరపరచిన "జో వాదా కియా వో నిభానా పడేగా" పాటను గుర్తుచేస్తుంది. పహాడిరాగం కూడా శంకరాభరణ రాగజన్యం కావడం ఈ పోలికకు కారణం కావచ్చు. సినిమా మొత్తం మీద ఈ పాట మకుటాయమానం. గుడిలో దీపం ఎల్లప్పుడూ వెలుగుతూనే వుటుంది. అలాగే అక్కినేని–కాంచనల తొలి ప్రేమ అనే దీపం కూడా వెలిగిందనే సారూప్యాన్ని చూపించేందుకు రామప్ప గుడిని దర్శకుడు ఎన్నుకున్నారు. అంతవరకు రామప్ప గుడిలో ఏ సినిమా కూడా చిత్రీకరణకు నోచుకోలేదు. నందీశ్వరుడు మహేశ్వరునికి నమ్మినబంటే కాదు విశ్వాసపాత్రుడు కూడా. అలాగే అక్కినేని–కాంచనల ప్రేమ కూడా పవిత్రమైనదని, విశ్వాసపాత్రమైనదని తెలియజేయాలని రామప్ప గుడిలోని నందిని, గుడి ప్రాంగణంలో వెలసిన నాగిని శిల్పాలను విశ్వనాథ్ సింబాలిక్‌గా చూపారు. కారులో మొదలై విడిది గృహంలో చిరుజల్లుల మధ్య ఒదిగే శ్రీశ్రీ గీతం "వలపులు విరిసిన పూవులే కురిపించే తేనియలే" మరో అద్భుతగీతం. ఇందులో "ఉరిమిన జడిసే నెచ్చెలి అడుగక ఇచ్చెను కౌగిలి" అంటూ అక్కినేని ఆలపిస్తే, "నీ హృదయములో ఒదిగినచో బెదురింక యేమున్నది" అని కాంచన గోముగా జవాబివ్వడం మంచి ప్రయోగం. విశ్వనాథ్ ఈ పాటను అద్భుతంగా మలిచారు.

తరవాత, ఆదుర్తి సుబ్బారావు సమర్పణలో బాబూ మూవీస్ వారు నిర్మించిన 'ఉండమ్మా బొట్టు పెడతా' (1968) సినిమాకు దర్శకత్వం వహించినప్పుడు విశ్వనాథ్ పాటలన్నీ దేవులపల్లి కృష్ణశాస్త్రి చేత రాయించారు. ఈ సినిమా సౌండ్ ట్రాక్‌ను ప్రత్యేక రికార్డుగా విడుదల చేయడం విశేషం. మహదేవన్ సంగీతం సమకూర్చిన "రావమ్మా మహాలక్ష్మి రావమ్మా ఈ కోవెల నీ ఇల్లు కొలువై వుందువుగాని, కొలువై వుందువుగాని కలుముల రాణి" పాట బాగా పాపులర్ అయింది. పూర్తి గ్రామీణ వాతావరణంలో ఈ పాటను అవుట్ డోర్‌లో చిత్రీకరించారు. ముత్యాలవంటి ముగ్గులు పెట్టడం వాటిమీద గొబ్బిళ్ళు పెట్టి పండగ వాతావరణం సృష్టించడం, గోవులకు పసుపు కుంకుమ పెట్టడం, గాదెల్లో ధాన్యం నింపడం వంటి గ్రామీణ అలవాట్లను కళ్ళకు కట్టినట్టు చూపారు. సుశీల ఆలపించిన "ఎందుకీ సందెగాలి, సందెగాలి తేలి మురళి... తొందర తొందరలాయే విందులు విందులు చేసే" పాటను జమున మీద ఇండోర్లో చిత్రీకరించారు. ఈ పాటలో దేవులపల్లి "ఏనాటిదోగాని ఆ రాధా పల్లవ పాణీ...ఏమాయెనోగాని ఆ పిల్లనగ్రోవిని విని, ఏదీ ఆ యమున హృదయగీతిక" అంటూ చరణాన్ని అద్భుతంగా మలిస్తే, విశ్వనాథ్ రాధాకృష్ణుల ప్రతిమ మీద ఫోకస్ చేసి అంతే అద్భుతంగా ఆ చరణాన్ని రంజింపజేశారు. పాట చివర్న కృష్ణ వచ్చి తన్మయత్వంతో వినడంతో చిత్రాన్ని మలుపు తిప్పుతుంది. "అడుగడుగున గుడి వుంది అందరిలో గుడి వుంది ఆ గుడిలో దీపముంది అదియే దైవం" పాటను జమున పిల్లలకు ప్రబోధిస్తుండగా స్టూడియోలో చిత్రీకరించారు. విశ్వనాథ్ పాటల చిత్రీకరణలో ఆదుర్తి సుబ్బారావు ప్రభావం వుందనేది నిజం.

నటుడు, నిర్మాత బాలయ్య సమర్పణలో నిర్మించిన 'చెల్లెలి కాపురం' (1971) కూడా పల్లె వాతావరణంలో నిర్మించిందే. ఇందులో రెండు అద్భుతమైన పాటలకు విశ్వనాథ్ తన ప్రతిభతో చిత్రీకరణ జరిపారు. మొదటిది బాలు, సుశీల పాడిన యుగళగీతం "కనులముందు నీవుంటే కవిత పొంగి పారదా తొలి చిగురుల చూడగానే కలకోకిల కూయదా" శోభన్ బాబు, వాణిశ్రీల మీద ఒక ఊహాగానపు పాటగా చిత్రీకరించారు. బృందావన గార్డెన్స్‌లో చిత్రీకరించిన ఈ పాట పూదోటల పరిమళాలతో నిండిన జలాశయాల

నేపథ్యంలో షూట్ చేశారు. రెండవ పాట బాలు ఆలపించిన "ఆడవే మయూరీ నటనమాడవే మయూరీ..నీ కులుకునుగని నా పలుకు విరియ... నీ నటననుగని నవ కవిత వెలయగా ఆడవే మయూరీ" అనేది. ఈ రెండు పాటల్ని రాసింది నారాయణరెడ్డి. పాటకు, నాట్యానికే మధ్య జరిగే పోటీ పాట ఇది. నారాయణరెడ్డి విజృంభించి సంస్కృత పదాలతో "ఫాలనేత్ర సంప్రభవత్ జ్వాలలు ప్రసవశరుని దహియించగా, పతిని కోలుపడి రతీదేవి దుఃఖితమదియై రోదించగా, హిమగిరీంద్ర శిఖరాగ్ర తాండవత్ ప్రమధగణము కనిపించగా..." అంటూ ఆలపిస్తూ వాణిశ్రీని ఓడించడం ఈ పాట నేపథ్యం. ఇది విశ్వనాథ్ చేసిన గొప్ప ప్రయోగం.

**వేటూరితో సాంగత్యం:** వేటూరి సుందరరామమూర్తి సినీ గేయ రచనా జీవితానికి ఓనమాలు దిద్దిన గురువు విశ్వనాథ్. 'సిరికాకొలను చిన్నది' అనే రేడియో సంగీత నాటిక ప్రభావంతో విశ్వనాథ వేటూరి చేత 'ఓ సీత కథ' చిత్రానికి మూడు పాటలు రాయించారు. 'సిరిసిరిమువ్వ' చిత్రంలో సూపర్ హిట్ పాట "ఝుమ్మంది నాదం సయ్యంది పాదం తనువూగింది ఈవేళా చెలరేగింది ఒక రాసలీల". మూగదైన హీరోయిన్ జయప్రదకు నాట్యమంటే చెప్పలేనంత ఇష్టం. ఇందులో సాంబయ్య (చంద్రమోహన్) డప్పు వాయించుకుంటూ కాలంగడిపే యువకుడు. వీరిమధ్య సంధానకర్త గుడి పూజారి(జె.వి. రమణమూర్తి). జయప్రదకు చంద్రమోహన్ కాలి అందెల జత కొని తీసుకొచ్చి, తొడిగించి ఆమెలోవున్న నాట్యకళకు మెరుగులు దిద్దుతాడు. అప్పుడు వచ్చే ఊహాజనిత పాటగా "ఝుమ్మంది నాదం" పాటను ఊటీలో చిత్రీకరించారు. "ఎదలోని సొదలా ఎలదేటి రొదలా కదిలేటి నదిలా కళల వరదలా" చరణం కోసం జలపాతాలవద్ద చిత్రీకరణ జరిపి హీరోయిన్‌లో నిద్రాణమై వున్న నాట్యకళ ఉరకలెత్తినట్లు చూపించారు. "సిరిసిరి మువ్వలు పులకించగా" అంటుండగానే చంద్రమోహన్ డప్పుతో ప్రత్యక్షమై పాటను అందుకోవడం మంచి ప్రయత్నంగా చెప్పుకోవాలి. "కైలాసమే వంగె నీకోసం" అంటున్నప్పుడు ఇంద్రధనస్సును చూపడం మంచి సింబాలిజం. "పలకమన్న పలకదీ పంచదార చిలక– నిదురించే పెదవిలో పదముంది పాడుకో" అంటున్నప్పుడు ఆమె మూగజీవి అని, ధైర్యంగా పెళ్లి వద్దని చెప్పలేని దుర్బరురాలు అని విశ్వనాథ్ ఎస్టాబ్లిష్ చేశారు ఈ సన్నివేశంలో. 1975లో డి.వి.ఎస్ రాజు నిర్మించిన 'జీవనజ్యోతి' చిత్రానికి దర్శకుడు విశ్వనాథ్. వాణిశ్రీ, శోభన్ బాబు ద్విపాత్రాభినయం చేసిన ఈ సినిమాలో హీరోకి ఇల్లొకచోట, ఇల్లాలు మానసిక ఆసుపత్రిలో. ఆ నేపథ్యంలో వచ్చే జోలపాట "ముద్దుల మాబాబు నిద్దరోతున్నాడు సద్దు చేశారంటే ఉలికులికి పడతాడు, గోపాలక్రిష్ణయ్య రేపల్లెకు వెలుగు, మా చిన్ని కన్నయ్య లోకానికే వెలుగు" సూపర్ హిట్టయింది. తదనంతర కాలంలో పదేళ్ళ తరవాత విశ్వనాథ్ దర్శకత్వం వహించిన 'స్వాతిముత్యం' (1985) సినిమాలో ఇలాంటిదే "వటపత్ర శాయికి వరహాల లాలి, రాజీవనేత్రునికి రతనాల లాలి, మురిపాల కృష్ణునికి ముత్యాల లాలి, జగమేలు స్వామికి పగడాల లాలి" పాటను విశ్వనాథ్ అందించారు. అయితే ఈ రెండు పాటల్ని నారాయణరెడ్డి రాయడం విశేషం. 1978 లో నిర్మాత మురారి యువచిత్ర బ్యానర్ మీద నిర్మించిన 'సీతామాలక్ష్మి' చిత్రంలో మహదేవన్ అందించిన సంగీతం అమృతంతో సమానం. అందులో దేవులపల్లి "మావిచిగురు తినగానే కోవిల పలికేనా కోవిలగొంతు వినగానే మావిచిగురు తొడిగేనా ఏమో ఏమవునోగాని ఆమని... ఈవని" అనే పాట రాశారు. ఈ పాటను చిత్తూరు దగ్గరవున్న కురబలకోట అనే వూరిలో చిత్రీకరించారు. ఈ పాట మధ్యలో ఓ విజిల్ వినపడుతుంది. పాట సందర్భాన్నిబట్టి రైల్వే స్టేషన్ మాస్టర్ వేసే విజిల్ అది. ఆ ఊహ విశ్వనాథ్‌దే. సినిమాలో కొండమీద క్లైమాక్స్, టూరింగ్ టాకీసు సన్నివేశాలతో సహా సింహభాగం ఇక్కడే చిత్రీకరణ జరిగింది. కొంత హార్సీ హిల్స్ వద్ద తీశారు. సినిమా 125 రోజులు ఆడింది. "సీతాలు సింగారం మా లచ్చి బంగారం" అనే పాట ఇంటర్వెల్ తరవాత వస్తుంది. ఈ పాట ఎందుకో మొదట విశ్వనాథ్‌కు నచ్చలేదు. అయితే చిత్రీకరణ గొప్పతనంతో సూపర్ హిట్టయింది.

**శంకరాభరణంతో విశ్వనాథ్ విశ్వరూపం:** భారతీయ సంస్కృతి మూలాల పట్ల కించిత్ వైకల్యం ఏర్పడుతున్న రోజులలో దానిని సరిదిద్దడానికి అమృతప్రాయమైన రీతిలో ఒక అద్భుతమైన కథని సృజించి అందులోని సజీవములైన పాత్రల ద్వారా భావితరాలకు స్ఫూర్తిదాయకంగా వుండేలా కళాతపస్వి కాశీనాధుని విశ్వనాథ్ తీర్చిదిద్దిన దృశ్యకావ్యం 'శంకరాభరణం'. అందులో ముఖ్య నేపథ్యం లలిత శాస్త్రీయ సంగీతం. అది శాంతిని ప్రసాదించే ఒక అమృతధార. వేటూరి సుందరరామమూర్తి ఋషిప్రజ్ఞతతో ఇందులో పాటలు సృష్టించారు. "అద్వైతసిద్ధికి అమరత్వ లబ్ధికి గానమే సోపానము" అంటూ ఉపాసనాసిద్ధి నేపథ్యాన్ని వివరించారు. ఈశ్వరుని మెడలో ఆభరణంగా భాసిల్లే వాసుకే 'శంకరాభరణం' అని పురాణం చెబుతోంది. అలాంటి వాసుకి పాత్రే 'శంకరం' అనే తులసి కుమారుడు. గతస్మృతులను గుర్తుచేసుకుంటుండగా

సినిమా ఊపందుకుంటుంది. "శంకర గళ నిగళము శ్రీహరి పదకమలము రాగరత్న మాలికా తరళము శంకరాభరణము" అంటూ ఆ శంకరం (తులసి) అనే కుర్రవాడి పాత్రను దృష్టిలో వుంచుకొని ప్రారంభగీతం "ఓంకారనాదానుసంధానమే శంకరాభరణము" అంటూ వేటూరి రాశారు. ఈ పాటను సినిమాకి మొదటి పాటగా జూలై 11, 1979 న విజయా గార్డెన్స్ రికార్డింగ్ థియేటర్‌లో రికార్డు చేశారు సంగీత దర్శకుడు మహదేవన్. శంకరశాస్త్రి (జె.వి. సోమయాజులు) గానసభకు తన తల్లితో హీరోయిన్ తులసి (మంజుభార్గవి) వెళ్తుంది. ఆమె తల్లి రత్నపాప (ఝాన్సి) వేశ్య. అటువంటి గంజాయివనం లాంటి వేశ్య కుటుంబంలో పుట్టిన తులసి మొక్క వంటిది హీరోయిన్. ఈ పాట సాగుతున్నంతసేపు ఆమె మనోనేత్రం శంకరశాస్త్రి ఆలపిస్తున్న సంగీతం మీద కేంద్రీకృతమై వుంటే, తన తల్లి రత్నపాప ధ్యాననేత్రం రామవరం జమీందారు వంటి ఖరీదైన విటుడెవరైనా ఆ సభకు వచ్చి తన కూతురి అందాన్ని చూసి పొందు కోరుకుంటాడేమోనని ఎదురుచూస్తూ వుంటుంది. విశ్వనాథ్ ఈ ఒక్క సన్నివేశంలో తులసి పవిత్రతను, సంగీతనాట్యాల మీద ఆమెకున్న మక్కువను సినిమా తొలిభాగంలోనే నిర్ధారించారు. పల్లవి పూర్తికాగానే తులసి 'ట్రాన్స్'లోకి వెళ్ళిపోతుంది. శంకరాభరణ రాగానికి అనుగుణంగా నాట్యం చేస్తుంది. ఆమె ఊహాలోకంలో విహరిస్తూ గానంతోబాటు నాట్యాన్ని ఊహించుకుంటూ విహరిస్తున్నది అనేందుకు సాక్ష్యంగా వేదికవద్ద ఆమె ఆసీనురాలై తాదాత్మ్యం పొందుతున్న ఛందాన్ని దర్శకుడు ప్రేక్షకుడికి గుర్తుచేస్తారు. ఈ పాట అనంతరం సినిమా మలుపు తిరుగుతుంది. నృత్యదర్శకుడు శేషు ఈ పాటకు అద్భుతంగా శాస్త్రీయ నృత్యరీతుల్ని కంపోజ్ చేయగా సినిమాటోగ్రాఫర్ బాలుమహేంద్ర అంతే అందంగా అవుట్ డోర్‌లో మంజు భార్గవి నృత్యరీతుల్ని సెల్యూలాయిడ్ మీదకు ఎక్కించారు. ఇందులో గోపాలం పాత్రలో సాక్షి రంగారావు చేత మృదంగ నాదాన్ని అతి సహజంగా చిత్రీకరించడం కూడా విశ్వనాథ్ ప్రతిభే అనాలి. ఇక బెంగుళూరులో కన్నడ సంఘం వారు శంకరశాస్త్రికి ఘనసన్మానం చేసిన సందర్భంగా శాస్త్రి గారు చేసే కచేరిలో వినవచ్చే "రాగం తానం పల్లవి నా మదిలోనే కదలాడి కడతేరమన్నవి" అనే పాటలో గంధర్వ కన్యలా నర్తిస్తున్న అనుభూతి పొందుతున్నట్లు మంజుభార్గవి విశ్వరూపాన్ని దర్శకుడు ఆవిష్కరించారు. హొళిబీడు నృత్యశిల్పసంపదను, కొవ్వూరు గోష్పాద క్షేత్రం వద్ద గల గోదావరి నదిని నేపథ్య వేదికగా చేసుకుని చిత్రీకరించిన ఈ పాట చిత్రానికి హైలైట్‌గా నిలిచింది. యుగాలు అంతరించిపోతున్నా సంగీతమనే జీవకళకు చావు, అంతం లేదనే సంకేతాన్ని దర్శకుడు ప్రతి ఫ్రేములో అద్భుతంగా ఆవిష్కరించారు. త్యాగరాజు లిఖించిన "దొరకునా ఇటువంటి సేవ నీపద రాజీవముల చేరు నిర్వాణ సోపానమధిరోహణము చేయు త్రోవ" తో మొదలుపెట్టి వేటూరి క్లైమాక్స్ గీతాన్ని "రాగాలనంతాలు నీ వేయిరూపాలు భవరోగ తిమిరాలు పోకార్చు దీపాలు" అంటూ చరణాలు పూర్తిచేసిన విధానం ప్రేక్షకుణ్ణి కంట తడిపెట్టించింది. రాజమండ్రి శ్రీరామలింగేశ్వరా కళ్యాణ మంటపంలో ఈ పాటను షూట్ చేశారు.




**విశ్వనాథ్ ప్రభంజనం:** వేటూరి రాకతో విశ్వనాథ్ సినిమా సంగీతంలోను, సాహిత్యంలోను, సన్నివేశ చిత్రీకరణలోను పెనుమార్పులు వచ్చాయి. ప్రాసక్రీడలాడడం వేటూరికి 'పెన్ను'తో పెట్టిన విద్య. స్వరపద సంధానం సాధించడానికి కావలసిన మెలకువలన్నీ వేటూరి వద్ద వున్నాయి. వీరిరువురికి తోడు మహదేవన్ వుండడం కలసొచ్చిన అంశం. 'సాగరసంగమం'(1983) లో వేటూరి రాసిన ''వేవేల గోపెమ్మల మువ్వగోపాలుడే మా ముద్దు గోవిందుడే" పాట చిత్రీకరణ ఒక అద్భుతం. ఈ పాటను విశాఖపట్నంలోని పార్క్ హోటల్ ప్రాంగణంలో తీశారు. నాట్యమంటే ఓనమాలు రాని ఒక డ్యాన్స్ డైరెక్టరు (మిశ్రో) ఈ పాటను ఆధునికంగా కంపోజ్ చేస్తే అసలు సిసలైన అభినయం ఈ పాటకే ఎలా వుండాలో కమలహాసన్ తెలియజెప్పే సన్నివేశానికి ముడిపడిన పాట ఇది. పూర్వార్థంలో భాగవత సారాంశాన్ని, ఉత్తరార్థంలో మహాభారత సారాంశాన్ని నిక్షేపించి ప్రేక్షకులను పరవశింప జేసిన పాట ఇది. గాయని ఎస్.పి. శైలజ చేత జయప్రద కూతురుగా నటింపజేసి ఆమెచేత తెరంగేట్రం చేయించి నూతనత్వాన్ని తెచ్చిన ఘనత

విశ్వనాథ్ దే. "మౌనమేలనోయి ఈ మరపురాని రేయి" పాటను కూడా విశాఖపట్నంలోనే చిత్రీకరించారు. ఈ సినిమాలో పాటల పాత్ర వాటి చిత్రీకరణ గొప్పతనం నభూతో నభవిష్యతి. తరవాత కమల్ నటించిన మరొక విశ్వనాథ్ చిత్రం 'స్వాతిముత్యం'(1985) నాలుగు నంది బహుమతుల తోబాటు ఫిలింఫేర్ బహుమతి కూడా అందుకుంది. రాజమండ్రి, తొర్రేడు, పట్టిసీమ, తాడికొండ వంటి కోస్తాప్రాంతాల్లో సినిమాతో బాటు పాటల చిత్రీకరణ జరిపారు. "సువ్వి సువ్వి సువ్వాలమ్మా", "రామా కనవేమిరా రఘురామ కనవేమిరా" పాటను పట్టెసీమలో చిత్రీకరించారు. ఈ రెండు పాటలకు సినిమా కథతో అవినాభావ సంబంధముంది. ఇక "వటపత్ర శాయికి" అనే జోలపాటగురించి ముందే చెప్పుకున్నాం. ఇళయరాజా ముందుగా ఇచ్చిన ట్యూనుకు కాకుండా విశ్వనాథ్, నారాయణరెడ్డి మరోవిధంగా పాటను సమకూర్చితే, అందుకు అనుగుణంగా ఇళయరాజా మట్లు కట్టడం ఈ పాట గొప్పతనం.




**సిరివెన్నెలతో సంగీత బంధం:** 1986లో విడుదలైన 'సిరివెన్నెల' చిత్రం ద్వారా సీతారామశాస్త్రి వెండితెరకు పరిచయమయ్యారు. అందులో శాస్త్రి రచించిన పాటలు సాహిత్యపరంగా గొప్పవిగా నిలిచాయి. తొలిపాటగా శాస్త్రి రాసిన "విధాత తలపున ప్రభవించినది అనాది జీవన వేదం, ప్రాణనాడులకు స్పందననొసగిన ఆది ప్రణవనాదం..." అంటూ మొదలై "విరించినై విరచించితిని ఈ కవనం విపంచినై వినిపించితిని ఈ గీతం"గా సాగే మోహనరాగపు ఈ పాటలో శాస్త్రి కఠినమైన సంస్కృతపదాలు పొదిగారు. "ప్రాగ్దిశ వీణియపైన దినకర మయూఖ తంత్రులపైన, జాగృత విహంగతతులే వినీల గగనపు వేదికపైన" వంటి వాక్యాలతో కూడుకున్న పాటను అంధుడైన గొప్ప వేణుగాన విద్వాంసుని మీద చిత్రీకరించిన పాట ఇది. విశ్వసృష్టికి మూలాధారమైన ఓంకారనాద ప్రాముఖ్యాన్ని అద్భుతంగా విశ్వనాథ్ ఈ పాట ద్వారా ఆవిష్కరించారు. తూర్పుదిక్కు అనే వీణకి సూర్యకిరణాలను తంత్రులుగా కూర్చి ఆకాశమనే రంగస్థలం మీద పక్షిగణం రెక్కలనే వ్రేళ్ళతో సృష్టిస్తున్న కిలకిలారావాలు నిద్రాణమై వున్న జగతిని మేలుకొలుపుతున్నాయనే భావనలో శాస్త్రి ఈ పాటను రాయడం జరిగింది. మహదేవన్ సంగీతం, హరిప్రసాద్ చౌరాసియా వేణునాదం, విశ్వనాథ్ చిత్రీకరణ ఈ పాటకు ప్రత్యేకత చేకూర్చింది. ఈ సినిమాలోనే "ఈగాలి ఈ నేల ఈ ఊరు సెలయేరు ననుగన్న నావాళ్లు, నాకళ్ళ లోగిళ్ళు", "ఆదిభిక్షువు వాడినేదికోరేది, బూడిదిచ్చే వాడినేది అడిగేది" అద్భుతాలు కాగా ఒక అంధురాలైన బాలికకు వెన్నెల్లో చందమామ ఎలావుంటుందో చూపడం విశ్వనాథ్ చేసిన ప్రయోగం. 1992 లో వచ్చిన 'స్వాతికిరణం' చిత్రంలో సిరివెన్నెల గీతం "తెలిమంచు కరిగింది తలుపు తీయనా ప్రభూ, ఇలగొంతు వణికింది పిలుపునీయనా ప్రభూ" ఒక తాత్విక గీతంగా భాసిల్లింది. ఇక 1987లో వచ్చిన 'శ్రుతిలయలు' చిత్రంలో "తెలవారదేమో స్వామీ నీ తలపుల మునకలో అలసిన దేవేరి అలవేలు మంగకు" అనేపాటను అన్నమాచార్యుల కీర్తనగా భ్రమించేలా సీతారామశాస్త్రి రాయడం ఒక ఎత్తైతే ఈ పాటకు పల్లవిని విశ్వనాథ్ సూచించడం మరో ఎత్తు. అందులో ఒక చరణంలో "కలల అలజడికి నిద్దుర కరవై అలసిన దేవేరి" అంటూ అభివ్యక్తీకరించడం శాస్త్రి భావుకతకు దర్పణం. 1988లో విడుదలైన 'స్వర్ణకమలం' చిత్రంలో పాటల్ని విశ్వనాథ్ కాశ్మీర్ లో చిత్రీకరించారు. ఉత్తమగీత రచయితగా సిరివెన్నెల సీతారామశాస్త్రి పది నందులు గెలుచుకోగా, 'స్వర్ణకమలం' లో ఆయన రాసిన "అందెల రవమిది పదములదా అంబరమంటిన హృదయముదా అమృతగానమిది పెదవులదా, అమితానందపు ఎదసడిదా" పాట ఆ బహుమతులు తెచ్చిపెట్టిన దానిలో ఒకటి కావడం విశేషం. ఈ చిత్రంలో విశ్వనాథ్ చూపిన కళాప్రతిభకు "కొత్తగా రెక్కలొచ్చెనా గూటిలోని గువ్వపిల్లకి", "ఘల్లు ఘల్లు ఘల్లు మంటూ మెరుపల్లె తుళ్లు", "శివపూజకు చివురించిన సిరిసిరిమువ్వ" పాటల చిత్రీకరణ కొలమానమే!

శివ సాన్నిధ్యం చేరుకున్న కాశీనాధుని విశ్వనాథుడు నిరంతరం మన మదిలోనే మెలుగుతుంటారనేది నిజం!

# సాహితీ తపస్వి 'మునిసుందరం'



**ప్రముఖ రచయిత, కథలు, కథానికలు, నవలలు, నాటకాలు విస్తృతంగా రాసిన శింగు మునిసుందరంగారి పరిచయ వ్యాసం.**

ఆ యువకుడి వైపు అలానే చూస్తూ ఉండిపోయారు గరికిపాటి రాజారావు. తనను చూడడానికి వచ్చిన ఆ విద్యార్థి కళ్ళలో కన్పిస్తున్న వినయం, నిలబడిన పద్ధతిలో ప్రకటితమయ్యే వినమ్రత, అభివాదం చేసే చేతుల్లో కన్పించే ఆదరం, వేసుకొన్న తెల్లని దుస్తుల్లో విన్పించే స్వచ్ఛతా రాగం ... ఇవన్నీ... చూస్తూ, ఆయన ఏదో తెలియని ఆత్మీయతా భావనకి లోనయిపోయారు.

గరికిపాటి రాజారావు తెలుగు నాటకానికి అదృష్టవశాత్తూ లభించిన వరప్రసాదుడు. పద్యరాగాల్ని ఆలపించడమే నాటకమని సర్వులూ భావిస్తున్న ఒకానొక కాలంలో జన్మించి, నాటకమంటే ఏమిటో తెలియజెప్పిన గొప్ప ప్రయోక్త రాజారావు. తెలుగు నాటకానికి నవ్యతను, నాణ్యతను ప్రసాదించి, నాటక ప్రదర్శనకు సవ్యదిశను, భవ్యదశను చూపిన దర్శకోత్తముడు రాజారావు. ముఖ్యంగా సాంఘిక నాటకానికి ఎనలేని గౌరవం కల్పించిన మహనీయుడు రాజారావు.

రాజమండ్రిలో విశ్రాంతి లేకుండా ఒకవైపు వైద్యవృత్తి చేస్తూనే, మరొకవైపు అనవతరం నాటక సేవ చేస్తూన్న గరికిపాటి రాజారావు అలా... ఆరోజు... తనని చూడడానికి వచ్చిన ఆ యువకుడ్ని చూసి, ఎంతగానో సంతోషించాడు. మనసారా ఆదరించాడు. తన పేరు మునిసుందరమని, రాయలసీమలో చిత్తూరు జిల్లాలోని పారకాల్వ గ్రామవాసిననీ, హిందీ పండిత శిక్షణ కోసం ఈ రాజమండ్రి వచ్చాననీ... ఆ యువకుడు తనని తాను పరిచయం చేసుకున్నాడు. అన్నింటికన్నా మిన్నగా తనకున్న రచనాసక్తి గురించి, నటనా ప్రవేశం గురించి చెప్పగానే నాటకమే ఊపిరిగా భావించే రాజారావు మనసు పరవశించింది. మునిసుందరాన్ని తన ఆత్మీయ సహచరుడ్ని చేసుకొన్నారాయన.

నాటక రచనలో మునిసుందరానికి తొలిపాఠం గరికిపాటి రాజారావు దగ్గరే ఆరంభమైంది. ఎప్పుడు కలసినా ఎంత తీరిక లేకపోయినా, మునిసుందరాన్ని ప్రేమతో ఆదరించేవారు రాజారావు. ఆయన ప్రేరణ మీదే "రాతిగుండె" అనే నాటికను రాజమండ్రిలోనే రచించి ఇచ్చారు మునిసుందరం. భవిష్యత్‌లో నీవొక గొప్ప రచయితవు అవుతావని దీవించారు రాజారావు. నిండు మనసుతో అందించిన ఆయన దీవెన కాలక్రమంలో అక్షరసత్యమయ్యింది. మునిసుందరం నాటకరచయితగా సుప్రసిద్ధులయ్యారు.

దివ్యక్షేత్రమైన తిరుపతి పేరు తలచుకోగానే భక్తిభావంతో హృదయం ఉప్పొంగిపోయి, కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీవేంకటేశ్వరుడు గుర్తొస్తాడు. స్వామి మన స్మృతి పథంలో మెదలుతూండగానే గోవింద రాజులు, అనంతరం పద్మావతీ దేవి ప్రత్యక్షమవుతారు. వారందరికీ భక్తితో మనస్సులో నమస్కరించి, ఆ దేవదేవుడి సృష్టిలోని మానవుల గురించి, అందునా కళాస్రష్టల గురించి, కవి రచయితల గురించి, మరీముఖ్యంగా నాటక రచయితల గురించి, ఆలోచించగానే తొలిగా గుర్తొచ్చే పేరు, సహృదయులైన మునిసుందరం మాస్టారిది. కవిగా, రచయితగానే కాదు, అంతకు మించి మానవీయత నిండిన ప్రేమైకమూర్తిగా ఆయనకు మనకు కన్పిస్తారు.

మన దేశంలో స్వరాజ్య సమరం ముమ్మరంగా సాగుతున్న కాలంలో మునిసుందరం జన్మించారు. 1937వ సంవత్సరం సెప్టెంబర్ 14వ తేదీ ఆయన జన్మదినం. ఇందులో తెలియకుండానే ఒక ప్రత్యేకత ఉంది. మునిసుందరం మాస్టారు వృత్తిరీత్యా హిందీ అధ్యాపకుడు. హిందీలో విద్వాన్ డిగ్రీ పొంది, ఎమ్.ఎ. చేసి, ముప్పై ఆరు సంవత్సరాలు హిందీ లెక్చరర్‌గా పనిచేసారు. అయితే ఆయన పుట్టిన రోజైన సెప్టెంబర్ 14వ తేదీయే మనదేశంలో హిందీని రాజభాషగా ఆమోదించిన రోజు. అందుకే దేశమంతా సెప్టెంబర్ 14వ తేదీన, హిందీ దినోత్సవ వేడుకల్ని వైభవంగా జరుపుకుంటారు. అలా ఒక హిందీ అధ్యాపకుడి పుట్టినరోజు, భారతదేశ హిందీ

భాషాదినోత్సవం ఒక్కనాడే జరగడం యాదృచ్ఛికమే కావచ్చు కానీ, నిస్సందేహంగా ఆనందించాల్సిన విషయం.

మునిసుందరం మాస్టారి జీవితంలో మరో విచిత్రముంది. ఆయన ప్రధానంగా హిందీ అధ్యాపకుడు. జీవితంలో సుదీర్ఘకాలం వృత్తిరీత్యా హిందీ భాషా బోధనా వ్యాసంగంలోనే గడిచింది. కానీ వారి సాహిత్య సృష్టిలో అత్యధిక శాతం తెలుగులోనే సాగింది. మహామహులందరి జీవితాలలోనూ ఈ వైచిత్రి కనబడుతూనే ఉంటుంది. మహాకవి గురజాడ అప్పారావు కూడా, విజయనగరంలో ఇంగ్లీషు పాఠాల్ని బోధించారు, కానీ తెలుగులోనే అజరామరమైన సాహితీ సంపదను అందించి, చిరస్మరణీయులయ్యారు.

తిరుపతి పట్టణానికి సమీపంలోని రామచంద్రాపురం మండలంలో, పారకాల్వ గ్రామంలో సంపన్న కుటుంబీకులైన లక్షుమమ్మ, నాదముని నాయుడు దంపతులకు జన్మించిన, మునిసుందరం బాల్యమంతా ఆ చిన్ని గ్రామంలోనే గడిచింది. భూస్వామ్యవ్యవస్థలో, అందునా గ్రామీణవ్యవస్థలో అంతస్థుల అడ్డుగోడలు ఎక్కువ. ఆత్మీయపు పలకరింపు కన్నా, అంతరాలను తెలిసి మసలడమే అవసరం. అనురాగపు దగ్గరితనం కన్నా, అధికారపు వినమ్రతకే గౌరవం. మునిసుందరం బాల్యానికి అదే వేదిక. అటువంటి వ్యవస్థలో నుండి, వెలుగుచూసిన భావుకుడైన ఆ పిల్లవాడి మనస్సు నిండా చెప్పలేనంత బాధ, చెప్పుకోలేనంత ఆవేదనా కన్పిస్తాయి. మునిసుందరం తొలినుండీ అంతరాలెరుగని వాడు. అధికారం కన్నా, ఆపేక్షకే పెద్దపీట వేసినవాడు. సహజసిద్ధంగా కళాకారుడికుండే ప్రేమానురాగాలు పుష్కలంగా ఉన్నవాడు. లోకాన్ని, లోకుల్ని మనసారా ప్రేమించినవాడు, నేటికీ ప్రేమిస్తున్నవాడు. అందుకే ఆ చిన్న నాటి రోజుల్లో ఆ పల్లెలో కన్పించిన కృత్రిమమైన వ్యవస్థమీద ఆయన ఇంత కాలం తన రచనల ద్వారా తిరుగుబాటు చేసి నిష్కల్మషమైన తన అంతరంగాన్ని నిర్భయంగా ఆవిష్కరించి చూపించాడు. దాదాపుగా మునిసుందరం రచనలన్నిటా ఈ ఆర్తి, ఆవేదన, వాటి సంఘర్షణ, తత్ఫలితంగా ఆవిర్భవించిన పరిష్కారాలు కన్పిస్తాయి. తన స్వేచ్ఛా ప్రవృత్తికి, స్వాతంత్ర పిపాసకు అనుగుణమైన ఇతివృత్తాలనెన్నుకొని తనదైన రచనా పాటవంతో రూపుదిద్ది గొప్ప కళాఖండాలుగా తీర్చిదిద్దారు. ఆయన సుప్రసిద్ధ రచన “ఏ వెలుగులకీ ప్రస్థానం” నాటికలో నాయకుడు సిద్ధార్థుడు. అతడే బోధివృక్షం క్రింద, ముక్తుడై బుద్ధుడవుతాడు. మునిసుందరం అంతరంగ ప్రయాణం ఇదే. హృదయక్షేత్రంలో రగిలిన ఈ భావాన్నే సిద్ధార్థుడి నోటివెంట సూటిగా విన్పిస్తాడాయన.

“పిచ్చివాడా! మీ రాజు రమ్యహర్మ్యాలలో వుంటున్నాడే, మృష్టాన్న భోజనాలారగిస్తున్నాడే, హంసతూలికా తల్పంపై శయనిస్తున్నాడే. మరి ప్రజలో...? వాళ్ళకీ సుఖాలు లభిస్తున్నాయా? లక్షలాది శ్రమజీవులు తమ సుఖాల్ని బలిపెట్టి ఏ ఒక్కడికో సౌఖ్యం కట్టబెట్టాలా? ఒక్కడికోసం ఇందరు దుఃఖాంబుధిలో మునగాలా? ఈ ప్రశ్న వేసింది సిద్ధార్థుడే కానీ, దాని వెనుక మునిసుందరం హృదయావిష్కరణ విస్పష్టంగా కన్పిస్తుంది. మునిసుందరం తిరుపతిలోని శ్రీవేంకటేశ్వరా ఓరియంటల్ కళాశాలలో హిందీ విద్వాన్ చదివి, 1956లో విశ్వవిద్యాలయంలోనే ప్రథమస్థానంలో నిలిచారు. ఆ తర్వాత రాజమండ్రిలోని బి.ఇడి. శిక్షణా కళాశాలలో పండిత శిక్షణ పొందడం, వెనువెంటనే కడపలోని ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో అసిస్టెంట్ లెక్చరర్‌గా ఉద్యోగ జీవితం ఆరంభించడం జరిగిపోయాయి. 36 సంవత్సరాలు హిందీ లెక్చరర్‌గా వేలాదిమందికి విద్యాబోధన చేసారు. ఆరునెలలు కాలం పాటు డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్‌గా పూర్తి అదనపు బాధ్యతను నిర్వహించారు. తిరుపతిలోని శ్రీవెంకటేశ్వరా విశ్వవిద్యాలయ బోర్డ్ ఆఫ్ స్టడీస్‌కి ఛైర్మన్‌గా తొమ్మిదేళ్ళ కాలం సహకారం అందించారు. 1968 నుండి 1971 వరకూ చిత్తూరు జిల్లా రచయితల సంఘానికి సారధ్యం వహించారు. 1992లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేత ఉత్తమ అధ్యాపకుడి అవార్డును 1989లో ఉత్తమ హిందీ అధ్యాపకుడిగా హిందీ అకాడమీ అవార్డును అందుకొన్న మంచి అధ్యాపకుడు మునిసుందరం మాస్టారు.

ఈ మునిసుందరం నాటక రచయిత కావడానికి ముందే, నటుడయ్యారు. వారి అన్న మేఘవర్ణం నాయుడు ప్రోత్సాహంతో కొన్ని నాటకాలలో మంచి పాత్రల్ని పోషించారు. ఆయన రంగస్థల ప్రవేశం “స్త్రీ” పాత్రతో జరిగింది. ఆ తరువాత పల్లెపడుచులో గోపి, పేదరైతులో కథానాయకుడిగా, అన్నాచెల్లెలులో సత్యం, దొంగవీరడులో రాంబ్రహ్మం, అమరత్యాగిలో గోవిందామాత్యుడు, నిరపరాధిలో ప్రతినాయకుడు, మనిషిమారలేదులో లక్ష్మీపతి, దేశం నీ సర్వస్వంలో హుమయూన్, ఇది కథ కాదులో సి.ఐ.డి. సుందరం వంటి ఎన్నో పాత్రల్లో నటించి, ప్రేక్షకుల ప్రశంసలందుకోవడం జరిగింది. అంతేకాక “అచ్చి” అనే స్త్రీ ఏకపాత్ర కూడా ప్రదర్శించారట. నటుడిగా ప్రారంభమైన రంగస్థలయాత్ర, కాలక్రమంలో ప్రసిద్ధ నాటకరచయితగా రూపొంది నలుగురిమెప్పును పొందింది.

వారి నాటకరచనల్ని నాలుగు విభాగాలుగా వర్గీకరించవచ్చు. మొదటివి

చారిత్రక పౌరాణిక రూపకాలు, రెండోవి సాంఘిక రూపకాలు మూడోవి లఘు రూపకాలు నాల్గోవి హాస్యరూపకాలు. మునిసుందరం మాస్టారి సాహితీ సృష్టి విస్తృతమైనది, బహుముఖీనమైనది. మాస్టారి గురించి చెప్పగానే తొలుత గుర్తొచ్చేవి ఆయన చారిత్రక పౌరాణిక నాటికలు. అందులో బహుప్రసిద్ధమైనది. "ఏ వెలుగులకీ ప్రస్థానం". రెండో నాటిక "వరూధినీ గాంధర్వం". అల్లసాని పెద్దనామాత్యుడి మనుచరిత్ర కథ నేపథ్యంగా వ్రాసిన అందమైన నాటిక ఇది. దేశభక్తి ప్రేరితమైన మరొక గొప్ప రచన" దేశం నీ సర్వస్వం" రాణా ప్రతాప్ కథాంశంతో సాగే ఈ నాటిక ప్రేక్షకుల్ని అడుగడుగునా ఉత్తేజపరుస్తుంది. చరిత్రలో అశోకుడి గురించి, జనానికి ఒక విధంగానే తెలిసుంటుంది. ఆ అశోకుడి కథలో మరొక కోణాన్ని ఎంతో గొప్పగా ఆవిష్కరించిన నాటిక "చరిత్రలో చినిగిన పుట". ఇందులో ఎన్నో ఆణిముత్యాల్లాంటి సంభాషణలు ఎడనెడ ప్రయోగించారు మాస్టారు. ఈనాటికలో ప్రధానపాత్ర తిష్యరక్షిత. ఆమె అశోకుడితో మాట్లాడుతూ జీవితాన్ని ఒక్క వాక్యంలో ఎంతో అందంగా విశ్లేషిస్తుంది. "జీవితం దేవుడు మానవుడికిచ్చిన గొప్ప వరం. మబ్బుల్లో మెరుపులా దానికి వయసు తక్కువ!"... ఎంత అందమైన భావం. ఎంత అద్భుతమైన ఉపమానం. మరొక చోట రాధాగుపుడనే మంత్రి నోట మాస్టారు పలికించిన సంభాషణలో ఒక అందం, ఒక లయ, అంతకు మించిన ఒక గొప్ప భావం ఒకచోట చేరి ఎంత అందంగా కన్పిస్తాయో చూడండి'' ఈ విశాల మౌర్య సామ్రాజ్యాన్ని ఆవరించిన శాంతి తెరలలో ఎంతో భయంకరమైన క్రాంతి పురుడు పోసుకొంటుందేమోనని నా భయం'' పద ప్రయోగంలో ఆయనకు ఆయనే సాటి. మునిసుందరం వ్రాసిన మరోనాటిక "మహాదాత". అందులో భారతకథలోని కర్ణుడి అంతిమ ఘడియల్ని, ఆ స్థితిలో కర్ణుడి దానశీలతని నాటక రూపంగా తెలుగువారికి అందించి, శెభాష్ అనిపించుకొన్నారు.

మునిసుందరం మాస్టారి పద్ధతి ఒకే వరవడిలో సాగిపోయే రచనా విధానం కాదు. అది భిన్న ప్రాతిపదికమీద కట్టుకొన్న సుందర సౌధం. అందుకే పౌరాణిక, చారిత్రక నాటికల రచనలో, ఆయన ప్రయోగించిన కరుణ రసం, సాంఘికాల కొచ్చేసరికి హాస్యరసానికి ఆలంబనం అయ్యింది. అయితే సంభాషణల సూటిదనం మాత్రం ఎక్కడైనా ఒక్కటే. అదే ఆయన ప్రత్యేకత. వారి పేరొందిన సాంఘిక నాటిక "అహం బ్రహ్మ అనే జనతా క్లబ్". ఇది ప్రతీకాత్మక ధోరణి (సింబాలిక్ స్టైల్)ని, అనుసరించే నాటిక. మేధావులు నిర్లిప్తతతో వ్యవహరిస్తే దేశానికి అరిష్టం అంటూ, ప్రబోధించిన ఈ నాటిక, 1977లో వెలువడినా, నేటికాలానికి గొప్ప సందేశం అందిస్తోంది. మాస్టారి మరోనాటిక " ఇది కథకాదు ". ఆర్థిక అసమానతల అడ్డుగోడల మధ్య నలిగిపోయిన ప్రేమ, ఈ నాటికకు ఊపిరి. నాటికనిండా, గొప్ప సస్పెన్స్ కన్పిస్తుంది. ప్రేక్షకులలో అంతు తెలియని ఉత్కంఠ కన్పిస్తూ, నాటికను ఆద్యంతం గొప్పగా నడిపిస్తుంది.

1976 జూలైలో ఆకాశవాణి, విజయవాడ నుండి ప్రసారం చేయబడి, మునిసుందరం మాస్టారికి గొప్ప గౌరవం



తెచ్చిన నాటిక "సింగారం" బ్రతుకు తెరువుకోసం కష్టపడి బ్రతికే స్త్రీని, ప్రపంచం ఎన్ని విధాలుగా వేధిస్తుందో, ఈ నాటికలో ఎంతో హృద్యంగా చూపించాడు రచయిత. నిజంగా ఇది గొప్ప నాటిక. మునిసుందరం మాస్టారి సంభాషణా చాతుర్యానికి ప్రతీకగా నిలబడే మరో సాంఘిక నాటిక "ఇదో రకం ప్రేమకథ".

ఈ నాటికలో ఎన్నో సంభాషణలు... ఎంతో అందంగా... ఎంతో బలంగా... అడుగడుగునా కన్పిస్తాయి.

"ప్రేమకు స్వార్థం తోడయితే ప్రేమ బలహీనతగా మారుతుంది", మనం రైలు ఎక్కగలమే కానీ, దాన్ని సమయానికి గమ్యం చేర్చలేం కదా", "తెలుగువాడు కదండీ... ఎదుటివాడు ఏడుస్తుంటే చూడలేడు".

మాస్టారి నాటికా రచనల్లో "నిజం కాటేసింది" ఓ మంచి నాటిక. హిందీ రచయిత వినోద్ రస్తోగి వ్రాసిన నాటికకు అనువాదం " శిథిలాలు " నాటిక. వారి మరో రచన "భయం" మొత్తం ఇరవై ఒక్క నాటికలు, నాటకాలు అందించి, తెలుగునాటకాన్ని సంపన్నవంతం చేసిన మహనీయులు మునిరత్నం. భయం నాటికతో ఆయన రచనా ప్రస్థానం ఆరంభమై, ఏ వెలుగులకీ ప్రస్థానంతో మహాభినిష్కమణ చేసింది. ఆయన రచించిన చివరి నాటిక "ఏ వెలుగులకీ ప్రస్థానం" అదీ 1983లో.

నాటకమే కాదు, కవిత్వం కూడా ఆయన అభిమాన విషయమే. "వెన్నెల ముళ్లు" అనే ఆయన కవితా సంకలనం, మాస్టారి హృదయాన్ని ఎంతో గొప్పగా ఆవిష్కరిస్తుంది. వెన్నెలలోని ఆర్ద్రతని, ప్రేమలోని సౌకుమార్యాన్ని, మానవతలోని మృదుత్వాన్ని అక్షరరూపంగా మార్చి తన కవితలలో చూపించారు మునిసుందరం. వెన్నెలముళ్ళులో ఓ వైపు గొప్ప ప్రణయభావన కన్పిస్తుంది. మరోవైపు అంతర్లీనంగా ఎంతో తాత్త్వికత కన్పిస్తుంది. ఈ కవితలన్నిటా వైచిత్రి, వైవిధ్యం మనోజ్ఞంగా దర్శనమిస్తాయి. ఓ కవితలో జీవితం గురించి కవి ఇలా అంటాడు.

జీవితం అగ్గిపువ్వు ఎద ఎదలో అగ్గి పువ్వులు పూయించిన వాడే జీవించినట్టు లెక్క.. మునిసుందరం మంచి కథారచయిత కూడా! ఆణిముత్యాలనదగిన పదిహేను కథల్ని అందించారాయన. తన కథల్లో, ఓ పన్నెండు కథల్ని ఎంచుకొని, "జవాబు తెలియని వాడు" అనే పేరుతో ఓ కథా సంకలనాన్ని ప్రచురించారు. ఇందులో దాదాపుగా అన్నికథలూ, మానవజీవితాన్ని ఎంతో హృద్యంగా ప్రతిబింబిస్తాయి. మానవుల ఆర్థిక, సామాజిక జీవనాన్ని నేపథ్యంగా తీసుకొని, రూపుదిద్దిన ఈ కథలలో ఎంతో వైవిధ్యం కన్పిస్తుంది.

మాస్టారి మరో ప్రయోగం " లఘురూపకాలు" తక్కువ సమయంలో, కొద్ది శ్రమతో, కొద్ది మంది పాత్రధారులతో ప్రదర్శించేవి లఘురూపకాలు. ఇటువంటి రచనా విధానంలో వీరి ప్రత్యేకత వీరిదే. చిత్తూరు ఆర్ట్ లవర్స్ సారధి, ప్రముఖనటుడు, దర్శకుడు కీ.శే. వి. జయరాం కోరికమీద వ్రాసి ఇచ్చిన రూపకాలివి.

ఈ రూపకాలన్నింటా ఓ వైపు క్లుప్తత, మరోవైపు సూటిదనం, ఇంకో వైపు సంభాషణా చతురత విస్పష్టంగా కన్పిస్తాయి. ఈ రూపకాలు కూడా గమ్మత్తుగా ప్రారంభం అవుతాయి. అప్పటి వరకూ ఏదో జరిగిపోయినట్లు, అప్పుడే ఆ సన్నివేశంలో ఆ సంభాషణ ఆరంభమవుతుంది. ఇదొక విలక్షణమైన పద్ధతి. వీరి అన్ని లఘురూపకాలూ సంఘర్షణా ప్రధానాలు. సంభాషణా విలసితాలు.

ఇంత విస్తృతమైన సాహిత్యాన్ని సృష్టించిన మునిసుందరం మాస్టారు శ్రీవేంకటేశ్వరుడిపై ఎన్నో మధురమైన గీతాల్ని కూడా రచించారు. ఆ గీతాలన్నీ ప్రఖ్యాత గాయని డా. శోభారాజు స్వరపరచి, గానం చేసి, ఒక సి.డి. రూపంలో అందించారు. అదే "కోనేటిరాయ". స్వామివారికి అక్షరాలతో పదార్చన చేసే అదృష్టం అందుకొన్న మాస్టారు నిజంగా ధన్యులు.

ఇలా మునిసుందరం మాస్టారి సాహితీ ప్రయాణం బహుముఖీనమైన ఆధ్యాయం. నాటకం, రూపకం, కథ, నవల, వచనకవిత, మినీకవిత, త్రిపద, లలితగీతం, చరిత్ర, వ్యాసం, ప్రసంగం... నిజంగా అదొక విస్తారమైన సాహితీ సృజన. విస్తృతమైన సాహితీ ప్రయాణం. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో, మద్రాస్ విశ్వవిద్యాలయంలో మునిసుందరం మాస్టారి రచనలపై జరిగిన పరిశోధనలకు ఒక పి. హెచ్ డి., రెండు ఎమ్. ఫిల్ డిగ్రీలు అందుకొన్నారు సాహితీ పరిశోధకులు. "మునిసుందరం-మానవతా వాదం" అన్న అంశంపై మరొక పరిశోధన సాగుతోంది కూడా!

ఇలా... ఇంత ఇష్టంగా.. ఇంత హృదయపూర్వకంగా... ఇంత సత్యైక దృష్టితో... ఇంతటి సమన్వయ శక్తితో ఈనాటికీ సాహితీ ప్రయాణాన్ని సాగిస్తున్న మునిసుందరం మాస్టార్ని గతంలో ఎన్నో పురస్కారాలు వరించాయి. ఆనాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, నటసార్వభౌముడు అయిన శ్రీ నందమూరి తారక రామారావు స్వయంగా ఉగాది పురస్కారంతో మాస్టార్ని సత్కరించారు. అంతటి గౌరవం పొందిన మాస్టారికి ఈనాడు ఒక కొత్త పురస్కారం లభించింది. హైదరాబాదులోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ నాటకరచయితగా గౌరవిస్తూ, 2010వ సంవత్సరానికి, నాటక రచనా పురస్కారాన్ని వారి సాంఘిక నాటకాలకు ప్రకటించింది. ఇది నిస్సందేహంగా బంగారానికి సువాసన అబ్బినట్లే.

మునిసుందరం గారు మధుమేహంతో బాధపడుతూ తిరుపతి కోటకొమ్మల వీధిలోని తన స్వగృహంలో ఫిబ్రవరి 13, 2015 శుక్రవారం ఉదయం తుదిశ్వాస విడిచారు.

-వాడ్రేవు సుందరరావు

(ఈ వ్యాసం వారి మరణానికి ముందు రాయబడింది.)

# అంతర్జాలంలో - తెలుగు పత్రికలు

**ప్రపంచంలో అతివేగంగా విస్తరిస్తున్న రంగం ఏదైనా ఉంది అంటే అది సాంకేతిక రంగం అని చెప్పచ్చు. గ్రామీణ స్థాయి నుంచి మొదలుకుని దేశంలో ఏమూలన ఉన్న విషయాన్నైనా అరక్షణంలో తెలుసుకునేంత వీలుగా అంతర్జాలం అల్లుకు పోయింది. ఒకప్పుడు పుస్తకాల్లో, పత్రికల్లో చదువుకునే సాహిత్యాన్ని కూడా నేడు సోషల్ మీడియా వేదికగా చదువుకుంటున్నాం. ప్రస్తుతం స్మార్ట్ ఫోన్ ఉంటేచాలు.. ప్రపంచాన్ని చుట్టేసి రావచ్చు. ప్రస్తుత పరిస్థితుల్లో ఇంటర్నెట్ వాడనివారు ఉండరంటే అతిశయోక్తి కాదు. చిన్న పిల్లల నుంచి మొదలుకొని వృద్ధుల వరకు నేడు నెట్‌ను వినియోగిస్తున్నారు.**

నేడు సోషల్ మీడియాలో తెలుగు సాహిత్యం విరివిగా చదువుకుంటున్నాం అంటే... అందుకు కారణం యూనికోడ్ ఫాంట్స్ అందుబాటులోకి రావడమే. కంప్యూటర్‌కు సంబంధించిన 'లిపి ప్రామాణికత'ను యూనికోడ్ అంటారు. కొన్ని నిర్దేశిత సంకేతాలు ఆధారంగా ప్రపంచ భాషలన్నింటిలోనూ అక్షరాలు కంప్యూటర్ తెరపైకి వస్తాయి. ఈ యూనికోడ్ ఫాంట్స్ 2006 సం॥లో కేంద్ర ప్రభుత్వం తెలుగు సాఫ్ట్‌వేర్ ఉపకరణాల సి.డి. విడుదల చేయడం ద్వారా వాడకంలోకి వచ్చాయి. ఆ తర్వాత 2011 సం॥ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పూనికతో 18 రకాల తెలుగు ఉచిత ఫాంట్లు అందుబాటులోకి వచ్చాకే కంప్యూటర్లలో యూనికోడ్ ఫాంట్ల వాడకం ఊపందుకుంది అని చెప్పవచ్చు.



రెండు దశాబ్ధాల క్రితం వరకూ విజ్ఞానానికి, వినోదానికే కాకుండా కాలక్షేపానికీ కూడా పుస్తకాలు, పత్రికలదే హవా. ఆ తర్వాత సినిమాలు... ఎలక్ట్రానిక్ మీడియా వచ్చాక వాటి స్థానాన్ని టీవీలు, కంప్యూటర్లు ఆక్రమించాయి. శాస్త్రసాంకేతిక రంగాల్లో వచ్చిన విప్లవం వల్ల అరచేతిలో ఇమిడిపోయే స్మార్ట్ ఫోన్ ఆవిష్కరణతో డిజిటల్ మీడియా ఊపందుకుంది. నేడు విజ్ఞానమైనా, వినోదమైనా, చదువైనా అంతా స్మార్ట్ ఫోన్‌లోనే. కోవిడ్-19 తర్వాత ఇది మరింత విస్తృతమయ్యింది.

అంతర్జాలంలో తెలుగు పత్రికలు 2001 సం॥ ప్రాంతంలో ప్రారంభమైనప్పటికీ 2015 నుండి ఆదరణ పెరుగుతూ వస్తుంది.

**తెలుగువన్.కామ్** (Teluguone.com) : తెలుగు వెబ్ పత్రికలకు నాంది పలికింది తెలుగువన్.కామ్. కంఠంనేని రవిశంకర్ సారధ్యంలో కామెడీ రచయిత, కార్టూనిస్ట్ మల్లిక్ సంపాదకీయంలో 2001 సం॥లో ప్రవాసాంధ్రుల కోసం ప్రారంభించబడింది. ఇందులో సాహిత్యం, వినోదం, కార్టూన్లు, జోక్స్ ఉంటాయి. ప్రస్తుతం షార్ట్ ఫిలింలు కూడా అందుబాటులో వున్నాయి. తొలుత ఈ వెబ్ పత్రికలో కొన్ని ఫీచర్స్ చందాదారులకు మాత్రమే అందుబాటులో ఉండేవి.

**ఈమాట. కామ్** (Eemaata.com): సాహిత్య మంటే అభిరుచి ఉన్నవారు, ప్రవాసంలో ఉన్న తెలుగు వారి కోసం ఒక సాహిత్య పత్రికను తీర్చిదిద్దాలన్న ధ్యేయంగా 1998 సం॥లో స్థాపించబడ్డ పత్రిక ఈమాట. కామ్. ఇందులో కథలు, కవితలు, పద్య సాహిత్యం, వ్యాసాలు, సమీక్షలు, ముఖాముఖీలు, శబ్దతరంగాలు, స్వగతం లాంటి అనేక శీర్షికలు ఉన్నాయి. నెల-నెలా వెలువడే ఈమాట పత్రికను కొలిబాల సురేష్ బృందం నిర్వహిస్తుంది. రెండు దశాబ్ధాలకు పైగా పాఠకులను అలరిస్తున్న ఈ అంతర్జాల పత్రికకు తెలుగులో లబ్ధప్రతిష్టులైన రచయితలందరూ రచనలు చేస్తున్నారు.

**సిలికానాంధ్ర సృజనరంజని** (Srujanaranjani. siliconandhra.org) : కిరణ్ ప్రభ గారి నేతృత్వంలో మార్చి 2004 సం॥లో ప్రారంభించిన సిలికానాంధ్ర సృజనరంజని అంతర్జాతీయ సాహితీ పొదరిల్లులో కథాభారతి, కవితా స్రవంతి, పద్యం-హృద్యం, ధారావాహికలు, మనబడి వంటి అనేక శీర్షికలున్నాయి. టి. మృత్యుంజయుడు ప్రధాన సంపాదకుడిగా వెలువడిన ఈ పత్రిక గత కొంతకాలంగా

కొత్త సంచికలను ప్రచురించడంలేదు.

**కౌముది.నెట్** (Koumudi.net) : సాహితీవేత్త, ప్రవాసాంధ్రుడు కిరణ్ ప్రభ సంపాదకత్వంలో 2007 సం॥ జనవరిలో ప్రారంభించబడ్డ కౌముది.నెట్ మాసపత్రికలో నెల-నెలా కథలు, కవితా కౌముది, ధారావాహిక నవలలు, ప్రముఖుల వ్యాసాలు, ఆత్మకథలు, పుస్తక సమీక్షలు, కార్టూన్లు, సినీ కౌముది, హాస్యకౌముది ఉంటాయి. ఇందులో మల్లాది, యండమూరి, గొల్లపూడి మారుతీరావు లాంటి లబ్ధప్రతిష్ఠులైన రచయితల రచనలు చదువుకోవచ్చు. ప్రారంభం నుండి పాత సంచికలు వెబ్‌సైట్‌లో అందుబాటులో వున్నాయి. ఈ పత్రికకు సహ సంపాదకురాలిగా కాంతి కిరణ్ ఉన్నారు. పి.డి.ఎఫ్. ఫార్మేట్‌లో తెస్తున్న ఈ పత్రికను యూనీకోడ్‌లోకి మారిస్తే మరింత ప్రయోజనకరంగా వుంటుంది.

**64కళలు.కామ్** (64kalalu.com): సకల కళల సమాహారం: చిత్రకారుడు, రచయిత కళాసాగర్ యల్లపు వ్యవస్థాపక సంపాదకుడిగా 2010 సం॥లో మాస పత్రికగా ప్రారంభించబడి, ప్రస్తుతం వారపత్రికగా వెలువడుతుంది. కళల కోసం, కళాకారుల కోసం వెలువడిన తొలి తెలుగు వెబ్ పత్రిక 64కళలు.కామ్. తెలుగు సంస్కృతి కళావైభవాన్ని విశ్వవ్యాప్తం చేయడానికి కృషిచేస్తున్న ఈ పత్రిక పుష్కరకాలం పూర్తిచేసుకుంది. వెంటపల్లి సత్యనారాయణ, సుంకర చలపతిరావు, మాకినీడి సూర్యభాస్కర్, బి.ఏ. రెడ్డి, ఎల్.ఆర్. వెంకట రమణలు చిత్రకళ గురించి, డా॥ జయదేవ్, బాలిలు కార్టూన్ గురించి, వాడ్రేవు సుందరరావు, మన్నె శ్రీనివాసరావు, అడవి శంకరరావులు నాటకరంగం గురించి, ఆచారం షణ్ముఖాచారి సినిమాల గురించి, ఇంకా బి.యం.పి. సింగ్, బ్నిం, పింగళి భాగ్యలక్ష్మి, ఆత్మకూరి రామకృష్ణ తదితరులు రాస్తున్న శీర్షికలతో, కళ-సాహిత్య సంబంధిత సమాచారంతో వారం-వారం అలరిస్తుంది.

**అచ్చంగా తెలుగు** (AchamgaTelugu.com): అంతర్జాల మాసపత్రిక: రచయిత్రి భావరాజు పద్మిని సంపాదకత్వంలో 2012 నుండి వెలువడుతున్న మాసపత్రిక అచ్చంగా తెలుగు. ఇందులో ధారావాహికలు, కథలు, కళావేదిక, ముఖాముఖీలతో పాటు ఇంకా అనేక శీర్షికలున్నాయి.

**సారంగ** - సాహిత్య పక్షపత్రిక (Magazine. saarangabooks.com) : సారంగ మొదట సాహిత్య వారపత్రికగా 2013 సం॥లో ప్రారంభించారు. 2018 నుండి సాహిత్య పక్షపత్రికగా వెలువడుతుంది. ఇందులో కథలు, కవితలు, కాలమ్స్ ఉంటాయి. ప్రముఖ కవి, ప్రవాసాంధ్రుడు అఫ్సర్ దీనికి సారథ్యం వహిస్తున్నారు.

**గోతెలుగు.కామ్** (Gotelugu.com): సాహితీ ప్రియుడు, కార్టూనిస్ట్ పొలిచర్ల శ్రీనివాస్(బన్ను) నిర్వహణలో 2015 సం॥లో ప్రారంభించబడ్డ గోతెలుగు.కామ్ మాస పత్రికలో కథలు, కవితలు, నవలలు, వ్యాసాలు, సమీక్షలు, కార్టూన్లతో పాటు వీడియోలు లభిస్తాయి. పాత సంచికలు కూడా అందుబాటులో ఉంటాయి.

**నెచ్చెలి.కామ్** (Neccheli.com) అంతర్జాల వనితా మాసపత్రిక: అమెరికా సంయుక్త రాష్ట్రాల నుండి వెలువడుతున్న తొలి తెలుగు అంతర్జాల వనితా మాసపత్రికను ప్రముఖ కవయిత్రి డా. కె.గీత సంపాదకురాలిగా 2019 సం॥లో ప్రారంభించారు. ఈ పత్రిక అంతర్జాతీయ స్థాయిలో స్త్రీలకు సంబంధించిన సాహిత్యం, సంగీతం, కవితలు, కథలు, సమీక్షలు, ఇంటర్వ్యూలు, పరిశోధనలు మొదలగు అనేక అంశాలను పరిచయం చేస్తుంది.

**విహంగ** (Vihanga.com) మహిళా సాహిత్య పత్రిక: తొలి తెలుగు మహిళా వెబ్ పత్రికగా 2011 సం॥ నుండి మానస ఎండ్లూరి, డా. అరసిశ్రీ నేతృత్వంలో వెలువడుతుంది. పత్రిక వ్యవస్థాపకులు పట్ల హేమలత. ఇందులో కథలు, కవితలు, ధారా వాహికలు, వ్యాసాలు, కాలమ్స్, ముఖాముఖీలు, సాహిత్య సమావేశాలు లాంటి శీర్షికలుంటాయి.

**సహరి సమగ్ర వారపత్రిక** (Sahari.in): 2020 సం॥లో ప్రారంభమైన సహరి సమగ్ర వారపత్రిక యువతకోసం, వెన్నెల కోసం, ఆధ్యాత్మికం, కథలు, సీరియల్స్ అందిస్తుంది. గొర్తి శ్రీనివాసరావు, పసుపులేటి సత్య శ్రీనివాస్‌గార్ల సారథ్యంలో నడుస్తుందీపత్రిక.

**మాలిక.ఆర్గ్** (Maalika.org) సాహిత్య మాస పత్రిక: రచయిత్రి, పబ్లిషర్ జ్యోతి వలబోజు ప్రదాన సంపాదకురాలిగా ఆవిష్కరించిన మాలిక సాహిత్య మాసపత్రికలో కథలు, యాత్రామాలిక, ధారావాహికలు, వ్యాసాలు, కవితలు, కార్టూన్స్ ఉంటాయి.

**నిత్య ఇ-మాసపత్రిక** (Nithyamonthly.com): పాఠకులకు నాణ్యమైన మంచి రచనలు అందించే లక్ష్యంతో 2020 సం॥లో ప్రారంభించిన పత్రిక నిత్య ఇ-మాసపత్రిక. కథలు, కవితలు ప్రత్యేక శీర్షికలతో పాటు ప్రతీ నెలా ఒక పూర్తి నవలను అందించడం నిత్య ప్రత్యేకత. ప్రముఖ

రచయిత, జర్నలిస్ట్ బెందాళం కృష్ణారావు నిత్య పత్రిక రూపకల్పనలో కీలకపాత్ర పోషిస్తున్నారు. డా॥ ఈమని శివనాగిరెడ్డి, నాగసూరి వేణుగోపాల్, దీర్ఘాసి విజయభాస్కర్, బి.యస్. రాములు తదితరుల రచనలు నిత్య పత్రికలో చదువుకోవచ్చు.

**మధురవాణి.కామ్** (Madhuravani.com): 2016 సం॥లో ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తెలుగు సాహిత్యాభిమానులకు ఒక చిరుకానుకగా మధురవాణి.కామ్ పత్రికను శ్రీనివాస్ పెండ్యాల నిర్వహిస్తున్నారు. ఈ పత్రికలో కథలు, కవితలు, వ్యాసాలు, ఆధ్యాత్మికం, సాహితీ సౌరభాలు, పుస్తక పరిచయాలు, అలనాటి మధురాలు, వ్యంగ్య రచనలు ఉంటాయి. ఈ అంతర్జాల పత్రిక 'మధురవాణి' ఏడాదికి నాలుగు సార్లు జనవరి, ఏప్రియల్, జూలై, అక్టోబర్ నెలల్లో వెలువడుతుంది. ఈ పత్రిక ప్రత్యేకత ఏమిటంటే తెలుగు-ఇంగ్లీషు భాషల్లో చదువుకోవచ్చు.

**మయూఖ** (Mayuukha themagazine.com) : సాహిత్యం పంచే విజ్ఞాన వెలుగుల కిరణాలు పాఠకులకు చేర్చే లక్ష్యంతో ప్రారంభించబడిన మయూఖ ద్వైమాసిక అంతర్జాల సాహిత్య పత్రికలో కథలు, కవితలు, ధారావాహికలు, వ్యాసాలు, బాలసాహిత్యం, ఇంటర్వ్యూలు, పుస్తక సమీక్షలతో పాటు అనువాద సాహిత్యం లభిస్తుంది. నేటి యువ రచయితలకు ఉపయోగపడే సాహిత్య విమర్శ వ్యాసాలను కూడా ప్రచురిస్తుంది. ఈ పత్రికకు సంపాదకురాలిగా డా॥ కొండపల్లి నీహారిణి వ్యవహరిస్తున్నారు. సలహా మండలిలో డా॥ కె.వి. రమణాచారి, కొండపల్లి వేణుగోపాలరావులున్నారు.

**పొద్దు అంతర్జాల పత్రిక** (Poddu.net): వ్యక్తుల ప్రతిభా వేదికే పొద్దు అంతర్జాల పత్రికగా 2011 సం॥లో అవతరించింది. తుమ్మల శిరీష్ కుమార్ మరో నలుగురు కలిసి ఉమ్మడిగా సారథ్యం వహిస్తున్న పొద్దులో వారం-వారం కథలు, కవితలు, సమీక్షలు, కబుర్లతో పాటు ఎన్నో శీర్షికలున్నాయి. ఆలోచనలున్న ప్రతీవారూ రాయాలని, ఇతరుల ఆలోచనలు ఏమిటో తెలుసు కోవటానికి చదవాలన్న నినాదంతో ఈ పత్రిక నడుస్తుంది.

**సంచిక తెలుగు సాహిత్య వేదిక** (Sanchika.com): 2018 సం॥లో ప్రారంభమైన సంచిక తెలుగు సాహిత్య వేదిక కథలు, కవితలు, ధారావాహికలు, వ్యాసాలు, సినిమాలు, పుస్తకాల సమీక్షలు ప్రచురిస్తుంది.

**తానా పత్రిక** (Tana.org) : తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా ఆధ్వర్యంలో సాయి బ్రహ్మానందం గొర్తి సంపాదకుడిగా, నవీన్ వాసిరెడ్డి సహ సంపాదకుడిగా కృషిచేస్తున్న తానా మాసపత్రిక లో సమకాలీన సాహిత్య, సాంస్కృతిక, సామాజిక అంశాలతో పాటు కథలు, ప్రత్యేక కథనాలు, తానా ఫౌండేషన్ నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాల గురించి ప్రచురిస్తారు.

**తెలుగుతల్లి కెనడా పత్రిక** (Telugutalli.ca) : కెనడాలో వున్న ప్రవాసాంధ్రులు 2017 సం॥లో ప్రారంభించిన మాసపత్రిక తెలుగుతల్లి. ఇందులో కథలు, కవితలు, అనువాద కథలు, కాలమ్స్, సంగీత సాగరి, బాలలవనం, హలో డాక్టర్ లాంటి శీర్షికలున్నాయి. ఈ పత్రికకు లక్ష్మి రాయవరపు సారథ్యం వహిస్తున్నారు.

**హాస్యానందం.కామ్** (Hasyanandam.com) : గత రెండు దశాబ్దాలుగా ప్రింట్ పత్రికగా పాఠకులను అలరిస్తున్న హాస్యానందం మాసపత్రిక 2021 నుండి హాస్యానందం.కామ్ వెబ్ పత్రికగా కూడా వస్తుంది. రాము సంపాదకుడిగా వెలువడుతున్న ఈ పత్రికలో కార్టూన్లతో కథలు, శీర్షికలు అన్నీ హాస్యప్రదానంగా ఉంటాయి.

**సినీవాలి.కామ్** (Cineevaali.com) : ప్రముఖ రచయిత ప్రభాకర్ జైనీ చీఫ్ ఎడిటర్గా 2021సం॥లో వారపత్రికగా ప్రారంభమై, ప్రస్తుతం మాసపత్రికగా మార్పుచెందింది. ఈ పత్రికలో నాలుగు ధారావాహికలతో పాటు కొన్ని కథలు ఉంటాయి.

**తెలుగు జ్యోతి** (tfasnj.org) : తెలుగు ఫైన్ ఆర్ట్స్ సొసైటీ, తెలుగు కళా సమితి ఆధ్వర్యంలో ఊటుకూరి విజ్ఞానకుమార్ సంపాదకత్వంలో కథలు, వ్యాసాలు, మరికొన్ని శీర్షికలతో 2009 సం॥ నుండి వెలువడుతున్న ద్వైమాసిక వెబ్ పత్రిక తెలుగు జ్యోతి.

ఇవే కాక అంతర్జాలంలో దాదాపు అన్ని తెలుగు వార్తాపత్రికలు వెబ్ పత్రికను కలిగివున్నాయి. సినిమా పత్రికలు అయితే పదుల కొద్ది ఉన్నాయి. వీటికి ట్రాఫిక్ బానే వుంటుంది.

ప్రస్తుతం యూట్యూబ్ బాగా పాపులర్ కావడంతో అన్ని రకాల వార్తలు, పుస్తకాలు అందులో లభ్యం కావడం వలన చదవడం కంటే వినడానికి ఆశక్తి చూపిస్తున్నారు నెటిజన్లు. కుకూ ఎఫ్.ఎమ్., చదువు, దాసుభాషితం లాంటి యాప్‌లు అందుబాటులోకి వచ్చాయి.

# మేలిమి ముత్యాలు-మంచెం చిత్రాలు



**"ఉప్పొంగే ఉత్సాహం నీదైనప్పుడు ఉవ్వెత్తున ఎదురయ్యే అవరోధాలెన్నైనా నీకు దాసోహాలే" కారణం...**

**ఆ ఉత్సాహం అతని బాధ్యతను విస్మరించేది కాదు. ఆ బాధ్యతను మరింత పెంచేదే గాక తన వృత్తికీ, పనిచేసే సంస్థకూ మరెంతో వన్నె తెచ్చేది. ఎంతో మంది వృత్తి కళాకారులు సైతం సాధించలేని ఆ ఘణతను అతని ఉత్సాహం సాధించింది. ఎన్నో అవార్డులు, మరెన్నో రివార్డులు సాధించి పెట్టింది. సమర్ధమైన, సృజనాత్మకమైన అధికారిగా జాతీయ స్థాయిలోనే తన సంస్థకు అత్యుత్తమ అవార్డును సాధించేలా చేసింది. అంతేకాదు సున్నితము, సౌహార్ద్రంతో నిండిన అతని హృదయకుంచె గీసిన సన్నని సౌకుమార్యమైన రేఖలు ఆహ్లాదకర వర్ణాలతో నిండిన అతని చిత్రాలను చూసిన ఎవరికైనా హృదయం తేలికపడుతుంది. ఆనందపడుతుంది. ఆహ్లాదభరితమౌతుంది. కారణం అతని చిత్రాల్లో ఆధునికత పేరుతో నేడు చూస్తున్న గజిబిజి రేఖలు, అర్ధరహిత ఆడంబర వర్ణాలు లేవు. సునిశితమైన రేఖలు, వాటితో రూపొందించిన అర్ధవంతమైన చిత్రాలు, వాటి మధ్య నింపిన ఆహ్లాదకర వర్ణాలు వెరసి అంతరిస్తున్న మన ప్రాచీన సంస్కృతి సాంప్రదాయాలు, వృత్తులు, జానపదాలు, గ్రామీణ జనజీవన సౌందర్యానికి అద్దంపట్టే అందమైన చిత్రాలు... వీటిని సృష్టించింది చిత్రకళనే వృత్తిగా భావించిన ప్రొఫెషనల్ చిత్రకారుడు కాదు. చిత్రకళను ప్రవృత్తిగా మాత్రమే తీసుకుంటూ ఎల్లవేళలా ఆర్థిక లావాదేవీలతో తీరిక లేకుండా గడిపే ఓ బ్యాంక్ ఉద్యోగి. అతనే తూర్పుగోదావరి జిల్లా రాజమహేంద్రవరం ఆంధ్రాబ్యాంక్ గ్రామీణాభివృద్ధి శాఖ సంచాలకుడుగా పనిచేస్తున్న మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావు గారు.**

అది 2008వ సంవత్సరం, జనవరి నెల, విశాఖజిల్లా అడపా చిత్రకళా పరిషత్ నర్సీపట్నం వారు నిర్వహిస్తున్న రాష్ట్రస్థాయి చిత్రకళాపోటీలు, కేవలం ప్రదర్శనా బహుమతి మాత్రమే దక్కిన నేను, మూడవ బహుమతిని సాధించిన నా మిత్రుడు బీర శ్రీనివాస్ ఇరువురం నర్సీపట్నం వెళ్లాం. ప్రదర్శనలో ఉంచిన రాష్ట్ర నలుమూలల నుండి వచ్చిన వివిధ చిత్రకారుల చిత్రాలను ఒక్కొక్కటే చూసుకుంటూ వస్తున్నాం. ఒక్కొక్కటి ఒక్కో శైలి. కానీ వాటన్నింటితోనూ మరింత ప్రత్యేకంగా ఓ రెండు చిత్రాలు అక్కడ అందరి దృష్టినీ ఆకర్షిస్తున్నాయి. ప్రత్యేకమైన గొప్ప విషయం ఏమీ ఆ చిత్రాల్లో లేదు, ఒకటి పురాణ సంబంధమైతే రెండోది సాంప్రదాయ బద్ధమైంది. కానీ వాటిల్లో మరేదో ప్రత్యేకత చూసిన ప్రతీ ఒక్కరినీ ఆకర్షించేలా చేస్తున్నాయి. కేవలం కలంతో మాత్రమే సాధ్యమయ్యే సన్నటి రేఖలు, అతను కుంచెతో గీయడం ఒక ఎత్తైతే, ఆ చిత్రాల్లోని రేఖలమధ్య పారదర్శకంగా పూసిన ఆ రంగులు మిగిలిన వాటికంటే చాలా ప్రకాశవంతంగా కనిపించడం మరో ఎత్తు. తరచి తరచి చూస్తుంటే ఆ చిత్రాల్లో కనిపిస్తున్న ఆ ప్రత్యేకతకు కారణం ఆయన రంగులు వాడే విధానంలోనే కనిపిస్తుంది. అదే వాష్ టెక్నిక్.

ఒక వర్ణం పూసిన తదుపరి దాన్ని కడిగి వేరొక వర్ణం పదే పదే పూసి వాష్ చేయడం ద్వారా చివరిగా పూసిన వర్ణాలకు తోడు అక్కడ పూర్వపు వర్ణాల తాలూకు ఛాయలు కూడా సూచాయగా కనిపించడం ద్వారా ఒక ప్రత్యేక శోభ ఆ చిత్రాల్లో కనిపిస్తుంది. అది కూడా బ్రష్‌తో రంగులు అద్దే మాదిరిగా కాకుండా అత్యంత సహజంగా ఉండే ఆ వర్ణ మాధుర్యం చూసే కంటికి చాలా హాయిగా అనిపిస్తుంది. రాష్ట్ర వ్యాప్తంగా ఆ పోటీకి వచ్చిన వందల చిత్రాల్లో ప్రథమ బహుమతిని సొంతం చేసుకున్న ఆ చిత్రాల తాలూకు చిత్రకారుడిని అభినందించి పరిచయం చేసుకున్నాం. అప్పటికే ఆయన ఆంధ్రాబ్యాంక్ హైదరాబాద్ ప్రధాన కార్యాలయంలో సీనియర్ మేనేజర్‌గా పనిచేస్తున్నారు. కానీ ఆ హెూదా తాలూకు డాబు, దర్పం ఏమీ అతనిలో కనిపించకుండా అతి సామాన్యంగా మాట్లాడిన తీరు మాకు చాలా సంతోషమనిపించింది. అంతే అప్పటి నుండి మాకు పరిచయం రోజు రోజుకూ పెరుగుతూ వచ్చింది.

ఒకప్పుడు చైనా, జపాన్ చిత్రకారులు వాడే వాష్ టెక్నిక్‌ను బెంగాల్ చిత్రకారులు నందలాల్‌బోస్ తదితరులు బాగా వ్యాప్తిలోకి తీసుకురాగా మనరాష్ట్రంలో దామెర్ల, రాజాజీ, భగీరధి, వరదా వెంకటరత్నంతో పాటు ఇటీవలనే మరణించిన కొండపల్లి శేషగిరిరావు ఆయన మరో శిష్యుడు "ఉల్చి"గా ప్రాచూర్యం పొందిన రెడ్డిబోయిన కృష్ణమూర్తిలు విరివిగా ఉపయోగించగా పూర్తిగా ఈ విశిష్ఠ కళా ప్రక్రియలోనే నేడు ఎక్కువగా చిత్రాలు వేస్తున్న విశిష్ఠ చిత్రకారుడు మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావు గారు. నేడు చిత్రకళాపాఠశాలల్లో విద్య నేరుస్తున్న విధ్యార్ధులకు సైతం తెలియని ఈ విశిష్ఠ కళాప్రక్రియనుపయోగించి విరివిగా చిత్రాలను వేస్తున్నది నేడు రాష్ట్రంలో మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావుగారే అన్నా ఆశ్చర్యపోనక్కరలేదు.

ఎంతో క్వాలిటీతో కూడుకున్న వాట్‌మన్ డ్రాయింగ్ షీట్స్‌పై ఖరీదైన విన్సర్ అండ్ న్యూటన్ కంపెనీ రంగు బిల్లలను మాత్రమే ఉపయోగించి చిత్రాలను వేయడం ఈయన ప్రత్యేకత. వృత్తి రీత్యా తీరిక లేకున్నప్పటికీ, ప్రవృత్తి పరమైన దాహార్తిని తీర్చుకునే క్రమంలో వీలుచిక్కినప్పుడల్లా తాను ఊహించిన బొమ్మల తాలూకు చిత్రాల్ని గీసుకోవడం, రోజుల తరబడి నిదానంగా సంతృప్తి అనిపించే వరకూ వేరొక చిత్రం వైపు పోకుండా ఏకాగ్రతతో చిత్రాల్ని వేయడం వలన ఆయన చిత్రాలు అంతప్రామాణికంగా కనిపిస్తాయి. మంచెంగారి చిత్రాల్లో ప్రధానంగా మనకు మూడు రకాల వస్తువు కనిపిస్తుంది. తరతరాలుగా మన సంస్కృతిలో ఇమిడిపోయిన ఆచారాలకు సంబంధించిన దేవుళ్ళ ఊరేగింపులు, సమర్పణలు, మొక్కుబడులు, గరగాటలు, మామిడితోరణ అలంకరణలు, పేరంటాల్లు లాంటి చిత్రాలు ఒకరకమైతే, గ్రామీణ జీవన సౌందర్యాన్ని ప్రతిబింబించే గొర్రెల కాపరులు, విజటబుల్ సెల్లర్స్, జాలరస్త్రీలు, బేంగిల్ సెల్లర్స్, గ్రామీణ కళారూపాలను తయారీ కళాకారులు, పాట్ పెయింటర్స్ లాంటివి ఇంకోరకం. ఇక చారిత్రక, మతపరమైనవి మూడోరకం. వీటిలో చరకుడు, దన్వంతరి, బౌద్ధజాతక కథలకు సంబంధించిన చిత్రాలు కొన్నైతే పురాణాలకు సంబంధించిన గణపతి, సరస్వతి, శివపార్వతి సమేత గణనాదులు లాంటి చిత్రాలు ఈ కోవలోకి వస్తాయి. చిత్రించే కళారూపం ఏదైనా ఆయన అందుకు ఉపయోగించే విధానం మాత్రం ఒక్కటే. అదే వాష్ టెక్నిక్. ప్రతిచిత్రం సన్నటి రేఖలతో చిత్రించిన తదుపరి ఆయా రేఖల మధ్య పారదర్శకంగా పొరలు పొరలుగా రంగులు పూసి చిత్రాన్ని ప్రకాశవంతంగా తీర్చిదిద్దడం ఆయన శైలి.

"దిష్టిబొమ్మలు" అన్న చిత్రంలో దంపతులిరువురు ఇంట్లో కూర్చుని ఆ కళారూపాలను రూపొందిస్తున్న ఆ సన్నివేశంలో వారు కూర్చున్న శైలి చూడచక్కగా వుంటే వారి గృహానికి వేలాడివున్న బూడిద గుమ్మడి ఉట్లు మన పాతకాలం నాటి గ్రామాలను గుర్తుకు తెస్తాయి. అలాగే అవిరేణి అనే చిత్రంలో ఒకప్పటి పెళ్ళిళ్ళ తంతులో ప్రముఖ స్థానాన్ని కలిగియుండే అవిరేణి కుండల తయారీ చిత్రం చూస్తున్నప్పుడు మన గ్రామీణ కళాసౌందర్యం గుర్తుకొస్తుంది. మిత్రులు అన్న వేరొక చిత్రంలో నేటి తరరానికి అసలు ఏమాత్రం తెలియని గుబ్బగొడుగులను



చిత్రించి మరలా మన గత కాలాన్ని గుర్తుకుతెస్తారు.

26 మే,1957న తూర్పుగోదావరి జిల్లా కాకినాడ సముద్రతీర ప్రాంతమైన "నేమాం" అనే గ్రామంలో జన్మించిన సుబ్రమ్మణ్యేశ్వరరావుకి బడిలో బలపం పట్టిన నాడే ఏర్పడ్డ చిత్రకళా ఆసక్తిని ఆయన పెద్దమ్మ వరహాలమ్మ మెచ్చుకునేది. హైస్కూల్‌లో ఉండగా చిత్రకళలో పద్మశ్రీ అవార్డు గ్రహీత తాడేపల్లి వెంకన్న అనే డ్రాయింగ్ టీచర్ చిత్రకళలో మెళకువలు నేర్పిస్తే, అంటార్కిటికా యాత్రలు లాంటి సాహసకార్యాలు చేసిన తన అన్న వెంకటరాయుడు మరియు అతని మిత్రులు విదేశాలు వెళ్ళినప్పుడల్లా అక్కడి రంగులు తెచ్చిఇచ్చి మంచెంను

ప్రోత్సహించారు. ఇంటర్‌మీడియట్‌లో వుండగా నీటిరంగుల్లో శివాజీ గెటప్‌లో ఉన్న శివాజీ గణేషన్‌ను వేసిన చిత్రాన్ని అప్పటి ఆయన కెమిస్ట్రీ లెక్చరర్ శ్రీ శాస్త్రిగారు ఫ్రేమ్ చేయించుకుని ఇంట్లో పెట్టుకోవడం, అలాగే తన బైపీసీ రికార్డులను కళాశాలలో స్పెసిమన్స్‌గా ఉపయోగించడం మరచిపోలేని అనుభూతులుగా ఆయన పేర్కొంటారు. గోదావరి జిల్లాకి చెందిన వ్యక్తి కావడంతో రాజమండ్రిలోని దామెర్ల రామారావు స్మారక చిత్రకళాశాలలోని దామెర్ల రామారావు చిత్రాలు, అడవి బాపిరాజు, అంట్యాకుల పైడిరాజు తదితరుల చిత్రాలలోని శైలి ఆయనను మొదట్లో బాగా ప్రభావితం చేసాయి. 1974లో అగ్రికల్చరల్ బి.యస్సీ చదివేందుకు బాపట్ల వ్యవసాయ కళాశాలలో చేరడంతో చిత్రకళలో ఆయనకు గొప్ప మలుపు తిరిగిందని చెప్పవచ్చు. కారణం అక్కడే ఆయనలో వాష్ టెక్నిక్ అనే కళాప్రక్రియకు బీజం పడింది. చిత్రకళకు సంబంధించి బహుళ ప్రయోగాలతో ఎన్నో అద్భుతాలు సృష్టించడంతో పాటు వాస్ టెక్నిక్‌లో అప్పటికే ఎన్నో గొప్ప చిత్రాలను సృజించిన ప్రఖ్యాత చిత్రకారుడు స్వర్గీయ ఉల్చి అక్కడ చిత్రకళాచార్యులుగా ఉండడంతో ఆయనతో ఏర్పడ్డ సాహచర్యంతో వాష్ టెక్నిక్‌లో చిత్రాలు వేయడం నేర్చుకున్నారు. ఆ శైలి ఆయనకు నచ్చడం, దానిపై మంచి పట్టు సాధించిన మంచెం నిరంతరంగా ఆ తరహాలో వందల చిత్రాలను వేస్తూనే వున్నారు.



ఇప్పటికే 2010లో రవీంద్ర భారతి ఐ.సి.సి.ఆర్. ఆర్ట్‌గ్యాలరీ హైదరాబాద్, 2011లో స్టేట్ ఆర్ట్‌గేలరీ హైదరాబాద్‌తో పాటు అనేక చోట్ల వ్యక్తిగత చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించిన ఆయన చిత్రాల్లో అనేకం రాష్ట్రంలోనూ, రాష్ట్రేతర ప్రాంతాలలోనూ అనేక ఉత్తమ బహుమతులందుకోవడం విశేషం.

2007లో ప్రఖ్యాత హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ ప్రవేశపెట్టిన తొలి గోల్డ్‌మెడల్ సాధించిన ఘనతను దక్కించుకున్న మంచెం 1997 మరియు 2006లో లలితకళాపరిషత్ విశాఖపట్నం వారి పోటీల్లో బెస్ట్ అవార్డ్‌ను అందుకున్నారు. ఇక 1996వ సం॥లో లలితకళా కేంద్రం బాపట్ల, హరివిల్లు ఆర్ట్ అకాడమీ పాలకొల్లు 1999లో కోనసీమ చిత్రకళాపరిషత్ అమలాపురం మరియు వి.ఎస్.ఎన్. ఆర్ట్ గేలరీ విశాఖపట్నం వారి జాతీయ చిత్రకళాపోటీలలోనూ 2002లో అంకాలా ఆర్ట్స్ అకాడమీ భీమవరం, 2003 మరియు 2005, 2008లో అడపా చిత్రకళాపరిషత్ నర్సీపట్నంల నుండి మొదటి బహుమతులను కైవశం చేసుకున్నారు. 2005లో ఉగాది సందర్భంగా రాష్ట్ర సాంస్కృతిక శాఖ ఆంధ్రప్రదేశ్ నిర్వహించిన రాష్ట్ర స్థాయి చిత్రకళా పోటీల్లో కూడా ప్రథమ బహుమతిగా ప్రకటించిన 5వేల రూపాయల కేష్ అవార్డ్‌ను మంచెం వేసిన చిత్రమే సొంతం చేసుకోవడం, ఆ తదుపరి అదే చిత్రం ఆంధ్రప్రదేశ్ పత్రిక ముఖచిత్రంగా రావడం విశేషం. అంతేగాక రాష్ట్రప్రభుత్వం చిత్రకళలో ప్రతీయేట ఇచ్చే 10వేల రూపాయలు కేష్ అవార్డును కూడా 2010లో మంచెం గారు అందుకున్నారు. ఇంకా వీరి చిత్రాలు కాళిదాస్ సాంస్కృతిక అకాడమీ ఉజ్జయిని, (2010) సౌత్‌సెంట్రల్ జోన్ కల్చరల్ అకాడమీ నాగపూర్, తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్ తదితరమైన చోట్ల ప్రదర్శించబడి వున్నాయి.

ఇటు వృత్తి, అటు ప్రవృత్తి రెండింటా సృజనాత్మకంగా ముందుకు సాగుతున్న మంచెం గారి కళా ప్రస్థానంలో తన భార్య శ్రీమతి సత్యాదేవి పిల్లలు రశ్మి, మరియు తేజల ప్రోత్సాహం మరువలేనిదని, వారే తన చిత్రాలకు మొదటి విమర్శకులని ఆయన చెప్తారు. పిల్లలు ఇరువురు సంగీతంలో, చిత్రకళల్లో రాణించడం విశేషం.

ఇక తన కళాజీవన యానంలో సాధించిన ఎన్నో విజయాలకు సైతం ఎలాంటి ఆడంబర ప్రచారాలకు తావివ్వక, ప్రశాంత జీవనదిలా ముందుకు సాగుతున్న మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావుగారి జీవన నడవడి ఒరవడి ఎందరికో ఆదర్శనీయం.

(2012 అక్టోబర్ సంచిక నుండి)

# ముని, మౌని గీచిన మోనాలిసా చిత్రం

పునరుజ్జీవన కాలపు విశిష్ట వ్యక్తులలో సుప్రసిద్ధుడు లియోనార్డోడావిన్సీ, అనేక శాస్త్రాలలో తనదైన ముద్రవేసిన శాస్త్రవేత్త చిత్రకారుడు, తత్త్వవేత్త, "నేర్పరి అయిన చిత్రకారుడు రెండు విషయాలు చిత్రించవలసి ఉంటుంది ఒకటి – బాహ్యరూపం అయితే రెండవది – అంతర్గత భావన" – ఇది డావిన్సీ సిద్ధాంతం. ఇతని చిత్రాలలో బాహ్యరూపాలే కాకుండా, వాటి యొక్క అంతర్గత మానసిక వైఖరి కూడా కనిపిస్తుంది. భౌతిక వస్తువులు కూడా ప్రకృతిలో మమేకమై కనిపిస్తాయి.

లియోనార్డో ఎప్పుడు తన చుట్టూ కల సజీవ ప్రకృతికి ప్రాధాన్యత ఇచ్చి, వాటి లోతులు తెలుసుకుని, విస్తృత అధ్యయనంతో చిత్రాలు సృష్టించాడు. ఎంత ఎదిగినా తానింకా నేర్వవలసినది చాలా ఉంటుందంటూ నిత్యనూతన విద్యార్థి వలే కృషి చేశాడు. యదార్థ చిత్రాల చిత్రణలో కళాకారునిగా స్వేచ్ఛను నిలుపుకుంటూనే, శాస్త్రీయ సత్యాలను అందించాడు. చిత్రంలోని వ్యక్తుల సంచలన శక్తిని ప్రతిఫలించేట్లుగా చిత్రరచన చేశాడు.

డావిన్సీ చిత్రకళ మాత్రమే కాకుండా మరెన్నో శాస్త్రాలను ఔపోసన పట్టినవాడు. అన్నిరంగాలలో కూడా సమాన ప్రతిభ చూపినవాడు, చిత్రకారునిగా ప్రపంచానికి తెలిసినవాడు. డావిన్సీ జీవితం, చిత్రకళ, అతను రాసిన డైరీలు (నోట్‌బుక్స్) అతని జీవితాన్ని విశ్లేషించడానికి ఉపకరిస్తాయి.

సాధారణంగా జీవించి ఉన్నవారిని మాత్రమే మనం విశ్లేషించగలం. కానీ ఎపుడో చనిపోయిన వారిని, మనకు దగ్గరగా లేనివారిని విశ్లేషించడం కష్టంతో కూడిన పని. దీనికై ప్రధానంగా ఉపకరించేవి "వారి ఆవిష్కరణలే"

వారి ఆవిష్కరణలో వెలుగు చూసే – వారి భావనలు, వారి సంవేదనలు, వారి అనుభూతులు, సృజన కార్యాలు మొత్తంగా కలగలసి వారి యొక్క జీవితాన్ని విశ్లేషించ కష్టసాధ్యం.

సిగ్మండ్ ఫ్రాయిడ్ మనో విశ్లేషణా విధానాన్ని కనుగొన్న తరువాత, తనకు సంబంధించి, తన వారికి సంబంధించి, మిత్రులు, రోగుల స్థితిగతులను పరిశీలించినారు. తరువాత



ఎప్పుడో జీవించి ఉండి. ప్రస్తుతం వారు శారీకంగా లేకుండా, వారియొక్క ఆవిష్కరణల వలన వారిని అంచనా వేయడానికి ప్రయత్నించాడు. ఇలా "డావిన్సీ" విషయమై పరిశోధించి విలువైన విషయాలను వెల్లడించారు.

డావిన్సీ డైరీలోని ఒక అంశం గురించి ఫ్రాయిడ్ చెబుతూ "నేను ఉయ్యాలలో ఉన్నపుడు, అంటే నా శైశవాలో ఒక గద్ద నాపై వాలి నన్ను ముద్దాడింది" అనే విషయం వ్రాసుకున్నాడు. ఇదొక స్వైరకల్పన ఇదొక విచిత్రంగా కనిపిస్తుంది. పాలు త్రాగేనాటి విషయాలు సాధారణంగా గుర్తుండవు. ఇది స్మృతి అనుకోవడం కన్నా స్వైర కల్పన అనుకోవడమే సరియైనది.

డావిన్సీ స్వైర కల్పన గురించి వివరాలకు ముందు అతని బాల్యం గురించి కొంత తెలుసుకుందాం. డావిన్సీ 1452లో విన్సీ

అనే చిన్న పల్లెలో సర్‌పియరోకు జన్మించాడు. ఇతడొక న్యాయవాది. కెటరినా అనే అమెతో ఏర్పడిన అక్రమ సంబంధం ఫలితంగా డావిన్సీ జన్మించాడు. తరువాత ఆమె మరొకరిని వివాహం చేసుకుంది. పియరో మరో అమెను వివాహం చేసుకున్నాడు. ఇలాంటి గందరగోళ పరిస్థితులలో డావిన్సీ పెరిగి పెద్దవాడయ్యాడు.



డావిన్సీ స్వైర కల్పన గరించిన విషయానికి వద్దాం – "తల్లి ఒడిలో పాలు త్రాగే పిల్లవాడు" నాటి నుండి నేటి వరకు చిత్రకారుల, శిల్పులు, కవులు, కళాకారులందరు తీసుకున్న ప్రధాన వస్తువు. గౌరవ భావంతో ఈ విషయాన్ని ప్రతి కళాకారుడు అందుకున్నవారు. మాతృమూర్తికి ప్రతీకగా నిలచిన ఈ అంశం పవిత్ర దృశ్యం అయింది.

మరి డావిన్సీ కల్పనలో తల్లి స్థానంలో గ్రద్ధ వచ్చి చేరింది. ఇది తల్లి మమకారం చూడలేక (లేక) పొందలేక ఇలా కల్పనలు చేశాడు. మరో రకపు కారణం – ఈజిప్షియన్ల దేవత "గ్రద్ధ" ఈమె "మట్". మాతృమూర్తికి ప్రతీక. సాంస్కృతిక పునరుజ్జీవన కాలంలో ఈజిప్షియన్ల సంస్కృతి ప్రత్యేకంగా అధ్యయనం చేయబడింది. ఈ కాలం నాటి చిత్రకారుడు డావిన్సీ. అందువలన ఇతని మీద కూడా ఈ ప్రభావం పడింది. మత గ్రంథాలు, ప్రకృతి అధ్యయనాలు, వాటి అంచనాలతో నాటి సంస్కృతిని అధ్యయనం చేయబడినది. నాటి తాత్త్విక అంచనాల ప్రకారంగా – "గ్రద్ధలలో మగజాతివి ఉండవని, వాటి అవసరం లేకనే పిల్లలు కలుగుతారనే ఒక కల్పన డావిన్సీ మనసులో తీవ్ర ప్రభావం చూపింది. తను అలా పుట్టిన వాడిననే అంచనా చేసుకున్నాడు.



ఇది కల్పన అయినా కూడా తల్లి స్థానం గ్రద్ధ అక్రమించడం తండ్రి లేకపోవడం, తల్లి వద్దనే ఒంటరివాడిగా ఉండడం. మొదటి ఐదు సంవత్సరాల వరకు తండ్రి ఎవరో తెలియక పోవడం వంటివి జరిగాయి. వ్యక్తి జీవితంలో మొదటి ఐదు సంవత్సరాలు జీవితకాలం నాటి అనుభవాలు జీవితంలో స్థిరపడి ఉంటాయి. అర్థరహిత బాల్య స్మృతులు, వాటిపై ఆధారపడిన కల్పనలు డావిన్సీ జీవితాంతం వెంటాడాయి.

ఈ కల్పనల ఆధారంగా పరిశీలిస్తే – డావిన్సీ మొదటి ఐదు సంవత్సరాలు ఏకాంతంగా గడపడం, అతని అంతరింగక జీవిత రూపకల్పనకు కూడా ప్రభావితం చేసింది. అతనిలో అన్వేషణ ప్రారంభమైనది. ఆ విధంగా వ్యక్తులు, పరిసరాలు, పక్షులు, జంతువులు, ఇలా ఒకటేమిటి సర్వ విషయాలను పరిశీలనగా చూస్తూ అన్వేషణ చేస్తూ, అధ్యయనం చేశాడు. ప్రతిదాన్నీ కుణ్ణంగా పరిశీలించడం మొదలుపెట్టాడు.

డావిన్సీ మేధావి మాత్రమే కాక, నైతికంగా, సామాజికంగా కూడా ఎంతో ఉన్నతుడు. ఎన్నో శాస్త్ర విషయాలు అతని మనస్సు, మస్తిష్కాన్ని క్రిక్కిరిసి ఉంచేవి. అతని భౌతిక జీవితం కన్నా, ఆధ్యాత్మిక జీవితం ప్రాధాన్యత వహిస్తుంది. అనతి నైతిక జీవితాన్ని అతని శత్రువులు కూడా వేలెత్తి చూపలేకపోయారు. అంత నిష్ఠతో జీవించాడు. అందుకే విమర్శకులు అతన్ని "ఋషి అన్నారు.

సార్థక జీవితానికి, నిజజీవితంలోని అరిషడ్వార్గాలను అదుపులో ఉంచుకోవాలని ఉద్బోధించిన జ్ఞాని – లియోనార్డో డావిన్సీ.

# "రంగుల స్వాప్నికుడు" వడ్డాది పాపయ్య



**మనం ఓ యాభైసంవత్సరాలు వెనక్కి వెళితే మనం వేయి సంవత్సరాలు ముందుకు వెళ్లినా కనిపించని అద్భుతాలు చూడొచ్చు. ఇలాంటి అద్భుతమే మనం ముద్దుగా 'వపా' అంటూ పిలుచుకునే చిత్రకళాబ్రహ్మ వడ్డాది పాపయ్య, అప్పట్లో సినిమా పోస్టర్లు ఈస్ట్‌మన్ కలర్‌లో అచ్చయి గోడలమీద అంటిస్తుంటే ప్రజలందరూ గుంపులుగా అక్కడికి చేరేవారు. సినిమా పోస్టర్ ప్రజలను ఆకర్షించినంత తేలిగ్గా కేవలం ఒక వ్యక్తి ఒక శక్తిగా ఎదిగి తన చిత్రకళా నైపుణ్యంతో తన వైపు తిప్పుకునేలా చేశాడు. ఆయనే కుంచెకు పాఠాలు నేర్పగల వడ్డాది పాపయ్య, వపా గొప్ప చిత్రకారుడే కాదు గొప్ప చిత్రకళా శాస్త్రవేత్త.**

మన ఇతిహాసాలు, పురాణాలు, ఋతువులు, కాలాలు, రాగాలు, నక్షత్రాలు, పండుగలు, కావ్యకన్నెలు లాంటి సమస్త అంశాలపై చిత్రాలు సృష్టించిన అమర చిత్రకారుడు వడ్డాది పాపయ్య.

చందమామ, యువ, స్వాతి, ఆనందవాణి, రేరాణి తదితర పత్రికల్లో వేలాది చిత్రాలు, వివిధ అంశాలపై తనదైన శైలిలో చిత్రించి, తెలుగు చిత్రకళకు జాతీయస్థాయి కీర్తి తెచ్చిన అమర చిత్రకారుడు వడ్డాది పాపయ్య (వపా) ఆయన కాలధర్మం చెంది మూడు దశాబ్ధాలు కావస్తున్నా, నేటికి ఆయన కళాప్రతిభ మసకబారలేదు. ఎందరో ఔత్సాహికులకు ఆయన చిత్రాలు స్ఫూర్తి కల్గిస్తున్నాయి.

కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి పుష్పవిలాపం, ఉమర్ ఆలీషా రచించిన ఉమర్ ఖయ్యాం పద్య సంపుటికి వపా అసాధారణ రీతిలో చిత్రాలు గీశారు. వపా చిత్రాలు ఎంత ప్రత్యేకత కల్గివుంటాయో, వారి చిత్రాలకు ఆయన పెట్టే శీర్షికలు అంతకు మించి వుంటాయి. కొన్ని శీర్షికలకు అర్థాలకోసం నిఘంటువును చూడాల్సి వచ్చేది.





వడ్డాది పాపయ్య చిత్రించిన ప్రతి చిత్రంలోనూ ఉత్తేజం కనిపిస్తుంది. తనలో జీవం ఉన్నంత వరకూ తన చిత్రాలకు జీవం పోసిన వ్యక్తి వడ్డాది

పాపయ్య. మనం 'వపా'గా పిలుచుకునే వడ్డాది పాపయ్యది చిత్రకళా విశ్వవిద్యాలయం. వడ్డాది పాపయ్య చిత్రించిన ప్రతి చిత్రమూ అద్భుతంగా పండింది.

వడ్డాది పాపయ్య ముఖచిత్రంలో అచ్చయిన పత్రిక మార్కెట్‌లోకి వచ్చిందంటే కళాభిమానులకు చెప్పలేనంత ఆనందం. ప్రింటింగ్ టెక్నాలజీ గురించి వడ్డాది పాపయ్యకు తెలిసినంతగా మరే చిత్రకారుడికీ తెలియకపోవచ్చు. ఎందుకంటే వడ్డాది పాపయ్య చిత్రాల ముఖచిత్రాలతో విడుదలైన పుస్తకాలు ఆకర్షించినంతగా మరే చిత్రకారుడూ ఇంతలా ఆకర్షించలేక పోయాడు. ఇదీ పెద్దాయన వడ్డాది పాపయ్యకు రంగుల మీద, కాంతి మీద ఉన్న పట్టు. చిత్రకళానిధి వడ్డాది పాపయ్య తన చిత్రాల్లో ప్రదర్శించిన నేర్పు, మెళకువలు అపారమైవి. వడ్డాది పాపయ్య చిత్రకళలో చేసిన సాధన, చూపిన టెక్నిక్ తన చిత్రాల్లో ఎన్నో చిత్రకళా రహస్యాలు దాచిన గొప్ప చిత్రకళాతపస్వి వడ్డాది పాపయ్య. వడ్డాది పాపయ్య చిత్రకళా శైలిని దాటి ఏ చిత్రకారుడు అంతటి అద్భుతం సాధించలేదు.



ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీకాకుళంలో ఒక సామాన్య కుటుంబంలో సెప్టెంబర్10న, 1921లో మహాలక్ష్మి, రామమూర్తి దంపతులకు పుట్టిన వపా, స్వయంకృషితో అసమాన్య చిత్రకారుడుగా చందమామ, యువ, స్వాతి తదితర పత్రికల్లో (1941-91) వేల చిత్రాలు గీచి తన ప్రతిభను నిరూపించుకొన్నారు. ఇతిహాసాలు, పురాణాలు, ఋతువులు, రాగాలు, నక్షత్రాలు, పండుగలు, పౌర్ణములు, భావ చిత్రాలు, రూపచిత్రాలు, సామాజిక చిత్రాలు ఇలా అన్ని అంశాలపై చిత్రాలు గీచినవారు మరొకరు లేరంటే అతిశయోక్తికాదు.

వపా చిత్రాలు తెలిసినంతగా ఆయన జీవిత విషాలు ప్రజలకు తెలియవు. ప్రచారం గిట్టని వ్యక్తిత్వం ఆయనది. చేసే కళాసేవా మౌనంగా, అజ్ఞాతంగా చేసేవారు. వీరి చిత్రాలు ఆంధ్రసంస్కృతి, సంప్రదాయాలకు ప్రతిబింబాలు. వపా తన 73వ ఏట డిశంబర్ 30న, 1992లో విశాఖజిల్లా కశింకోటలో కన్నుమూశారు.



*2021సం॥లో వపా శతజయంతి ఉత్సవాల సందర్భంగా 'వపాకు వందనం' శతవసంతాల ప్రత్యేకసంచికను విశాఖపట్నంలో ఆవిష్కరిస్తున్న దృష్యం.*

ఆ మాహాచిత్రకారుని శతజయంతి ఉత్సవాలను విశాఖ చిత్రకళాపరిషత్, 64కళలుడాట్‌కాం వారు ఉభయ తెలుగు రాష్ట్రాలలోను విశాఖపట్నం, విజయవాడ 2021 సెప్టెంబర్, అక్టోబర్‌లలో నిర్వహించారు. ఈ సందర్భంగా **'వపాకు వందనం'** పేరుతో శతవసంతాల ప్రత్యేకసంచికను ఆవిష్కరించి, వపా ఒరిజినల్ చిత్రాలతో ప్రదర్శనను ఏర్పాటుచేశారు.

మాకినీడి సూర్యభాస్కర్

# 'పగలే వెన్నెల' కురిపించగల గాయని జానకి

***శ్రోతల ఆశలను ఆడియాస చేయని మణిపూస... 'పగలే వెన్నెల' కురిపించిన రాతిరిలో జాబిలి... 'నీలిమేఘాలలో గాలి కెరటాలలో తాను పాడిన పాటనే వేళైనా వినిపించిన 'కిలకిల'కోకిల స్వరం శ్రీమతి ఎస్.జానకి. ఆమె గొంతు వింటూ కోకిల చిన్న బుచ్చుకుంటుందంటే అతిశయోక్తి కాదు.***



నాదస్వరమే ఆమె గొంతు. అనునాద స్వరమే పోటీ పడలేకపోయింది. 'కొంజుం సలంగై' అన్న తమిళ చిత్రంలో 'సింగార వేలనే దేవా' పాటకు కురుచ్చి అరుణాచలం అందించిన నాదస్వర సహకారానికి ధీటుగా తన గాత్ర సహకారాన్ని నాదస్వరం రేంజిలో అందించి మెప్పించిన గాయకమణి శిష్టా జానకి. తన సంగీత సారథ్యంలో సుబ్బయ్యనాయుడు, ఆ పాటలో నాదస్వరంతో మానవ స్వరాన్ని జత చేయగలగడం ఒక అసాధ్యమైన, అపూర్వమైన సంఘటన. దానిని సాధ్యం చేయడానికి ఆయన పడిన శ్రమ గొప్పది. మొదట ఆ పాటలో వినబడే నాదస్వర భాగాలన్నీ జాగాలుంచి రికార్డుచేసి, ఆ తర్వాత దానితో పాటూ కంఠాన్ని కలిపి రికార్డు చేయాలన్నది ఆయన చేయదలచిన ప్రయోగం. నాదస్వర శ్రుతితో శ్రుతి కలిపి పాడగల కంఠం మద్రాసులో వినబడకపోయేసరికి, బొంబాయి వెళ్లి, అక్కడా (విన) కనబడకపోయేసరికి నిరాశతో తిరగి మద్రాసు చేరి... యింకా ఆరా తీస్తున్న సమయంలో... "నాదస్వరం రేంజిలో గాత్రాన్ని వినినపించగల గాయని జానకి ఒక్కరే"నని పి.లీల ఇచ్చిన సలహా మేరకు ఆయనకు జానకి కనబడింది... చిన్న రికార్డింగు థియేటరులో టెస్టుకోసం ఆ పాటగా వినబడింది. చివరికి "ఓ.కె" అనిపించి, తమిళ శ్రోతలందరికీ వినబడింది.

అదే చిత్రాన్ని తెలుగులో 'మురిపించే మువ్వలు'గా డబ్ చేసినప్పుడూ అదే తీరులో "నీ లీల పాడెద దేవా" అంటూ పాడి, 'సరిలేరు తనకెవ్వరూ' అనిపించారు జానకి. అలాగే కన్నడ చిత్రం 'హేమావతి'లో 'శివ శివ యన్నదా' అంటూ వాయులీన స్వరంతో పోటీ పడ్డారు. అయితే ఆ పాట తననెంతో శ్రమకు గురిచేసిందంటారు, జానకి. వైద్యనాథన్ సంగీత దర్శకత్వంలో పాడిన ఆ పాట అభోగికి తోడైన తోడి రాగం. లైను లైనుకీ రాగం మారే తీరులో స్వరపరచబడిన ఆ పాటను ఏ అపస్వరానికీ (సంకర స్వరం) తావివ్వకుండా పాడటమే గొప్పయితే, పాట చివరలో స్వరాలు పలకడం ఒక పరీక్ష అయిందంటారామె. ఈ పాటలో మృదంగంతో కూడా పోటీ పడ్డారు జానకి. ఆ విధంగా వాద్య స్వరంతో మానవ స్వరాన్ని మేళవించి చరిత్ర సృష్టించిన అపురూప నిరుపమాన గాయని జానకి. బిస్మిల్లాఖాన్ షెహనాయీతో పోటీ పడుతూ 'సనది అప్పన్న' కన్నడ చిత్రంలోను, హరిప్రసాద్ చౌరాసియా వేణునాదానికి ధీటుగా ఆమె ఎన్నో పాటలు పాడారు.

23-4-1938న స్వగ్రామమైన గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా పల్లపట్లలో ఆయుర్వేద వైద్యులు శిష్టా శ్రీరామమూర్తి నాలుగవ కూతురుగా పుట్టిన జానకి, చిన్నప్పట్నించి చదువుపై శ్రద్ధ చూపలేదు. రాజమండ్రిలో ఉన్నప్పుడు తల్లి ప్రోత్సాహంతో బలవంతంగా నాదస్వర విద్వాన్ గాడేసల్లి పైడిస్వామి వద్ద శాస్త్రీయ సంగీత శిక్షణ నొక సంవత్సరకాలం అభ్యసించారు జానకి. సంగతులు వదిలేసి నేరుగా 'నగుమోము' కీర్తనలతో ఆమె శిక్షణను

ఆంభించారు పైడిస్వామి. ఆయన వద్దకు వచ్చే పెద్ద శిష్యులకు చెబుతన్నప్పుడు ఒకసారి విని పాడేసేది పదేళ్ల చిన్నారి జానకి. తన గురువుగారి ఆశీస్సుతో పాటు, ఆయన నాదస్వర విద్య ప్రభావం వల్లనే నాదస్వరంతో సమానంగా పాడగలిగానేమో అనే జానకి బహునిగర్వి. శాస్త్రీయ సంగీత విద్వాంసులు వంకరగా, యాసగా సాగదీస్తూ పాడతారనే ఉద్ధేశ్యంతో సంగీతాభ్యాసానికి సంవత్సరకాలం పాటు స్వస్తి చెప్పారు జానకి. అంతంత మాత్రంగా నేర్చుకున్న సంగీతంలోనే ఆమె మధురాతి మధురమైన పాటలెన్నో పాడగలిగారు.



మామగారు (అప్పటికింకా కాదుగానీ) ఫన్ డా॥ చంద్రశేఖర్ గారి ఉత్తరం ద్వారా ఎ.వి.ఎం. స్టూడియోనుంచి అడిషన్‌కు రమ్మంటూ పిలుపొచ్చింది. టెస్టుకోసం లతా మంగేష్కర్ పాడిన 'రాసక్ బల్యా' పాటను పాడి మెప్పించి, స్టాఫ్ ఆర్టిస్టుగా నెల జీతానికి కుదరుకున్నారు జానకి. అయితే ఎ.వి.ఎం.లో పాడడానికి ముందే టి. చలపతిరావు దర్శకత్వంలో (1957, ఏప్రిల్ 4న) 'విధియన్ విళైయట్టి' అనే తమిళ చిత్రంలో 'పేరై ఎన్ ఆపై పాళన దేనో' అన్న విసాదగీతాన్ని ఆలపించారు జానకి. ఆ మరుసటి రోజే ఎం.ఎల్.ఏ. చిత్రం కోసం ఘంటసాలతో కలిసి తెలుగులో మొట్టమొదటి గీతం కూడా శోక గీతమే కావడం చెప్పుకోదగిన విషయమైతే, ఏ.వి.ఎం. వారి కోసం సింహళంలో పాడిన పాట కూడా అంతే.

విషాద గీతాలతో ప్రారంభించినా, 'శోకంలో శ్లోకం'లాగా విషాదంలో నిషాదాన్ని స్వరపరచుకుని స్వరవాద్యాలను గాత్ర నాదపరంగా.. పరమంగా పరిణమింపజేశారు జానకి.

తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ, హిందీ, పంజాబీ, ఒరియా, తుళ, కొంకణి, సంస్కృతం వంటి దేశీయ భాషలతో పాటు, ఆంగ్లం, జర్మన్, జపానీ వంటి విదేశీయ భాషలతో కలిపి మొత్తం పదిహేడు వేల దాకా పాటలు పాడారు జానకి. అయితే ఏ భాషలో పాడినా ఆ భాష నేటివిటీని ఒడిసి పట్టి పాడగలగడం ఆమె ప్రత్యేకత. అందుకే ఆమె పాటను భాషా భేదం లేకుండా శ్రోతలందరూ ఆస్వాదించారు.

తెలుగులో జానకి పాడిన పాట 'నీలి మేఘాలలో... గాలి కెరటాలలో' అలా అలా అలలా సాగి వచ్చి ప్రేక్షక 'జగమే ఊయల'లూగేలా చేసింది. ఎంతటి ధీరుణ్ణైనా ఓడించగల 'ఆడదాని ఓర చూపు'లా జన మానసాలను లోగొంది ఆమె పాట. పదహారేళ్ల వయసు సిరమల్లె పువ్వుల్ని అలరించింది. దుర్యోధన, దుశ్శాసనుల దుర్నీతిని ఎండగట్టింది. ఆఖరికి 'నడిరేయి ఏజాములో'నో స్వామిని తిరుమల శిఖరాలు దింపింది.

ఆమె పాడిన ప్రతి పాట ఆమె గొంతులోనుంచి రాబట్టే అపురూపంగా ఉందనిపించేలా పాడారు జానకి. ఇంచుమించు ఆమె ప్రతి పాటలోను అనితర సాధ్యమైన ముద్రతో పాటు, ప్రయోగశీలత కూడా ఉంటుంది. పాట మధ్యలో నవ్వడం, పడుతూ నవ్వడం, నవ్వుతూ పాడడం లాంటి గమ్మత్తులు జానకి తప్ప మరెవరూ చేయలేకపోయారు. 'సిరిమల్లె పువ్వల్లె నవ్వు... చిన్నారి పాపల్లె నవ్వు' అన్న పాటను ఆసాంతమూ నవ్వు సంగీతంతో... నవ్వ రాగంతో ఆమె పాడిన తీరు అద్భుతం. అలాగే చిన్న పిల్లలకు పాడడంలో కూడ జానకి తర్వాతే ఎవరైనా. 'గోవుల్ల తెల్లన... గోపయ్య నల్లన' అని పాడుతుంటే అచ్చం పాలేరు పిల్లాడే వినిపిస్తాడు. అదే గొంతలో బొంగురు ఛాయను కలిపి 'పాప పేరు మల్లి... నా ఊరు కొత్త ఢిల్లీ' అని పాడుతుంటే నవ్వు రాక మానదు. పదహారేళ్ల 'సిరమల్లె పువ్వు' నుంచి 'అలకపానుపు నెక్కేను చిలిపి గోరింకా' అంటూ, పండు ముసలవ్వలా పాడగలగడం కూడా ఆమెకే సుసాధ్యం. ఆమె గానం వైవిధ్య భరితం.

భక్తి పాటైనా, రక్తి పాటైనా భావాసురక్తి జనకంగానే ఆమె పాడారు. నవ్వు పాటలైనా, నవ్వించే పాటలైనా... ఏడ్పు పాటలైనా, ఏడ్పించే పాటలైనా ఒకే రకంగా ఆమె గొంతులో జాలువారాయి. పైగా మాతృభాష అయిన తెలుగులోనే కాకుండా, ఇతర స్వదేశీ భాషల్లో కూడా అంత సాధికారంగానూ పాడి మెప్పించగలిగారు జానకి.

**కళలు 64 గా భారతీయులు గణించారు. వీటిని చతుష్షష్టి కళలంటారు. అవి వరుసగా:**

| | | | |
|---|---|---|---|
| ఇతిహాసము | రత్నశాస్త్రము | మోహనము | అశ్వ క్రియ |
| ఆగమము | రథాశ్వ గజకౌశలము | విద్వేషణము | మృత్రియ |
| కావ్యము | మల్లశాస్త్రము | ఉచ్చాటనము | దారుక్రియ (వడ్రంగం) |
| అలంకారము | సూదకర్మము | మారణము | వేణు క్రియ |
| నాటకము | దోహదము | కాలవంచనము | చర్మ క్రియ |
| గాయకత్వము | గంధవాదము | పరకాయ ప్రవేశము | అంబర క్రియ |
| కవిత్వము | ధాతువాదము | పాదుకాసిద్ధి | అదృశ్య కరణము |
| కామశాస్త్రము | ఖనివాదము | వాక్సుద్ధి | దూతీ కరణము |
| దురోదరము | రసవాదము | ఇంద్రజాలికము | వాణిజ్యము |
| దేశభాషా లిపిజ్ఞానము | జలవాదము | ఆంజనము | పాశుపాల్యము |
| లిపికర్మము | అగ్ని స్తంభనము | దృష్టి వంచనము | కృషి |
| వాచకము | ఖడ్గ స్తంభనము | స్వర వంచనము | ఆసవకర్మ |
| అవధానము | వాక్ స్తంభనము | మణి సిద్ది | ప్రాణి ద్యూత కౌశలము |
| స్వరశాస్త్రము | వాయు స్తంభనము | చోరకర్మం | జలస్తంభనము |
| శకునము | వశ్యము | చిత్ర క్రియ | మంత్రసిద్ధి |
| సాముద్రికము | ఆకర్షణము | లోహ క్రియ | ఔషధసిద్ధి |

'చందమామరావె', జడ్జిమెంట్' చిత్రాల్లో బేబి సుజితకు డబ్బింగూ, 'మౌనపోరాటం' చిత్రానికి సంగీత సారధ్యం వహించినా, ఎక్కువగా పాడడానికే అంకితమయ్యారు జానకి. అయితే స్వయంగా సంగీతం కూర్చుకుని 'కృష్ణ రవళి', 'నాదప్రవాహం', 'తెలుగులో భక్తి గీతాలు' వంటి ప్రైవేటు కాసెట్లను రూపొందిచారు. ఇంకా 'అయ్యప్ప గీతికాష్టకం', 'శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం', 'శ్రీ షర్దీసాయి గీతమాలిక' వంటి క్యాసెట్లను కూడా ఆమె పాడారు. ఎస్.పి బాలసుబ్రహ్మణ్యంతో కలిసి పాడిన వక్కలంక లక్ష్మీపతిరావు గారి 'ఆంధ్రపుణ్యక్షేత్రాలు' రికార్డు ఆమె గాన మకుటంలో కలికితురాయి. నిరంతర ప్రవాహంగా పాడడాన్నే జీవితంగా మలచుకున్న జానకి, శ్రీకృష్ణ, సాయిబాబాలపై పాటలు కూడా రాశారు. ఆమె చిత్రకారిణి కూడా, ఎక్కువగా శ్రీకృష్ణుడి చిత్రాలు గీసారామె.

అవార్డుల విషయానికొస్తే, ఆకాశవాణి పాటల పోటీల్లో ద్వితీయ బహుమానాన్ని అప్పటి రాష్ట్రపతి డా॥ బాబూ రాజేంద్రప్రసాద్ చేతులమీదుగా 1956లో అందుకుని, తర్వాత ఎన్నో పురస్కారాలు, అవార్డులు గెలుచుకున్నారు, జానకి. 'కర్ణాటక చలన చిత్ర రసిక సంఘం', 'లావణ్య' వార్తాపత్రికలు ఉత్తమ నేపధ్య గాయనిగా జానకిని అభినందించాయి.

ఆమె పాడిన 'పదునారు వయిదినివే' తమిళ చిత్రంలోని పాటకు మొదటిసారిగా జాతీయ అవార్డు వచ్చింది. 'ఓపోళ్' (మళయాళ) చిత్రంలో పాటకు రెండో సారి 'సితార' (తెలుగు) చిత్రంలో 'వెన్నెల్లో గోదారి అందం' పాటకు ముచ్చటగా మూడోసారితో 'హ్యాట్రిక్కు' సాధించి, 'దేవర మగన్' (తమిళం) చిత్రంలో పాటకు నాలుగో సారి ఆమె జాతీయ అవార్డు అందుకున్నారు. కేరళ ఫిలింఫాన్స్ అసోసియేషన్ 'ఆలింగనం' చిత్రంలో పాడిన పాటకు నేపథ్యగాయనిగా సత్కరించింది.

సినిమా సంగీతానికి స్వర్ణయుగ మనదగిన కాలంలో తాను నేపధ్య గాయనిగా ఉండడం తన అదృష్ట మంటారు జానకి. తన జీవితంలో పాడలేని రోజే రాదని విశ్వసనీయంగా చెప్పగల జానకి, పాడుతూనే పోవాలన్నది తన ఆశగా చెబుతారు. జీవితాన్ని పాటగా మలచుకున్న గాయకురాలి విషయంలో ఇది అత్యాశ కాదు... కాకూడదు.

'భువిలో విరిసిన పాటల పారిజాతం', శ్రీమతి ఎస్. జానకి.